A

# అభ్యుదయ

అభ్యుదయ రచయితల
ఐదవ మహాసభా సంచిక
1955 జూలై 30, 31 విజయవాడ

అభ్యుదయ రచయితల సంఘం,
విజయవాడ.

# 1

# ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసం

## ఉప్పల లక్ష్మణరావు

మిత్రులారా!

మా ఆహ్వానాన్ని అంగీకరించి యీ సభకు మీరందరు దయచేసినందుకు ఆహ్వాన సంఘం తరఫున మీకందరకూ నా కృతజ్ఞతాభివందనాలు. ఈ సభకు ఇంతమంది విద్వాంసులు, రచయితలు, కళాకారులు సాహితీపరులు, శిష్టులు దయచేశారంటే అభ్యుదయ రచయితల సంఘాన్ని పునర్జీవింపజేయడమనే విషయం ఎంత ప్రాముఖ్యమైందో నేను వేరే చెప్పనవసరంలేదు. అభ్యుదయ రచయితల సంఘం 1943 లో స్థాపించబడింది. అంతకుముందే ఆంధ్ర వాఙ్మయ రంగంలో అనేక సాహిత్య సంస్థలు అందులో ముఖ్యంగా సాహితీ సమితి, నవ్యసాహిత్య పరిషత్తు అమూల్యమైన కృషిచేసి మన సాహిత్యంలో గొప్ప మార్పును తీసుకొచ్చాయి. అప్పటిసాహితీ సంస్థలన్నింటికంటే చిన్నదైనప్పటికీ అభ్యుదయ రచయితల సంఘం పేరెన్నిక గాంచిన ఇతర సంస్థలతో పాటు శక్తివంచనలేక సాహిత్య సేవ చేసింది. పుట్టినది మొదలు అభ్యుదయ రచయితల సంఘం ఒక విశిష్ట ఆదర్శాన్ని ముందుంచుకుని పనిచేసింది. ముసాయిదా ప్రణాళికలో వివరించినట్టు అభ్యుదయ రచయితల సంఘం ఆంధ్ర చరిత్రలో నవయుగ వైతాళికులైన కందుకూరి, గురజాడ, గిడుగు మొదలగు వారి ఉత్తమ సంప్రదాయం అనుసరించి సాంఘిక శ్రేయస్సు సాహిత్యం యొక్క ప్రధాన లక్ష్యమని గుర్తించి సజీవమైన సాహిత్యసృష్టికి కృషి చేసింది. ప్రాచీన అధునాతన సాహిత్యాల్లోని ఉత్తమ లక్షణాలను స్వీకరించి, ఆంధ్ర సాహిత్యంలో ఒక నూతన రచనా సంప్రదాయము పాదుకొల్పింది. దేశసాహిత్య రీతులను పురస్కరించడానికి సమకాలిక జీవితాన్ని ఆయా రూపాల్లో చిత్రించి, ప్రచారంచేసి, ఆంధ్రప్రజల ఆదరాభిమానాలను పొందగల్గింది. సాంఘిక జీవితానికి దూరమైన సాహిత్య ధోరణులను విడనాడి ప్రజల జీవిత సమస్యలను కావ్యవస్తువులుగా గ్రహించి ప్రగతి శక్తులకు చేదోడు వాదోడుగా నిలిచి, తెలుగుజాతికి వెలుగు చూపింది.

కాని కారణాంతరాలచే 1948 సం॥ నుంచి అభ్యుదయ రచయితల సంఘం సాహిత్య రంగంలో ఒక నిర్మాణయుతమైన సంస్థగా పనిచేయలేకపోయింది. ఆ కారణాలేవో వివరించడం ఇక్కడ అప్రస్తుతం. మన ఆంధ్ర వాఙ్మయం యీనాడు ఎటువంటి సంధిస్థితిలో వుందో మనం తెలుసుకుంటే అభ్యుదయ రచయితల సంఘాన్ని పునరుద్ధరించడం

ఎంత ఆవశ్యకమో అభ్యుదయ రచన ఎంత అవశ్యమో మనకి తేటతెల్లము కాగలదు.

ఆంధ్రజాతి చరిత్రలో స్వర్ణయుగం అని చెప్పుకోదగు కాలం అతి కొంచెమే అయినా, ఆ కొద్ది కాలంలోనే మనజాతి ఖ్యాతిని ప్రపంచం నాలుగు మూలలా చాటేటట్టు నాటి ఆంధ్రుల మేటి శిల్పాలను, చిత్రాలను, కవితను, వాఙ్మయాన్ని, సంగీతాన్ని సృష్టించారు. అజంతా చిత్రాలు, అమరావతీ మహాబలిపుర శిల్పాలు, హంపీ ఏకశిలా నగరపు కట్టడాలు ఇందుకు నిదర్శనాలు. మహోజ్వలమైన యీ కళాసృష్టి నాటిజాతి మేధస్సునూ, విశాలభావాలనీ, ఆశ్చర్యం కొల్పు ఊహాశక్తిని, సాహసంతో కూడిన భావనానైపుణ్యాన్ని ప్రతిబింబింప జేస్తూంది. ఆనాటికళ, దారుఢ్యము వైశాల్యము కలిగినదే కాక, మృదుత్వాన్ని, సౌకుమార్యాన్ని, సౌందర్యాన్ని కలిగి భావగర్భితమై ఉత్తేజకరంగా వుండేను. ఈ కళాఖండాలు ఆనాటి సమాజంలోని ప్రజల సంస్కారానికి, అభిరుచికి, పట్టుదలకు, సాధనకు చిహ్నాలు. అప్పటి చిత్రకారులు, శిల్పులు, విద్వాంసులు, నాటి మానవుని ఆలోచనలను, ఆచరణలను మూలములైన సూత్రాలను తరచి తెలుసుకుని తమ కళాసృష్టిలో వాటిని నైపుణ్యముగా సజీవముగా చిత్రించడంలో సాధించిన విజయాలు, వారి బుద్ధికుశలతకూ పట్టుదలకూ కృషికీ ప్రతిఫలాలు. అలాగే ఆనాటి కవిత్వము, సంగీతము పరిపక్వముచెంది, ఆవేశపూరితమై, హృద్యమై, ఉన్నత శిఖరాలను అందుకొన్నాయి. ఆ స్వర్ణయుగం లోనే లయరాగ తాళములతో కూడుకొన్న ఆంధ్రసంగీతానికి (ఈ సంగీతాన్ని కర్ణాటక సంగీతం' అని ఎందుకంటారో నాకు బోధపడ్డంలేదు. 'ఆంధ్ర' సంగీతం అంటే వాళ్ళకి చిన్నతనమేమో!) త్యాగరాజు తన ప్రతిభావిశేషంచే ఒక నూతన ఉత్కృష్టతనూ సౌందర్యాన్నీ చేకూర్చాడు. క్షేత్రయ్యపదాలు, అన్నమాచార్యుని కీర్తనలు, ఇతర జానపద సంగీతం కూడ ఆ కాలంలోనే ఒక ఉచ్ఛదశకు వచ్చాయి. రసపూరితమై, హిందూ వేదాంతసార సమన్వితమైన ఆంధ్ర భారత కవిత్వాన్ని సృష్టించిన నన్నయ, హాస్య వ్యంగ్యాన్ని కురిపించిన తెనాలి రామకృష్ణుడు, మనోహరదృశ్యాలతోను, రమ్యమైన వర్ణనలతోనూ నిండిన ప్రబంధాలని రచించిన పెద్దనాదులు ఆ స్వర్ణయుగానికి చెందినవారే. ఆనాటి కళలు, ఆనాటి రచనలు, వాస్తవంగా వివిధరంగాల్లో ఆంధ్రజాతి ఔన్నత్యానికి ప్రాతినిధ్యం వహించాయి.

ఒకనాడు ప్రభవిల్లిన ఆంధ్ర నాగరికతకు వారసులమని చెప్పుకోడానికి మనకెంత గర్వింపదగిన విషయమే అయినా, వారు పెట్టిన నడికారంలో పురోగమించి యింకా అంతకుమించిన విజయాలను సాధించడానికి ఉత్సాహం, అభిలాష చూపించలేకపోయినవాడు మన గర్వం ప్రగల్భమే అవడంకాకుండా, అది మన సంస్కృతి క్షీణానికి చిహ్నమే అవుతుంది. వ్యాపార వాణిజ్యాలందే కాకుండా, ప్రప్రధానంగా కళాసాహిత్యాల్లో యీనాడు మన ఆంధ్రలో ఏర్పడ్డ ప్రతిష్టంభనకు తోటి భారత ప్రజలతోపాటు మనజాతి అనుభవించిన దుర్భర బానిసత్వము, అన్య పరిపాలన కొంతవరకు కారణములవడం నిర్వివాదం. నూతన శకారంభంలో అడుగు

బెట్టనున్న మనం యిప్పుడు మన వాఙ్మయ సాహిత్యాలు యెట్టి స్థితిలో ఉన్నాయో సింహావలోకనంచేసి, ప్రస్తుతం వాటిని ఆవరించిన నిస్తబ్ధత, నిరుత్సాహం, అయోమయం నుంచి మళ్ళించి ప్రగతిశీలమైన కొత్తదారిని పట్టించేటట్టు చేసే సమయం ఆసన్నమయింది.

మన జాతీయోద్యమం ప్రారంభదశలో ప్రజలు చూపించిన చైతన్యం సంఘంలోని దురాచారాలను, కరడు గట్టిన ఛాందస సత్వాన్ని సంస్కరించేద్ది కాకుండా, మన సారస్వతాన్నీ, కళలని నూతన మార్గాలని తొక్కడానికీ, జాతీయత ప్రోత్సహించేటట్లు చేయడానికీ కారణ భూతమైంది. స్వాతంత్ర్య సమరము ఉచ్ఛస్థాయిలో ఉండి, జాతీయ పౌరుషము, దేశాభిమానము, మిన్నుముట్టిన ఈ శతాబ్దారంభంలోనే రవీంద్రనాథు, ప్రేమచంద్, సుబ్రమణ్యభారతి, వళ్లతోళ్ మొదలగు మహాపురుషుల నేతలు మన సాహిత్యానికి, కళకి కొత్త వరవడులను దిద్దారు. ఆంధ్రదేశంలో కూడా ఆ కాలంలోనే మన జాతి యుగపురుషులగు కందుకూరి, గురజాడ, గిడుగు, కొమర్రాజు ప్రభృతులు తెలుగు సారస్వత వీథులందు వెల్గొందేరు.

ఆంధ్ర కవితా పితామహులగు నన్నయాదులు సాధించిన పరిపూర్ణత, సంపాదించిన కౌశల్యములతో వీరిరచనలు సాటియగునా కాదా యన్న వివాదము ప్రస్తుతము అసమంజసము. నాటి అధోగత సమాజానికి నాయకులైన ఛాందస పండితులయొక్కయు, సనాతనుల యొక్కయు మూఢపు వ్యతిరేకతను ఎదుర్కొని, పోరాడి, విజయాన్ని సాధించి, పాండిత్య ప్రకర్షతోనూ, ఆకారళ్ళ లోలత్వముతోనూ కూడా కొన్ని నాటివాఙ్మయ సాహిత్యరంగాల్లో విప్లవం తీసుకొని వచ్చారంటే అది సామాన్య విషయం కాదు. వారి ధైర్యము, ఉపజ్ఞ, విజ్ఞాన సంపత్తి అపారము. వారు వెలుగుబాట జూపిన వీరులు. కాని వారి అడుగులను త్రొక్కిన అనుచరులు విశేషించి లేకుండుటచేత ఆ మార్గాలు ముండ్లపొదలతో నిండి నేడు శిథిలమైపోయింది. ఈ దురదృష్టము ఆంధ్రుల దొక్కరిదే కాదు. దానిసత్వపు టంధకారంలో మునిగిన దేశీయ కళలు, సారస్వతము, పక్షవాతం వచ్చిన రోగిలాగున చైతన్య విహీనం అవడం సహజమే. శల్యావశిష్టమైన రోగియొక్క వ్యాధి నివారణకు అనేకులు ఔషధాలను ప్రయోగించారు. కాని వారి యత్నాలన్నీ తాత్కాలి కోపశమనాలే అయిపోయాయి. 1920, 30లలో ఆంధ్రసాహిత్య రంగంలో భావకవుల ప్రయత్నాలలో పొడచూపిన నూతన పోకడలే యిందుకు తార్కాణం. ఈ యువకులు ధైర్యసాహసాలతో చేసిన కృషిని న్యూనత పరచడం నా ఉద్దేశం కాదు. పాశ్చాత్య కళలలోని సంకొత్త రీతులనీ మన కవిత్వ విధానంలో ఉపయోగించడం తప్పక మెచ్చుకోదగ్గ విషయమే. కాని వారి భగీరథ ప్రయత్నాలన్నీ వ్యాధి నిర్మూలనంలో నిరర్థకములై పోయాయి. రోగికి కావలసినది శాశ్వత నివారణ కాని, తాత్కాలికోపశమనము కాదుగదా! దారుఢ్యం, చురుకుదనం, వర్చస్సు, జబ్బు నిమ్మళించి, ఆరోగ్యం కుదిరేటప్పుడే. బయల్పడుతుంది. కాని రోగికి అలంకరణం చేసినందువల్ల లాభమేమిటి? రోగి జీవనము కాపాడినందుకు వారికి మనం కృతజ్ఞులమే! జాతి

నాశనము చెందకుండడమే కాకుండా, సజీవమై, సర్వకళాశోభితమై అన్ని విధాల వృద్ధిచెందుతున్నప్పుడే కదా మనకి సంతోషం? 1940 సం॥ నుండి అభ్యుదయ కవులు చేయుచున్న కృషిని కూడా చేర్చాలంటే, మన సాహితీ పునర్వికాసం కోసం సల్పిన తీవ్రకృషి నంతటినీ సింహావలోకనం చేసినట్లే అవుతుంది. మనజాతి నావరించిన జాడ్యలక్షణాలని గ్రహించడమే కాకుండా, వ్యాధిమూలకారణాలన్నీ కూడా అవగాహన చేసుకొని, ఆంధ్ర సాహితికి చెప్పుకోనదగు మేలొనగూర్చిన గౌరవము అభ్యుదయ కవులదే. ఎంచేతంటే సంస్కృతి క్షీణించడానికి కారణం జాడ్యం కాదు. అది వికాసంచెంది వృద్ధిపొందడానికి వీలు కాని పరిస్థితులు యేర్పడ్డవే. జాతి శృంఖలాబద్ధమై, అణచబడి, పీడనాపరుల వశమైపోయింది. సంకుచితం, అనారోగ్యం అయిన ఈ బానిస ప్రదేశాలనుండి బైటపడి సారవంతమైన గ్రామసీమలలో నిలిచి, అభిమానంతో ఆదరించి ప్రేమతో పెంచే జనబాహుళ్యం వశం అయినప్పుడే మన సాహిత్య విత్తనాలు ఫలించి మనకృషి మహావృక్షమై పువ్వులతోనూ కాయలతోనూ సొంపుగా వృద్ధిచెందుతుంది.

ఉపమానాన్నుంచి విడదీసి స్పష్టంగా చెప్పాలంటే: సమాజంలో సంస్కృతి ఏ కొద్దిమంది చెప్పుచేతల్లో వశమైనప్పుడు కంటె, ప్రజలందరి సొత్తూ ఎప్పుడవుతుందో, అప్పుడే కళ, విజ్ఞానం, సారస్వతం వికసించి రాణిస్తాయి. శాస్త్రం, సాహిత్యం సామాన్యజనుల నిత్యజీవితంలో ఒక భాగమైపోయి, వారి ఆశలతోనూ, ఆశయాలతోనూ, కోర్కెలతోనూ ప్రతిబింబిస్తుంది. సారస్వతాన్ని సాహిత్యాన్ని అట్లా రూపొందించడమే మన అభ్యుదయ రచయితల లక్ష్యమూ, కర్తవ్యమున్నూ.

సాహిత్య రూపాలన్నింటిలో ప్రజా హృదయాన్ని చూరగొనేటట్లు కావ్య వస్తువును సాక్షాత్కరింప జేయడంలో ప్రధానమైనది నాటకము. నాటకము (సినిమా వలె) ధనవంతుల గుత్తపరిశ్రమ కానేరదు. భావరస పటుత్వం, శక్తివంతమైన వాస్తవిక కథావస్తువును కలిగి, నాటకము ఉత్సాహవంతులగు నటవర్గపు ప్రోత్సాహంతో ప్రజాదరణను పొంది, వారి హృదయాలను రంజింపజేయడానికి ఎన్నో అవకాశాలున్నాయి. అట్టి విషయపుష్టిగల నాటకములను రచించుటకు నాటక రచయితలకు నాటకముపట్లను, నాటకకళపట్లనూ, జీవితముపట్లనూ, అభ్యుదయ దృక్పథం కలిగివుండాలి. ప్రేక్షకుల సానుభూతిని పొంది వారి నుద్రిక్తులను చేసినంతమాత్రాన రచయిత సఫలీకృతుడు కానేరడు. ప్రేక్షకుల హృదయాన్ని కొంచెం కదలించి, వారి సానుభూతి పొందడంతో తన కర్తవ్యం నెరవేరినట్లు అభ్యుదయ రచయిత తృప్తిపడరాదు. విమర్శనా దృష్టితో పరిశీలించి, అందలి వివిధ సమస్యల యొక్క వాస్తవికత, వాటి పరిష్కార మార్గాల యొక్క ఆచరణ యోగ్యతను విచక్షణతోనూ, బాధ్యతతోనూ చర్చించునట్లు నాటకము ప్రేక్షకుని బుద్ధిని ప్రోత్సహింపగలిగిననాడే రచయిత కృతకృత్యుడు కాగలడు. దీనపరిస్థితులను వాస్తవముగా చిత్రించి, ప్రేక్షకులను దుఃఖితులను చేయడం నేర్పుకాదు. కన్నీటికి తావివ్వడం, బిగి సడలిన ఉద్రేకాల ఫలితమనీ, అది నిస్సహాయతని అంగీకరించిన బలహీనుడి

యొక్క ప్రక్రియా లక్షణం అని తెలియ చెప్తూ, ప్రజలను కార్యరంగంలోకి దుముకడానికి ఉద్రిక్తులనుగా చేసేటప్పుడే అభ్యుదయ రచయిత సఫలత పొందుతాడు. తమ హీనస్థితియెడల సానుభూతినీ, విచారాన్నీ చూపిస్తూ, వాటిని రూపుమాపడానికి శక్తికలవారైనప్పటికీ ఏ విధమైన చర్యలనీ తీసుకోనివారియెడల కోపోద్రిక్తులని చేసి, వారి అధీనంలోనున్న సిరిసంపదలని తమ హస్తగతం చేసుకోవడానికి ఉద్యమింపజేసినప్పుడే ఉద్రేకాలకి మానవ చేష్టలని పురిగొల్పే ప్రేరితంలో స్థానం వుంటుందని రచయిత రుజువు చెయ్యాలి.

ఉదాహరణకు "కన్యాశుల్కం"లో సంఘంలోని దుర్మార్గాన్ని, మోసాన్ని చిత్రించడంలో నాటకకర్త చాలావరకు కృతకృత్యుడయాడు. కాని దౌష్ట్యం, విషయలోలత్వం, మోసం, పోకిరితనం, కుహనా సంస్కారం బయల్పడేటప్పుడు సంఘం వాటిని క్షమించదని నిరూపించి వుంటే ఇంకా ఎన్నోరెట్లు నాటకకర్త సఫలీకృతుడయ్యేడివాడు. సమాజంలో దుష్టులు ఎప్పుడూ శిక్షని తప్పించుకోలేరనీ, దుర్మార్గులు మోసకారులుతోపాటు సంఘంలో పురోగామి శక్తులు అభ్యుదయ కాముకులుకూడా కలరనీ, ఈ శక్తులు సంఘంలోని దుర్మార్గాన్ని, పోకిరీలనీ, యూగాయి వాళ్ళనీ శిక్షించి అభివృద్ధి నిరోధకత్వం మీద విజయం సాధించడం, మానవసంఘ పరిణామ క్రమంలోని ఒక గొప్ప సత్యం అనీ నిరూపించగలిగినప్పుడే వాస్తవిక కళ ప్రస్ఫుటం కాగలదు. లేకపోతే ఆ వాస్తవికత కొంత అసంతృప్తిని కలిగించి, మంచితనంలో నమ్మకాన్ని తగ్గించి సంఘాన్ని మనం సంస్కరించలేమనే నిస్సహాయ నిస్పృహా భావాలని ఉదయింపజేయడానికి హేతుభూతమై అసంపూర్ణంగా వుండిపోతుంది.

ఇక్కడ అభ్యుదయ రచయితలకు ఒక చిన్న మనవి. కథానాయకుడు మంచి స్ఫురద్రూపి, మాటకారి పోకిరీలా కావచ్చు. ఇంగితజ్ఞానంకలిగి, రసజ్ఞుడై, అందరిహృదయాలనీ ఆకర్షించేవాడేని వుండొచ్చు. కాని, పోకిరీవేషాలు వేస్తూ, ఆకను అందకుండా, పోకను పొందకుండా, గాలిగుర్రంగా అచ్చువిడిచిన ఆంబోతులా తిరుగుతూ, స్వలాభంకోసం అమాయకులనీ, సత్యకాలపువాళ్ళనీ ఎరవేసుకుంటూ, పరాన్నభుక్కుడై, రుద్రాక్ష పిల్లులతోపాటు, కుహనాసంస్కార వేషభాషలు వేసుకున్న గుంటనక్కలలాగ, జీవితం గడుపుతూ వున్నవాడు - మనిషి అనిపించుకోడు. అంతేకాదు. కథానాయకుడు తన సంసార జీవనంలో ఆదర్శవంతుడైన గృహస్థు కావచ్చు. "ఒకే మాట, ఒక బాణం, ఒక పత్నీవ్రతుడైన శిష్టుడు కావచ్చు. కాని, తన పనిలో, తన వృత్తి, తన ఉద్యోగంలో, తన నియమితకార్యంలో, విసుగుతో పని ఎగవేస్తూ, అశ్రద్ధగా, నిర్లక్ష్యంగా, సోమరిపోతుగా ప్రవర్తిస్తే - అతగాడి యెడల పాఠకులకి సానుభూతి, అభిమానం కుదరకపోవడమే కాకుండా, అసలు అతగాడిని అసహ్యించుకుని చీదరించుకుంటారు. రోడ్డుమీద ఎదురుపడితే ఛీ అని తిడతారు. పేడనీళ్ళ మొహాన్ని కొడతారు.

మరో విశేషం గమనించండి. కథానాయకుడు తన నియమితకార్యాన్ని సావధానచిత్తంతోనూ, పట్టుదలతోనూ, నిర్వర్తిస్తున్నా, ఆ కార్యం ఎందుకూ

అక్కరకురాకుండా, ఎవ్వరికీ ఉపయోగ కారి కాకుండా, ప్రజోపయోగం పర మార్థం లేకుండావుండీ, అది తెలిసికొని వుండీకూడా ఆ కార్యాన్ని వదిలిపెట్టక, పనికి వచ్చే మరేదేనా పనిని చేపట్టకుండా వుంటే - అతన్ని సోమరిపోతుకింద, కొర గానివాడికింద మనం జమకట్టుతాం. అలాంటి కథానాయకునిమీద మనకి గౌర వం వుండదు. అపసంతివాడు మనకి ఆదర్శ పురుషుడు ఎట్లా అవుతాడు?

సాహిత్యంలో అభ్యుదయం తక్కు వగా వుండడానికి జనబాహుళ్యంలో నిరక్షరాస్యత, మన ఆంధ్రలో పుస్తక ప్రచురణం అమిత వ్యయ ప్రయాసలతో కూడుకొని వుండడం, ఆటంకాలుగాపరిణ మిస్తున్నాయి. ప్రచురింపబడ్డ కొద్ది ఉత్తమ గ్రంథాలయొక్క పరిచయ భాగ్యంపొంద లేక కేవలం వారపత్రికలతోనో మాస పత్రికలతోనో పాఠకలోకం తృప్తిపడ వలసి వస్తూంది. వారపత్రికలకూ మాస పత్రికలకూ గల పరిమితులను బట్టి, అవి చిన్న కథలనబడేటు రచనలకు తప్ప ఇతర సాహిత్యరూపాలకు ప్రోత్సాహ మీయలే కుండా వున్నాయి. అంచేతే మన సాహి త్యంలో ఈవేళ "చిన్న కథ" "కథానిక" అత్యంత ప్రాముఖ్యాన్ని సంపాదించుకొన గలిగేయి. కథారచన మిక్కిలి నైపు ణ్యంతో మలచదగిన దగడంచేత, మంచి చెయ్యి తిరిగిన వాళ్ళే ఆ శిల్పాన్ని ఆయుధంగా చేసుకుని సాహిత్య సాధ నలో విజయం సాధించగలుగుతారు. సిద్ధ హస్తులు కానివారి చేతుల్లో కథ నిరుపష్ట మైన ఆకారంగాని, విషయ విశిష్టతకాని లేక, పేలవమై, నిస్సారమై, నీళ్ళు నము లుతూ, ఎందుకూ కొరగాకుండా వుం టుంది. ప్రజలలో విప్లవ చైతన్యం, సం స్కారాభిలాష కల్గించడానికి వ్యంగ్యం, హాస్యం, వేళాకోళం గలిగిన కథలే ఉపయోగపడుతాయి. ఇలాంటి కథలు అతి అరుదుగా ప్రచురింపబడుతున్నాయి. ఇది ఎంతేనా విచారకర్మము. నాటక రచన రూపంలో ప్రహసనం వంటి ఆయుధాన్ని కందుకూరి ఎంత ధైర్యంగానూ, నిర్దాక్షి ణ్యంగానూ, ఎంత జయప్రదంగాను ఉప యోగించాడో మనకందరికీ తెలిసిన విష యమే. అలాగే వ్యంగ్య కథలని కూడా మన అభ్యుదయ రచయితలు రచించడం పూనుకోవాలని నా మనవి. సంఘంలోని కుళ్లును వేలెత్తి చూపించడం ఒక యెత్తూ, దాన్ని రూపుమాపేటట్టు చేయడం అంత కంటే పెద్దయెత్తూ. అందుకు వేళాకోళం, వెక్కిరింత, అపహాస్యం, ఎగతాళి ఎంతేనా పనిచేస్తాయి. కుహనా సంస్కారులు, డంబాచార్యులు, స్వంత డబ్బా వాయించు కుని సంఘంలో తిరిగే పెత్తందార్లు, లంచ గొండి ఉద్యోగస్థులు - వృత్తి రాజకీయ వేత్తలు, వీరందరికీ ఎగతాళి అంటే అతి భయం. వాళ్ళని చూసి మిగతావాళ్ళు నవ్వారంటే సహించలేరు. 'వాళ్ల హుందా తనాన్ని, దర్జాని' వేలుపెట్టి పొడిచేం అంటే, బెజ్జంపడ్డ "బెలూను" లాగ నేల కూలిపోతారు. అమూల్యమయినటువంటి ప్రహసనాలను మనం అంతర్జాతీయ సాహి త్యంలో చదువుతూనే వున్నాం. సమా జంలో వుండే కుళ్లునూ, చెత్త చెదారాన్ని అవి ఎలా బట్టబయలుచేసి, వాటిని రూపు మాపడానికి ఆయా దేశాల సాహిత్యం ఆ దేశాల ప్రజని ఎలా రేకెత్తించాయో కూడా మనకి తెలిసినదే. మన అభ్యుదయ రచయితలు కూడా యీ వ్యంగ్య రచనలో

తప్పక కృషి చేసి, మన సాహిత్యంలో ఈ లోపాన్ని పూర్తిచేస్తారని నమ్ముతాను.

ప్రజాభిప్రాయాన్ని సరిదిద్దగల శక్తి సాహిత్యరూపాలన్నింటిలో ఒక్క నవలకి మాత్రమే వుంది. మన సాహిత్యంలో ఈ రూపం యింకా పరిణితి పొంది పరిపక్వానికి రావలసివుంది. ఇప్పటికి వెలువడినంతవరకు నిన్న మొన్న ప్రచురించబడ్డ కొన్ని మినహాయించు మించు అన్నీ నవలలు అసంతృప్తికరంగానే వుంటూన్నాయన్నందుకు నన్ను మీరు క్షమిస్తారు గాక! గంభీరంగా కన్పించడానికి, అర్థరహితమైన తర్కవచనలతోనూ, ఆధ్యాత్మిక తత్వముతోనూ, భావడాంబికముతోనూ నవలలను నింపడం పాండిత్యాన్ని చాటుకోడానికే అవుతుంది కాని నవలకి ఏమాత్రం సౌష్టవంగాని, గంభీరతను గాని, ప్రజోపయోగం గాని ఆనందంగాని చేకూర్చడం లేదు.

ఎన్నో కష్టాలకి ఇబ్బందులకు లోనైనప్పటికీ జీవితంలో ఉత్సాహం కోల్పోవక ముందుకు మంచి దినాలు వస్తాయనే నమ్మకంతో నిరంతరం శ్రమించే సామాన్యుల సహృదయతనూ, ఉదారత్వాన్నీ, చిత్రిస్తూ వారి సమస్యలనూ, ఆశయాలనీ, వారుకనే కలలనూ, వారు సలిపే పోరాటాలనీ జీవం ఉట్టిపడేటట్టు ప్రతిబింబిస్తూ, వారి యెడల సానుభూతినీ, వారి ధీరత్వానికి గౌరవం ఒదవునట్లు రచించగలిగినప్పుడే అది సరియైన అభ్యుదయ సాంఘిక నవల కాగలదు.

రచయిత సాంఘికనవలని వ్రాసేటప్పుడు వాస్తవాన్ని చిత్రించాలి. వాస్తవం అంటే యదార్థం అనేకాదు. ప్రపంచంలోకాని, సంఘంలోకానీ, వ్యక్తులయొక్క జీవిత ప్రవృత్తులలోకానీ, ఉన్నది ఉన్నట్టు, మక్కికి మక్కిగా, తు. చ. తప్పకుండా - నకలు అచ్చుగుద్దినట్టు తయారుచెయ్యడం కాదు. సంఘానికీ వ్యక్తికీ వుండేటటువంటి నిరంతర అవినాభావ సంబంధాన్ని నిరూపించుతూ, పరస్పరం దైనందినం జరిగే టటువంటి సంఘర్షణలను ప్రగతిశీలంగానూ, అభివృద్ధిసూచకంగానూ, అభ్యుదయకరంగానూ, మానవుడిని, మానవ సమాజాన్నీ ఒక అడుగు ముందుకు తీసుకొనిపోయే విధంగా కథావస్తువును, సన్నివేశాలను, సంభాషణలను, సృష్టించి, శిల్పం చేసి, రచించడమే నిజమైన వాస్తవికత. అసలు పరిస్థితులు క్లిష్టంగా, క్రూరంగా, నిస్పృహాపూరితంగా, జుగుప్సాకరంగా ఉన్నాయనిచెప్పి, ఆ పరిస్థితులను చిత్రించడానికి రాజాదరణ పోతుందని భయపడో, సంఘం వెలివేస్తుందన్న వెరపుతోనో, డబ్బున్నవాళ్ళ ప్రాపకం పోతుందనే భీతితోనో, అవి లేనట్టే నటించడమో, వాటిని తేరిపారచూడడానికి దమ్ములులేక అవి ప్రత్యక్షమైనప్పుడు తలవంచుకోవడమో, కళ్లుమూసుకోవడమో, మనకేం సంబంధం అని పెడచెవినిపెట్టడమో, లౌక్యం కాదని ముఖం చాటేసి మౌనం వహించడమో వాస్తవిక రచన అనిపించుకోదు.

అయితే, ఈనాటి రచయితలలో కొందరు ఈ విషయాన్ని అంగీకరించరు. ధర్మయుగం అప్పుడే రానే వచ్చిందనీ, సామ్యవాద సమాజం నిన్నో మొన్నో భూమిమీద వెలిసిందనీ, కథ కంచికివెళ్లింది కాబట్టి మనం ఇంటికి వెళ్ళిపోయి హాయిగా కాలుమీద కాలు జాపుకుని కడుపుల్లో చల్ల కదలక కూర్చుండ వలసిన కాలంలో - సంఘర్షణ, సమరం, లడాయి, యుద్ధం, తగవులు, తంపులు, గలాటా, జగడం - వీటికి తావులేవనీ, అట్టి

వైరుధ్యాలు ఎక్కడో ఎప్పుడో యే మూలో తలయెత్తినా, తటస్థపడినా, వాటిని గురించి పెద్దగా చిత్రించి, అరచి, హంగామా చేయనవసరం లేదనీ, అథవా వాటిగురించి రచించినా, బంగారానికి వన్నె పెట్టినట్టు, సత్యానికి నగిషీ పెడితే తీరిపోతుంది, అంతేకాని వాటిని చిత్రించి ప్రచారం చెయ్యడం రచయిత యొక్క ధర్మం కాదనీ, వాటిని గురించి పదే పదే వ్రాయడం కళాసృష్టికి అపచారం చెయ్యడం అవుతుందనీ కొందరు అంటూన్నారు. వీరిమతం ప్రకారం "స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః...లోకాస్సమస్తాః సుఖినోభవంతు..." అనే ప్రవచనాన్ని కవులురచనలోనూ, కవితా సృష్టిలోనూ, కళారూపాల్లోనూ చిత్రిస్తే - అదే ఉత్కృష్టమైన రచనయొక్క కళయొక్క పరమావధి అని. నిజం చెప్పాలన్నస్తే ఇది పలాయనమాత్రం తప్ప మరొకటి కాదు. ప్రగతిశీలుడైన రచయిత మానవసమాజాన్ని చిత్రించేటప్పుడు-బుద్ధిమంతుల్నీ, వెర్రి వెంగళాయిలనీ. ప్రయోజకులనీ అప్రయోజకులనీ, స్వార్థులనీ, త్యాగులనీ, వీరులనీ, పిరికిపందలనీ - అందరినీ చిత్రిస్తాడు. ఒకే వ్యక్తిలో మంచి చెడ్డ గూడావుంటాయి కాబట్టి, సద్గుణాలనీ దుర్గుణాలని కూడా చూపిస్తాడు. ఐతే - ఏ గుణాలైతే మానవాభ్యుదయానికి దోహదం యిస్తాయో, యే లక్షణాలైతే మానవజాతి శుభోదయాన్ని సుస్థిరం చేస్తాయో, యే స్వభావమైతే ప్రగతిశీలాన్ని ఇనుమడింప చేస్తుందో వాటిని చక్కగా ఆకర్షణీయంగా చిత్రిస్తూ పాఠకుల హృదయాలని రంజింపజేసేటట్టు కరని అల్లుతాడు. మానవ స్వభావంలో వుండే అరిషడ్వర్గాలని మూసి కళ్ళకి గంతలు కట్టుకోడు. 'నన్ను ముట్టుకోకు నామాలకాకీ' అని దూరంగా అంటే ముట్టకుండా మడి గట్టుకుని కూచోడు. స్వతహాగా మానవాళి అంతా, ప్రతీ వ్యక్తీ, సౌఖ్యం, సౌందర్యం, సౌభాగ్యం, సంతోషం - స్వభావయుతంగా కాంక్షిస్తారనీ, వాటిని పొంది అనుభవించడానికి సహజంగా శాయశక్తులా తంటాలు పడతారనీ, ఈ కాంక్ష ఈ తపాతహ, ఈ ఉబలాటం మానవుడిని ముందుకు అభ్యుదయోన్ముఖంగా తీసుకుపోయే మహత్తరశక్తి అనీ నమ్మి ఆ విధంగా తన రచనలని సాగిస్తాడు. మనుష్య స్వభావంలో అంతర్గతం అయివుండేటటువంటి స్వార్థాన్ని, నీచాన్ని, కపటాన్ని, కుళ్ళుని అతను అర్థంచేసుకుంటాడు. వాటిని లోబర్చుకోవడం ఎలాగో వాటిని అదుపాజ్ఞల్లో వుంచడం ఎలాగో, వాటిని జయించడం ఎలాగో - అది కూడా తన రచనల్లో నిరూపిస్తాడు అభ్యుదయ రచయిత.

అన్ని కళారూపాల్లోకీ అతి ప్రాచీనమైనది సంగీతంతోపాటు కవిత్వం. నవీన కవితగురించి అనేక విమర్శలు జరుగుతూన్నాయి. దుర్భరములై ప్రయోజనరహితములైన శృంఖలాలని త్రెంచుకొని, భావము స్వేచ్ఛపొంది, కవిత్వం అభివృద్ధి చెంది పురోగమనానికి మొదటి అవరోధాలని తొలగించిన నవీనకవులు శ్లాఘనీయులు కాని వారు అధిగమించినది మొదటి ఆటంకం మాత్రమే నన్న సంగతి మనం గుర్తుంచుకోవాలి. ప్రాచీన కవిత్వం ఆకార శబ్దలోలత్వముతో నిండి, గ్రాహ్యము కాకుండా వుంటే, నవకవిత్వం భావలోలత్వంతో బాధపడుతూంది.

(మిగతా 79 వ పేజీలో)

# మహాసభకు సందేశాలు

మద్రాసు ప్రధాన న్యాయమూర్తి

## శ్రీ పాకల వెంకట రాజమన్నారు

విక్టోరియా క్రెసెంట్,
ఎగ్మోర్, మద్రాసు.

మహాశయా !

ఆంధ్ర అభ్యుదయ రచయితల ఐదవ మహాసభకు తమరు పంపిన ఆహ్వానం అందింది. అనేక కారణాలవల్ల నేను సభకు రావడానికి వీలులేకుండా ఉంది.

ఆంధ్ర అభ్యుదయ రచయితలతో నా సానుభూతి ఇప్పటిదికాదు. ఒక పర్యాయం మహాసభ నా అధ్యక్షతనే జరిగింది.

అభ్యుదయ రచయితలు ఆంధ్ర సాహిత్యానికి చేసిన సేవ అపరిమితం, ప్రశంసనీయం.

ఈమారు మహాసభ శ్రీ శ్రీ గారి ఆధ్వర్యంలో ఒక గొప్ప సాహిత్య యజ్ఞంలాగ జయప్రదంగా జరగగలదని నా నమ్మకం — నా కోరిక.

విధేయుడు,
రాజమన్నారు.

★

జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్ రచయితల సంఘాధ్యక్షురాలు

## అన్నా సేగర్స్

ప్రపంచము నందంతట స్నేహానికీ, శాంతికీ వుపకరించగల అభ్యుదయ సాహిత్యాన్ని పెంపొందించే కృషిలో మీ మహాసభ అఖండవిజయం పొందవలెనని జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్ రచయితలు ఆశిస్తున్నారు.

మహాపండిత

# శ్రీ రాహుల్ సంకృత్యాయన్

ముస్సోరీ, 5-7-55.

ప్రియసహచరులారా,

అనారోగ్య కారణంగా నేను ప్రయాణం చేయలేను. ఇందుకు క్షమించండి.

మీ సభ జయప్రదం కావాలని గాఢంగా ఆశించుతున్నాను. ఆంధ్రరచయితలు తమ కార్యక్షేత్రంలో ఆదర్శప్రాయులు కాగలరని నా గాఢ విశ్వాసం.

భవదీయ
రాహుల్.



సుప్రసిద్ధ బ్రిటిష్ రచయిత

# జాక్ లిండ్సే

ఎస్సెక్స్, (బ్రిటన్)

ప్రియ మిత్రులారా !

మీ సభ జయప్రదం గావాలని కోరుతూ నా గాఢాభివందనాలను తెలియజేస్తున్నాను. నేడు ప్రపంచ వ్యవహారాలలో భారతదేశ అభ్యుదయవాణి రోజురోజుకూ పెంపొందుతూ ప్రముఖపాత్ర వహించుతూంది. ఈ పరిణామంలో, రచయితలుగా మీకు చాలా ముఖ్యపాత్ర ఉంది.

శాంతి, సౌభ్రాతృత్వం, మీ ప్రజల అభ్యుదయ ఉద్యమాల ఆశయాలను తెల్పే భారతీయ రచనలలోని సంపన్నత, సౌగంధము నే నెరుగుదును. ఈ క్లిష్టదినాలలో సరికొత్త విజయాలకు ముందుకుపదండి!

భవదీయుడు,
జాక్ లిండ్సే

## ప్రఖ్యాత ఉర్దూ సాహిత్యవేత్త
# డాక్టర్ అబ్దుల్ అలీమ్

అలీఘుర్ యూనివర్శిటీ,
అలీఘుర్.

ప్రియ మిత్రమా,

ఆంధ్ర అభ్యుదయ రచయితల ఐదవ మహాసభకు హాజరుకావలసిందని మీరు పంపిన ఆహ్వానానికి అనేక ధన్యవాదాలు. మహాసభకు హాజరుకావాలని ఎంతో కుతూహలం వున్నా, అనివార్యమైన కారణాలవల్ల రాలేకపోతున్నాను.

మీ మహాసభ జయప్రదమగుగాక! రాజకీయాభిప్రాయ భేదాలతో నిమిత్తంలేకుండా దేశభక్త, ప్రజాతంత్ర రచయితలనందరినీ ఒకే త్రాటిపైకి ఈ మహాసభ తేగలదని ఆశిస్తున్నాను. ప్రస్తుత పరిస్థితులలో అన్నిరకాలైన సంకుచిత భావాలనూ విడనాడి శాంతి, ప్రజాభ్యుదయాల సాధనకోసం చేతులు కలపటమే రచయితలందరి విద్యుక్తధర్మంగా భావిస్తున్నాను. సాహితీ, సంస్కృతీ రంగాలపై ఈనాడు ప్రసరిస్తున్న అనారోగ్యకరమైన విదేశీ ప్రాబల్యాన్ని, ముఖ్యంగా పాశవిక మనస్తత్వాన్ని రెచ్చగొట్టే చిత్రాలనీ, బీభత్సరస ప్రధాన గ్రంథాలనీ, బూతు సాహిత్య ప్రభావాన్నీ అరికట్టేందుకు రచయితలంతా ఒకటి కావాలి. సాంస్కృతిక పురోభివృద్ధికి ప్రబల ప్రతిబంధకాలుగా తయారైన జాతీయ దురహంకారాన్నీ, మౌఢ్యాన్నీ ప్రతిఘటించాలి.

ఈ విషయాలన్నింటిలోను మీ మహాసభ చక్కని దారి చూపగలదనీ, దేశభక్త, ప్రజాతంత్ర రచయితల నందరినీ సమైక్యపర్చగలదనీ నా ఆశాభావం.

భవదీయుడు,
అబ్దుల్ అలీమ్.

★

# అభ్యుదయ రచయితల మహాసభ

# అధ్యక్షోపన్యాసం

## శ్రీ శ్రీ

సభాసదులకు నమస్కారం. చాలాకాలానికి మళ్ళీ మనమంతా సమావేశమౌతున్నాము. ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తర్వాత ఇదే మన మొదటి మహాసభ. మనకి ప్రత్యేక రాష్ట్రం సిద్ధించింది కాబట్టి—అందులోనూ భాషా ప్రాతిపదిక మీద మనం కోరుకున్న రాష్ట్రం, అసమగ్రంగానైనా ఆకృతి ధరించింది కాబట్టి తెలుగువారిని కలవరపరుస్తున్న సమస్యలన్నిటికీ పరిష్కారం చేయబడుతుందనుకున్నాము. ముఖ్యంగా రచయితల పరిస్థితులు బాగుపడతాయనుకున్నాము. కాని మనం ఆశిస్తున్న దొకటైతే యథార్థం ఇంకొకలాగ కనబడుతోంది. ఎటుతిరిగినా ఏదో నిస్త్రాణ, ఏదో నిస్పృహ! ఫౌల్ చేసి, గోల్ చేసి గెలిచిన ప్రతీప శక్తులు పట్టపగ్గాలు లేకుండా విజృంభిస్తున్నాయి. అయిదారేళ్ళకు పూర్వం అభ్యుదయ రచయితల సభల్లో పువ్వులదండల్ని వేయించుకొని, పెళ్ళికొడుకుల్ని చేయించుకొని జయజయధ్వానాల మధ్యన ఊరేగిన మిత్రులు కొందరీనాడు క్షుద్ర ప్రయోజనాల మరుమరీచికల వెంటబడి ఉద్యమ విచ్ఛిత్తికి దారితీస్తున్నారు. సరియైన నేతృత్వం లోపించడంవల్ల యువకుల తరంలోకూడా ప్రమాదభరితమైన ఒకానొక నిరుత్సాహ నిరాశాధోరణి తలయెత్తుతూన్న సూచనలు కనబడుతున్నాయి. ఇటువంటి సంకీర్ణ, సంక్లిష్ట వాతావరణంలో ఈనాడు మనం సమావేశమౌతున్నాము.

కాని, ఒకటిమాత్రం నేను గట్టిగా చెప్పగలను. ఇప్పుడు గోచరిస్తూన్న ఈ నిర్లిప్తత కేవలం తాత్కాలికం మాత్రమే. పురోగమన శీలమైనది కాలం. పశ్చా

దృక్కుల ప్రగల్భఘోషలకు లక్ష్య పెట్టక మానవ మహోదయం దిక్కుగా క్రాంతిరథం కదలి పోతుంది. తొలినించీ తెలుగుజాతి ప్రగతిమార్గంలో అగ్రేసరంగానే నిలిచింది. అవాంతరాలకు జడిసి ఆగిపోవడంగాని, అనర్థకాలకు లొంగి అలిసిపోవడంగాని గతంలో జరగలేదు; ఆగతంలో జరగబోదు. సుస్థిరమూ, సుస్పష్టమూ అయిన ఈ విశ్వాసమే ఇక్కడ మనందరినీ ఏకత్రపరిచిందని ఘంటాకంఠంగా హెచ్చరిస్తున్నాను.

స్వతంత్ర భారతదేశంలో, విశేషించి - స్వతంత్రాంధ్ర దేశంలో ఏంచెయ్యాలో తోచక తెనుగు మానిసి దిక్కులుచూస్తూ ఎంతో కాలం నిలబడిపోడు. ఇదీ నా అచంచల విశ్వాసం. ఇందులో రాజకీయాలు మిళితమై ఉన్నాయని పసిగట్టే వాళ్ళతో వాదించి ప్రయోజనంలేదని నాకు తెలుసును. మనది నూటికి నూరుపాళ్ళ సాహిత్య సంస్థఅనీ, ఇందులో ఏ రాజకీయ పక్షానికీ పెత్తనం ఉండబోదనీ మన ప్రణాళిక నిష్కర్షగా స్పష్టంచేసింది. కొన్ని ప్రధాన సూత్రాలకు కట్టుబడి, కొన్ని ప్రత్యేక లక్ష్యాలను దృష్టిలోఉంచుకొని మనం పనిచేస్తాం. అందుకు కొందరు హర్షిస్తారు. మరికొందరు అపహసిస్తారు. వీరి ఇష్టానిష్టాలతో నిమిత్తంలేకుండా ఈ సూత్రాలనవలంబించడంలోనూ, ఈ లక్ష్యాలను సాధించడంలోనూ మన నిజాయితీని నిలబెట్టుకోవాలి. అది పద్యం కానీండి, కథ కానీండి, నాటకం కానీండి, నవలకానీండి, మరే సృజనాత్మక, విమర్శనాత్మక రచన ఐనా కానీండి - మనల్ని ఏవైపు తీసుకు వెళ్ళుతోంది? ఎక్కడికి చేరుస్తుంది అన్నదే గీటురాయి.

సాంఘిక ప్రయోజనం - అదీ అభ్యుదయ రచయితల లక్ష్యం. ఇది ఈనాడు మనం కొత్తగా ప్రవచించడంలేదు. అనాదినించీ ఉత్తమ సాహిత్యంలో అనుస్యూతంగా కనబడుతూన్న లక్షణమే ఇది. తిక్కన మహాభారతం రచించినా, వేమన ఆటవెలది పద్యాలు చెప్పినా, నిన్నగాక మొన్న గురజాడ కన్యాశుల్కం నాటకం వ్రాసినా వారందరూ అర్థించింది ఈ ప్రయోజనమే. సంఘానికి విరోధి అనో, సంఘంనుంచి ప్రవాసినో గోలపెట్టే రచయితలుకూడా

కొందరు లేకపోలేదు. కాని వాళ్ళ నిత్యజీవితంలోకి కాస్త తొంగిచూస్తే చాలు, సంఘం చేకూర్చగల సదుపాయాలన్నింటినీ వారు చక్కగా వదుకోవడం కనబడుతుంది. కొండొకచోట, సంఘానికి తామిచ్చిన దానికంటె చాలా రెట్లు అధికంగానే సంఘంనించి సంపాదించుకొన్న వాళ్లూ ఉన్నారు. అయినా వాళ్ళు మహాబాధలు పడిపోతున్నట్లు పోజులు పెడతారు. అవిచూసి కనీసం కొంతమందైనా జానుకాబోలని జాలిపడక తప్పదు కదా!

మరికొందరున్నారు. వీళ్ళకైతే సంఘం గురించి కొన్ని కచ్చితమైన అభిప్రాయాలున్నాయి. వీరిదృష్టిలో నేటి సంఘం భ్రష్టంపాలైపోతోంది. స్త్రీలు చెడిపోతున్నారు. రోజులు మారిపోతున్నాయి. ఆ యొక్క దిలీపమహారాజు కాలంలో అని వీరి పురాణం ఆరంభమౌతుంది. ఎన్నికలూ, ఎలక్ట్రిక్ దీపాలూ లేనికాలం, ఏనుగుచేత పూలదండ పంపించి కాబోయే రాజుని కనుక్కునే కాలం, (ఏం? అదీ ఒకరకం ఎలెక్షనే!) భార్యల్ని జూదంలో ఓడిపోవడానికీ, బజారులో అమ్ముకోవడానికీ అనుమతించే కాలం, (సత్యకాలమంటే మరేమిటి?) ప్రపంచమంతా ఏడు ద్వీపాలూ, ఏడు సముద్రాలూ అని నమ్మే కాలం, కాలమే ఒకగడియారమై దానికీ వీళ్ళచేతిలోఉంటే ఎన్నియుగాలు మనల్ని వెనక్కి తీసుకు వెళ్ళగలరో! అన్నట్టు, వీళ్ళదృష్టిలో మనం ఏదివెనకనుకుంటే అదే ముందు! వీరు కోరేదికూడా అభ్యుదయమే! అభ్యుదయ పరంపరాభివృద్ధి అనేగా మన ప్రతీ ప్రబంధమూ ప్రారంభమయేది? ఈ మాదిరి అభ్యుదయంకోసం శాసనాలు చెయ్యాలనే కుతూహలంగల పరిపాలకులు కొందరు మనకి తటస్థపడుతున్నారు. పండితమ్మన్యులు కొంతమంది వారికి బాసటగా తయారౌతున్నారు. వీరు నిర్బంధంగా మన విద్యార్థులందరినీ బహుభాషా కోవిదులుగా చేసేస్తారు. ఒక్క పదిహేనేళ్లు ఓపిక పట్టండి. మాతృభాష తెలుగు, పితృభాష హిందీ, పితామహుభాష సంస్కృతం, సోదరభాష అరవం, సోదరీభాష కన్నడం – ఇలాగ ఒక పెద్ద అవిభక్త కుటుంబం ఆవిర్భ

విస్తుంది. ఆహా! ప్రజాస్వామ్యం!! ఓహో మనోహర స్వప్నం!

హిమాలయోత్తుంగమైన ఈ ఆదర్శశిఖర మాట అటుంచి మనం ఆశించే అభ్యుదయం ఎలాంటిదో ఆలోచించుదాం. మనం కోరేది అందరికీ తిండి, అందరికీ వసతి, అందరికీ పని! ఇక నేం? ఇలాంటి అభిప్రాయాలు ప్రకటించడమంటే ప్రమాదకరమైన రాజకీయ ఘోర ణిలో పడిపోవడ మన్నమాటే! మీ పాట లేనో, పద్యాలేవో మీరు రాసుకోకుండా రచనలోకి రాజ కీయాలు తెస్తారేమిటని విసురు! కాని, రామాయణాలురాసే వాళ్ళ కైతేమాత్రం రాజకీయాలు లేవను కోవడం పొరపాటు. జీవితంలో మార్పు కావాలనేవారు కొందరు. అది అనవసరమేకాక అనర్థ దాయకం అనేవారు కొందరు. ఈ పరస్పర విరుద్ధభావాల సంఘర్షణ లోనే జీవితం పురోగమిస్తుంది. అది సాహిత్యంలోకూడా ప్రతిఫలిస్తుంది. ఆ సంఘర్షణని చిత్రిస్తూ, అలా పురో గమనానికి దారితీసే సాహిత్యాన్ని సృష్టించడమే అభ్యుదయ రచయితల ధ్యేయం. తండ్రి తాత లార్జించిన ఆస్తివల్లగాని, పదిమందిచేత చాకిరీ చేయిస్తూ, వారి శ్రమకుతగ్గ ప్రతి ఫలం ఇవ్వకుండా కూడబెట్టిన డబ్బు వల్లగాని సుఖంగా బతుకు వెళ్ళ బుచ్చుతున్న వారికీ, వారి ప్రయోజ నాలకి రకరకాలుగా రక్షణలు కలి గించే రచనలు చేసేవారికీ ఇప్పు డున్న పరిస్థితులు మారడమంటే ఇష్టం ఉండదు. ఇలా కాకుండా ఇంకో విధమైన జీవిత విధానం ఉందనీ, అందులో ఒకవ్యక్తి ఇంకొక వ్యక్తిని దోచుకోవలసిన అగత్యం విలుప్తమవుతుందనీ, అందరూ ఆనందమయ జీవితంగడి పే అటువంటి విధానంలోనే మాన వత్వం విశాలంగా వికసిస్తుందనీ విశ్వసించేవాళ్ళూ, అట్టి విశ్వా సానికి తమరచనల్లో దోహదమిచ్చే వాళ్ళూ ఆ మార్పుని ఆహ్వానిస్తారు. అలాంటి మనో ప్రపంచం వైపు మహాప్రస్థానం సాగించడమే అభ్యు దయ రచయితల లక్ష్యం.

పారిశ్రామిక యుగంలోకి ఇప్పు డిప్పుడే మనం ప్రవేశిస్తున్నాము. బుల్డోజర్లను ఉపయోగించడ మంటే పవిత్రమైన భూమాత గుండెల్ని చీల్చడమే అని అపోహలు పడే మనస్తత్వం ఇంకా మనల్లో కొంతమందిని వదిలిపెట్టడంలేదు.

"మనుష్యుడు ఎగరడమే భగవంతుడి ఉద్దేశమైతే మనం రెక్కలతోనే పుట్టి ఉండేవాళ్ళం" అన్నాడట వెనకటి కెవరో పెద్దమనిషి, విమానాలు కనిపెట్టే ప్రయత్నాలను వెక్కిరిస్తూ! విమానాలదాకా యెందుకు. భగవంతుడిచ్చిన కాళ్లనుపయోగించకుండా సైకిళ్లమీద వెళ్లేవారిమీద శాపనార్థాలు కురిపించే ముసలమ్మలుకూడా ఉన్నారు. ఈ మధ్య నేను Conquest of space (ఆకాశాలను జయించడం) అనే ఫిలింను చూశాను. అందులో గంటకు పాతికవేలమైళ్లవేగంలో కుజగోళంవైపు ప్రయాణంచేసే గగన నౌకకు నాయకత్వం వహించినవ్యక్తి మధ్యదారిలో తన మనో ధైర్యం కోల్పోయి, జేబులోంచి బైబిలు తీస్తూ "నిక్షేపంగా బతకమని దేవుడు మనకి భూగోళాన్ని ప్రసాదించగా కుజగోళం మీద కాలుపెట్టడం పాపం, భగవంతుని పట్లనే అపచారం" అని తిరుగు ప్రయాణానికి మరలు తిప్పబోతాడు. అప్పటి కప్పుడే నౌకలోని టెలివిజన్ తెరమీద కుజగోళం కనబడుతూ ఉంటుంది. ఐనా నాయకుడు బేజారెత్తిపోతాడు. తరువాత కథ తెరమీదనే చూడండని సవినయంగా మనవిచేస్తూ ఇక్కడ నేను చెప్పబోయేదేమిటంటే మానవుణ్ని ముందుకు తీసుకుపోయే శక్తులతోబాటు వెనక్కి దిగలాగే శక్తులు కూడా ఉన్నాయనీ, ఇవి లేవని కళ్లు మూసుకోవడం పనికిరాదనీ, వీటి స్వభావాన్ని గుర్తించి అడుగడుగునా వాటిని ప్రతిఘటించి తీరవసిందే అనీ!

పారిశ్రామిక విప్లవంవల్ల మానవుని మనః ప్రవృత్తిలో ఒక పెద్ద మార్పు వచ్చింది. ప్రకృతి శక్తులకు మానవుడొక బానిస అనే దురభిప్రాయం పరాస్తం కావడమే ఈ మార్పు. అటు, హైడ్రోజెన్ బాంబుల ఉదాహరణ చూపించి ఆధునిక విజ్ఞానం మానవ వినాశనానికే దారితీస్తున్న దనుకోవడం పొరపాటు. ఏ మానవ మేధస్సు ఈ శక్తులను విడుదల చేసిందో అదే వీటిని అదుపులోకి తీసుకు వస్తుంది. ఇకోధికంగా జీవితాన్ని సుఖవంతం చెయ్యడానికే ఈ శక్తుల్ని ఉపయోగిస్తుంది. శాస్త్రీయ విజ్ఞానం మానవునిలో స్వాతంత్ర్య

భావాలు వికసించడానికి తోడ్పడు తుంది. ఈ స్వాతంత్ర్యం సమగ్ర స్వరూపం ధరించి నప్పుడు ఎదుటి వాడి స్వాతంత్ర్యాన్ని అపహరించడం అనే వ్యాపారానికి తావుండనే ఉండదు. స్వాతంత్ర్యం అవిభాజ్యం!

అందుచేత ఈ ఆధునిక విజ్ఞాన మంతా తెలుగువారి కందుబాటు లోకి వచ్చేటట్టు మనమందరం కృషి చెయ్యాలి. సాహిత్యం అంటే కేవలం కథలూ, కవిత్వాలూ మాత్రమే కాదు. ఈనాడు మెకానికల్ ఇంజనీరింగుకి కాని, ఫొటోగ్రాఫీకి కాని ప్రత్యేకించబడ్డ పత్రికలు లేని మన సంస్కృతి దారిద్ర్యాని కేమనుకోవాలి! యంత్ర సాహాయ్యంవల్ల బొమ్మలు తీసే ఫొటోగ్రాఫీ ఎందువల్ల కళ అని పించుకుంటున్నదో తెలిసినవా ళ్లెంతమంది? నేటి విజ్ఞానమంతా చేపడాలంటే ఏ మారుమూల సంస్కృతపదాలో – అవైనా గురికి బారెడు దూరంగా సరిపోయేవి.– గాలించి పారిభాషిక పదాలు సరఫరాచేసేదాకా మన కుర్రాళ్లు చేతులుకట్టుకొని కూర్చోవలిసిందేనా? ఇప్పటికే నాగరిక ప్రపంచం యెదుట ఎన్నో విషయాలలో వెనుకపడిపోయిన మనంఇంకా ఎన్నాళ్ళు నికృష్టంగా కాలంగడపాలి? యూరోపియన్ భాషలన్నింటిలో శాస్త్రీయ పదాలు ఇంచుమించుగా ఒక్కలాగే ఉంటాయి. ఆ పద్ధతిని తెలుగు భాషలోకి ఆ పదజాలాన్నంతా యథాతథంగా ఎంత పెందరాళే తెచ్చుకుంటే అంత మంచిది. అంతేగాని కర్బన ద్వ్యమ్లజనిదము, ధనవిద్యుదావేశ అయస్కాంత తీగ అంటూ అర్థం పర్థంలేని వంకరటింకర దవడనొప్పి మాటలకోసం ఆగిపోవలసిన అగత్యంలేదు. అన్యదేశ్యాలను దిగుమతి చేసుకోవడంవల్ల తెలుగు భాషలోని శుచీశుభ్రతా మైలబడిపోతాయనే మడికట్టుకున్న వాళ్ళని చూసి మనం జాలిపడాలి. ఇక్ష్వాకులనాడు విధించిన నియమాలతో ఇప్పుడు భాషను నేర్చుకోవాలనే వారి చాదస్తంవల్లనే నేటి విద్యార్థులలో విషయపరిజ్ఞానం మృగ్యమైపోతోంది. విద్యార్థుల సంగతి అలా వుంచండి. అన్ని చదువులూ చదివి, బియ్యేలూ, యమ్మేలూ పాసై సర్వీసెస్ కమీషన్ పరీక్షలకు కూర్చున్నవాళ్ళుకూడా, సెక్రెహా

అంటే అదో రకం వింతజంతువనీ, రాజేంద్రప్రసాద్ అంటే అడయారులో ఒక భవనమనీ - సరిగ్గా ఇవే ప్రశ్నలూ, ఇవే జవాబులూ అని కాదు, అసందర్భంలోనూ, అజ్ఞానంలోనూ ఇందు కెంతమాత్రమూ తీసిపోని అవకతవకలు వ్రాయడం మనకి తెలియనిది కాదు. "పనసపండు తెచ్చి పళ్ళెంలో పెడితే తినలేని బ్రాహ్మడు దిక్కుదిక్కులు చూశా"డని మన పొడుపు కథ ఉంది. మన విశ్వవిద్యాలయాలూ జాతీయ ప్రభుత్వాలూ ఈపొడుపు కథ గురించి జాగ్రత్తగా ఆలోచించగలవని ఆశిస్తున్నాను.

సాధారణంగా ఏ ఉద్యమానికైనా ముఖ్యసూత్రాలన్నీ ఆదరణీయంగానే, అంగీకారయోగ్యంగానే కనబడతాయి. ఈ మధ్య వందమందికి పైగా రచయితలు సంతకం చేసిన దస్తావేజు చూస్తే అందులో ఉన్నతాశయాలకి అభ్యంతరం చెప్పవలసిన అవసరమే కనబడదు. ఎటొచ్చీ ఈ ఆశయాలు ఆచరణలోనికి రావలసివచ్చినప్పుడే తబ్బిబ్బులూ, తడబాటులూ, తికమకలూ వచ్చిపడతాయి. అందుకనే ఇటీవల నేను అఖిలభారత దేశపు పి. ఇ. యన్. పెన్ క్లబ్బులో నా సభ్యత్వానికి రాజీనామా ఇస్తూ అందుకు ఒకే ఒక కారణాన్ని పేర్కొన్నాను. "మానవమాత్రుడినైన నాకు మహోన్నతాలైన మీ ఉత్తమాదర్శాలను అందుకోవడం కష్టంగా ఉం"దని. "సత్యంవద, ధర్మంచర" అంటే కాదనే వాళ్లెవరు? వచ్చిన చిక్కల్లా ఆ సత్యం అనేదేమిటో, ధర్మం అనేదేమిటో విశదీకరించడంలోనే ఉంది. ఎప్పుడూ ఆదర్శాలను గురించే మాట్లాడేవాళ్లని ఎప్పుడూ మనం అనుమానించవలసే వుంటుంది. అందుకనే అభ్యుదయవాదులకి కూడా కొన్ని ఆశయాలున్నప్పటికీ వాటినిక్కడ సవిస్తరంగా వల్లించడం మానేస్తూ ఆచరణ రూపంలోనికి వాటి ననువదించగల సాధనాలకోసం మనమందరమూ కలిసి అన్వేషించవలసిన అగత్యానికే ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తున్నాను. ప్రతి రచయితా అమూల్యంగా ఎంచుకునే వ్యక్తిత్వానికిది ఎంతమాత్రమూ భంగకరంకాదు. విడివిడిగా ఏ ఒక్కడూ చెయ్యలేని పనులు సాహిత్యానికి సంబంధించినవి

ఎన్నైనా ఉన్నవి. కలిసి కట్టుగా పనిచెయ్యడంవల్ల వీటిని మనం సాధించగలం. ఎవడికి తోచినట్టు ఎవడికి చేతనైనట్టు వాడు వ్రాసుకోకుండా ఈ సంఘాలెందుకు, సమాజాలెందుకు, ఉద్యమాలెందుకు అనుకొనేవారికి జవాబుగా మన కార్యక్రమాన్ని బహుముఖాలుగా రూపొందించుకోవలసి ఉంది.

మన కార్యక్రమంలో మొట్టమొదటిదీ ముఖ్యంగా పేర్కొనవలసినదీ రచయితల ఆర్థిక పరిస్థితిని బాగుచెయ్యడం. చంద్రునిలోని అమృతాన్నిమాత్రమే సేవిస్తూ ఏ రచయితకూడా ఎంతో కాలం జీవించలేడు. అందరిలాగే అతడు కూడా అన్నవస్త్రాల అగత్యం ఉన్నవాడు. ఈ విషయాల్లో నేటి ప్రభుత్వాలు అవలంబిస్తున్న పద్ధతులు కనుతుడుపుగానే పరిణమిస్తున్నాయి గాని రచయితలకు కావలసిన భద్రతను సమకూర్చలేక పోతున్నాయి. రాజకీయ బాధితులకు భూములు కట్టబెట్టినట్టుగా అనుగ్రహపాత్రులైన ఏ కొద్దిమందికో అంగవస్త్రాలను (అన్నవస్త్రాలనుకాదు) సమర్పించడంతో ఆగిపోతున్నారు మన ప్రభువులు. మనలో కొందరు గిరీశాలు "మానాస్తం హైద్రాబాదు నవాబు వద్ద వెయ్యి సిక్కా రూపాయీల ఉద్యోగం సంపాదించలేక పోతామా" అని అడియాసలు పెట్టుకోవచ్చు. సమష్టిపరమైన సమస్యను వ్యక్తిగతంగా పరిష్కరించాలని చూసే ప్రయత్నాలు నేడు పెచ్చుపెరిగి పోతున్నవి. అందువల్లనే ఏ ఒక్కడికో పాడిగేదెలాంటి పదిలమైన ఉద్యోగమూ, పదిమంది పస్తులతో మాడిపోవడమూ ప్రత్యక్షంగా కనబడుతోంది. అభ్యుదయ రచయితల సంఘం ఈ పరిస్థితులన్నింటినీ నిశితంగా పరిశీలించి తరణోపాయాలను కనిపెట్టగలుగుతుందని నాఆశ. నిరక్షరాస్యత పూర్తిగా నిర్మూలించబడ్డ పాశ్చాత్య దేశాల దాకా పోనక్కర లేకుండానే మన పొరుగునఉన్న తమిళ రచయితలను చూచి మనం నేర్చుకోవలసిన గుణపాఠాలు చాలా ఉన్నాయని చెప్పసాహసించినందుకు నన్ను క్షమించండి ఇప్పుడున్న కాపీరైటు చట్టం ఎంతో అసమగ్రమే అయినప్పటికీ దాని ద్వారానే తమకు

సంక్రమిస్తున్న హక్కులు మన రచయితలలో ఎంతమంది వినియోగించుకోగలుగుతున్నారు! పాతిక ముప్ఫయి సంవత్సరాలకి పూర్వంకంటె ఈనాడు రచయిత రచయితగా జీవించడానికి ఎన్నో మార్గాలు తెరుచుకొనిఉన్నాయి. అయితే ఈ మార్గాలనిండా ఎంతో చెత్తా, చెదారమూ మన మ్యునిసిపాలిటీల వీథుల్లోలాగ నిండి ఉన్నాయి. చీపురుకట్టలు పట్టుకోవడం ఆత్మగౌరవానికి భంగం అనుకోకుండా రచయితలు ఈ మార్గాలను శుభ్రంచేసి రహదార్లుగా మార్చవలసిఉంది.

ఈ మార్గాలకి ఒక ఉదాహరణగా రేడియోను పేర్కొంటున్నాను. అభ్యుదయ రచయితల సంఘం ఏదో రాజకీయ పక్షానికి అమ్ముడుపోయిందని నిందారోపణలు చేసేవారిని నా మాటలు కాస్త జాగ్రత్తగా మననంచేసుకోవలసిందని అభ్యర్థిస్తున్నాను. మన రేడియో నూటికి నూరుపాళ్ళు ప్రభుత్వం జారీచేసే తాఖీదులను అమలుపరచే సంస్థ. కనీసం విశ్వవిద్యాలయాలకు ఉంటున్నదనుకున్న పాటి స్వపరిపాలనాధికారం కూడా రేడియోకిలేదు. స్వాతంత్ర్య వాయువులు పీల్చడానికి అలవాటుపడ్డ మనిషి మన రేడియో స్టేషన్లలో ఏ హోదాలో ప్రవేశించినా ఉక్కిరి బిక్కిరై పోతాడు. అడుగడుగునా అక్కడ భయమో, రాజసమో ఎదురుపడతాయి. మన రాజ్యాంగం గ్యారంటీ చేస్తున్న వాక్స్వాతంత్ర్యం రేడియోకిసంబంధించినంతమట్టుకుశశవిషాణప్రాయమని చెప్పడానికి విచారిస్తున్నాను. సెన్సారు విధానం కూడదని నేననడంలేదు. వేలకొలది గృహాలలోకి సరాసరిగా ప్రవేశించే, లక్షలకొలది ప్రజానీకం చెవులలోకి సూటిగా ప్రసరించే రేడియోమీద అజమాయిషీ నిస్సందేహంగా అవసరమే. కాని సృజనాత్మక రచనలమీదసహా రేడియోవిధించే ఆంక్షలు చిత్ర విచిత్రంగా ఉంటున్నాయి. నేటి పరిస్థితులలో రేడియో ఒక గుత్తవ్యాపారం. పావుగంట పాటకీ, పావుగంట నాటికకీ ఇచ్చే ప్రతిఫలంలో భేదం ఉంటుంది. రేడియోలో ఉన్నంత ఎర్రటేపు ప్రభుత్వ సంస్థలలో ఇంకెక్కడ చూడబోమనుకుంటాను. ఇనపచట్రం అనేమాట

ఇక్కడ సార్థకం. ఈ మధ్య కొన్ని పత్రికలకీ, రేడియోకీ జరిగిన వివాదం అందరికీ తెలుసుననుకుంటాను. దాని మంచి చెడ్డలమాట ఎలా వున్నా మొదటినుంచి తుదిదాకా రేడియో అధికారులు అవలంబించిన మౌనవ్రతంమాత్రం క్షంతవ్యంగా కనబడదు. "కుక్కలు అరుచు కుంటూనే ఉంటాయి; బిడారం సాగిపోతుంది" అని సర్ సామ్యూల్ హోరనుకుంటాను, ఆ నాటి మన దేశభక్తుల్ని గురించి అన్నమాట లిక్కడ జ్ఞాపకం వస్తున్నాయి. అధికారగర్వం అంటే అదే! ఆనాటిది నిరంకుశ ప్రభుత్వం పోనీ అనుకుంటే ఈనాటి ప్రజాస్వామ్య ప్రభుత్వంలోకూడా అదే దృక్పథం ప్రతిఫలించడం ఆశ్చర్యకరమే!

ప్రజాభిప్రాయాన్నింత తృణప్రాయంగా చూసే ప్రభుత్వ సంస్థలతో ఎలా వ్యవహరించాలన్నది చాలా క్లిష్టమైన సమస్య. దీనిని గురించి మనమంతా కలిసి అతి జాగ్రత్తగా ఆలోచించాలి. గిడుగు రామమూర్తి పండితునివంటి దిగ్దంతిని బాసటగా పెట్టుకొని ఒక నవ్యసాహిత్య పరిషత్తు మన విశ్వవిద్యాలయాలచేత వాడుక భాషను గుర్తించేటట్లు చెయ్యలేకపోయిందంటే అందుకు కారణం వ్యావహారిక భాషోద్యమంలోని బలహీనత కాదనీ, పకడ్బందీగా తయారయిన ఈ జనపదచట్రపు బలాధిక్యమే అనీ చెప్పవలసిఉంది. కాబట్టి ఇప్పుడు మన ఇంకొక కర్తవ్యం విశ్వవిద్యాలయాలలో జీవద్భాష అయిన వ్యావహారికాంధ్రానికి సముచితస్థానం సంపాదించడానికి నిరంతరాందోళన సాగించడం. ఇదివరకటికంటె ఇప్పుడిది ఎక్కువ చిక్కులతో కూడుకున్న పని. అయినా మనం సర్వశక్తులనూ సంఘటితం చేసుకొని వాడుక భాష ప్రాధాన్యాన్ని విశ్వవిద్యాలయాలలో ప్రతిష్ఠించాలి. వ్యావహారిక భాషావాదం ప్రజల ఉద్యమం. నేడు కాకపోతే రేపయినా ఇది జయించి తీరుతుంది. గ్రాంథికభాష పరిమిత ప్రయోజనం కలదనీ, వాడుకభాష అపరిమిత ప్రయోజనం కలదనీ సిద్ధాంతీకరించిన గిడుగు పండితుని ప్రధాన సూత్రాల నింతవరకెవ్వరూ పరాస్తం చెయ్యలేదు. అయితే వాడుకభాష నెలాగ బోధించాలో తెలియక, సరియైన పాఠ్యగ్రంథాలు

లేక, వాడుకలో క్రమక్రమంగా భాషపొందుతూ వచ్చేమార్పులను వివరించి, విశదీకరించగలిగే వ్యాకరణాలులేక నేటికిన్నీ ప్రాథమిక పాఠశాలలు మొదలుకొని విశ్వవిద్యాలయాలదాకా అంతటా పాతకాలపు భాషాబోధనా పద్ధతులనే అంటిపెట్టుకొని ప్రాకులాడడం తప్పనిసరి అయింది. పత్రికలలో, సినిమాలలో, రేడియోలలో ఈనాడు మొత్తం తెలుగు దేశములో నూటికి తొంభయి పాళ్ళు వాడుకభాష వ్యాపించి ఉన్నప్పటికీ అధికార వర్గాలుమాత్రం ఈ యాథార్థ్యాన్ని గుర్తించకపోవడం శోచనీయం. అరసున్నాలకోసం విద్యార్థుల కాలమంతా వ్యర్థంచేస్తే విషయ పరిజ్ఞానం నిండు సున్నా అయిపోతుంది. కొమ్ములు తిరిగిన పండితులు వ్రాసిన గ్రాంథిక భాషలో కూడా గిడుగు మహనీయుడు తప్పులుపట్టి ఆ భాషలోఉన్న కృతకత్వాన్ని బయలుపెట్టిన సంగతి మనకు తెలియనిదికాదు. ఆనాడు గట్టిగా నోరెత్తడానికి సాహసించలేకపోయినవారు ఈనాడు తోసుకొచ్చి ఆభాస భూయిష్టమైన ఈ భాషను పునరుద్ధరించాలని చూస్తున్నారు. గతం కూడ వీరికి గల మమత వర్తమానపు అవసరాలను గుర్తించ నివ్వదు. నిగళాల వంటి నియమాలకి నివాళి పట్టడం బానిస ప్రవృత్తికి ప్రధాన లక్షణం. భాషా విషయంలో ఇటువంటి పట్టింపులలో కరడుకట్టిపోతూన్న మన విశ్వవిద్యాలయాలు ఏ మార్పునూ అంగీకరించలేని ఏకశిలా నగరాలుగా తయారవుతున్నాయి.

ఈ పరిస్థితులను సరిదిద్దడానికి అభ్యుదయ రచయితల సంఘం పూనుకోవాలంటే సమగ్రమయిన నిఘంటువూ, సంపూర్ణమయిన వ్యాకరణమూ, సలక్షణమైన ఛందశ్శాస్త్రమూ, నిర్మించడానికి తన శక్తుల నన్నిటినీ కేంద్రీకరించాలి. ఇందుకుగాను దేశమంతటా భాషకోసం కృషిచేస్తున్న పండితులందరినీ కూడగట్టుకోవాలి. కనీసం అభ్యుదయ రచయితల సంఘపు ఆరవ మహాసభ జరిగే నాటికి బ్రౌన్ నిఘంటువును సరియైన సంపాదకత్వం కింద వెలువరించ గలిగితే కొంతలో కొంత కృతకృత్యులమయినట్లు సంతోషించవచ్చును. స్వర్గీయ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి "నుడికడలి"

అనే అచ్చ తెలుగు నిఘంటువును కూడా తెలుగులోకి తీసుకురావడానికి మనసంఘం పూనుకోవాలి. అలాగే వ్యాకరణ నిర్మాణం కూడా! నా ఉద్దేశంలో యిది నాగార్జున సాగర నిర్మాణంకన్న కూడా కష్టమైన పని! "తెనుగునకున్న వ్యాకరణ దీపము చిన్నది" అని చాలాకాలం క్రిందట చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారన్నారు. ఇవి విద్యుద్దీపాల రోజులని మనం రుజువు చెయ్యాలి. ఇక ఛందశ్శాస్త్రం సంగతి! ఛందస్సులతో నిమిత్తం లేనట్లు కనిపించే వచన గీతాల సంపూర్ణ స్వాతంత్ర్యం ప్రవచించిన నేను ఛందో మార్గాలను గురించి మాట్లాడడం కొంత విడ్డూరంగానే కనబడవచ్చును. కాని గణబద్ధమైన దొక్కటే ఛందస్సు కాదు. నియమిత స్థలాలలో యతిప్రాసలను నిలబెట్టినంత మాత్రంచేత పద్యం ప్రాణవంతం కాదు. ఛందోరహస్యాలు గణ యతిప్రాసలకు మాత్రమే పరిమితమైనవి కావు. అంతేకాక తెలుగు ప్రతిభ గణబద్ధ చ్ఛందస్సులలో కంటె మాత్రాబద్ధ చ్ఛందస్సులలోనే ప్రస్ఫుటంగా ప్రభాసిస్తుంది. వాడుక భాషకీ, మాత్రాచ్ఛందస్సులకి ఒక అవినాభావసంబంధంవుంది. సాహిత్యలోకంలో దీనిని మొట్టమొదటిసారిగా ముత్యాలసరాలనే పేరిట మహాకవి గురజాడ మనకి గుర్తుకి తెచ్చాడు. అయితే అప్పటికింకా కవిత్వానికి వాహనంగా గ్రాంథికభాష ప్రాముఖ్యం వహించడంచేత గురజాడ గేయాలలో చాలాచోట్ల గ్రాంథిక రూపాలు కనబడుతూ వుంటాయి. ఒక కొత్త భూఖండాన్ని కనిపెట్టడానికి బయలుదేరిన సాహసికయాత్రికుడు గురజాడ! కన్యాశుల్కం మొదటి ముద్రణ ప్రతిలో కొన్ని కృతక వ్యావహారిక రూపాలున్నవన్న సంగతి మనం మరచిపోకూడదు. వాటినన్నిటినీ తరువాత తరువాత సవరించి వ్యావహారిక భాషకు వాల్మీకి అయినాడాయన. పండితులను సంతృప్తిపరచడానికి సుభద్రా పరిణయంవంటి ప్రబంధం రచించడానికిబదులు మాత్రాచ్ఛందస్సుల మీదనే ఆయన మరికొంత కృషి సాగించివుంటే మన కింకా ఎన్ని అమూల్యమణులు లభించివుండేవో!

రసప్రపంచంలో గురజాడ ధ్రువతార అయితే వీరేశలింగం ఒక

విజ్ఞాన సర్వస్వం. దురాచారాల గాఢాంధకారంలో నిద్రపోతున్న జాతిని మేలుకొలిపి విజ్ఞానపు వెలుగులు ప్రసరించిన మహనీయుడు. ఆంధ్రుల అభ్యుదయోద్యమానికి మూలపురుషుడు. ప్రతికూలశక్తుల ఝంఝా ప్రభంజనానికి చెక్కు-చెదరకుండా నిలబడి శాఖోప శాఖలుగా విస్తరించిన వటవృక్షం. తెలుగులో మొట్టమొదటి వాస్తవిక నాటకం గురజాడ రచిస్తే మొట్టమొదటి వాస్తవికత నవలను వీరేశలింగం రచించాడు. తన కథలలో, కవిత్వంలో గురజాడ భావ విప్లవం తీసుకువస్తే వీరేశలింగం తన జీవితంలోనే దాన్ని ప్రత్యక్షంగా ప్రదర్శించాడు. విభిన్న భావాల సంఘర్షణలో తాటస్థ్యానికి తావులేదని ఇద్దరూ తమ తమ రచనలలో విస్పష్టంచేశారు. మూఢ విశ్వాసానికి విరుగుడు శాస్త్రీయ విజ్ఞానమే అని ఇద్దరూ తమ రచనల ద్వారా ప్రచారం చేశారు.

గిడుగు, గురజాడ, వీరేశలింగం! వీరు జల్లిపోయిన విజ్ఞాన బీజాలు ఇప్పుడిప్పుడే ఫలవంత మవుతున్నాయి. అయినా అసలు వీరు పుట్టనేలేదన్నట్లుగానో, వీరు సలిపిన పరిశ్రమ అంతా విఫలమయిపోయినట్లుగానో, ఏ శక్తుల మీద వీరు తిరుగుబాటు చేశారో వాటినే ఊతకర్రలుగా చేసుకొని ఇంకా ఇంకా వెనక్కి పోవాలని ఈ యిరవయ్యో శతాబ్దపు 55 వ సంవత్సరంలో ప్రయత్నాలు జరుగుతున్నాయి. అభ్యుదయ రచయితలమైన మనం, గిడుగు సంప్రదాయాలలో గురజాడ కావ్యవాహినులలో వీరేశలింగం విప్లవ ధోరణులలో ప్రాణవాయువులు పీల్చుకుంటున్న మనం నిస్సందేహంగా ఆంధ్ర సాహిత్యపరిణామంలో అగ్రశ్రేణిని పయనిస్తున్న మనం, మళ్ళీ మనల్ని పాత రాతియుగానికి పట్టుకుపోయే ప్రయత్నాలను సహిస్తామా అని ప్రశ్నిస్తూ, జవాబుకోసం ఆగకుండానే (అది యెలాగుంటుందో నాకు ఎలాగూ తెలుసునుకాబట్టి) ఇంతటితో నా ప్రసంగాన్ని ముగిస్తున్నాను.



# కథా, నవలా

## కొడవటిగంటి కుటుంబరావు

ఈనాటి తెలుగు సాహిత్యమంతటిలోకీ హెచ్చుగాపరిణామం చెంది యుగధర్మాన్ని సమగ్రంగా ప్రతిబింబిస్తున్నవి చిన్న కథా, నవలా అని ఒప్పుకు తీరాలి. కాని ఈ పరిస్థితి మన సాహిత్యం తాలూకు ఆధునికయుగం ఆరంభం నుంచీ ఉన్నటువంటిది కాదు. ఈ యుగం 19 వ శతాబ్దం చివరి భాగంలో, అక్కడా అక్కడా చెదురుగా వెలువడిన రచనలతో ఆరంభమై తొలిప్రపంచ యుద్ధం ముగిసేనాటికి ఒక ఉద్యమరూపం దాల్చింది. సాహితీ సమితి ప్రారంభమయే నాటికి ఉండిన రచయితలు ఆధునిక సాహిత్యయుగంలో నవశకం ఆరంభించారు.

అప్పటికి కూడా రచయితలలో హెచ్చుభాగం కవులే. కథకులూ, నవలాకారులూ ఉండేవారే గాని వారి సంఖ్య బహుతక్కువ. వచన రచన గ్రాంథికంలోనే నడిచేది. గిడుగు రామమూర్తిగారి వ్యావహారిక భాషావాదం నవ్యుల ఆమోదం పొందినప్పటికీ వ్యావహారికభాషను సాహిత్యానికి పూన్చేవారు అంతగా లేకపోయారు. తెలుగు సాహిత్యంలో ఆధునిక యుగాన్ని ప్రారంభించిన అమర కవి గురజాడ వ్యావహారిక భాషలో పద్యాలూ, కథలూ, నాటకాలూ రాసినా కథల శకం ఆరంభమయేదాకా వ్యావహారిక భాషలో వ్యవసాయం చురుకుగా సాగనే లేదు. కథల శకం పత్రికలతో బాటే పుట్టిపెరిగింది. పత్రికా పఠనం ప్రజలలో అభివృద్ధి చెందిన కొద్దీ కథల సంఖ్యా, కథకుల సంఖ్యా అభివృద్ధి అయింది.

పత్రికలు యంత్ర యుగానికి చెందినవి. అచ్చు యంత్రాలు చాలాకాలంగా ఉంటున్నా, ఈ యంత్రాలలో యిటీవల కలిగిన అభివృద్ధి చాలా గొప్పది. "సాహితి" సంచికలు అచ్చువేసిన ప్రెస్‌లో ట్రెడిల్ కూడా వుండేది

కాదు. ఈనాడు విస్తారమైన ప్రచారంగల రెండువార పత్రికలు కోటరీల మీద శరవేగంతో అచ్చవుతాయి. పూర్వం అయిదు పత్రికలున్నచోట ఇవాళ కనీసం నూరు పత్రికలున్నాయి. ఈ మార్పుల ఫలితాలు కథాసాహిత్యంమీద ఉండక తప్పదు.

గురజాడ అప్పారావుగారు రెండు కథలు మాత్రమే తెలుగులో రాశాడు. నేను గడిచిన పాతిక ఏళ్ళకాలంలో అనేకవందల కథలు రాసి ఉంటాను. డజన్ల లెక్కనా, వందల లెక్కనా కథలు రాసినవారు ఆంధ్రలో చాలా మంది ఉన్నారు. ప్రచురించటానికి పత్రికలు లేకుండా ఇది సాధ్యం కాదు. పుస్తకాలు ప్రచురించి చేతి డబ్బు ముందు ఖర్చు చేసుకోవాలిసిన పరిస్థితిలో ఎవరూ వందల సంఖ్యలో కథలు రాయరు. పుస్తకాలు ప్రచురించి వాటిద్వారా కథకులుగా గణనకు రాగోరిన వారు ఎంతో మంచికథలనీ, తప్పక రాసి తీరవలసిన కథ అనీ అనుకుంటే తప్ప రాయరు. పత్రికల ధర్మాన కథకులు ఒక మాదిరి కథలూ, అంత బాగా లేని కథలూకూడా రాయటం జరిగింది. వాటిని రాసినందువల్ల నష్టంలేదు. ప్రచురించే పత్రికలున్నాయి; ఒక్కొక్కప్పుడు పడిన శ్రమకు తృణమో పణమో ముట్టుతుంది కూడ!

ఇటువంటి కథలన్నీ రాసినందువల్ల కలిగిన లాభమేమిటని అడగవచ్చు. లాభం లేకపోలేదు. పత్రికలలో అచ్చయినంత మాత్రాన తక్కువరకం కథలకు సాహిత్య గౌరవం ఎన్నటికీ రాదు. కాని పత్రికలను మేపటానికి వందల సంఖ్యలో కథకులు పుట్టుకురావటం తటస్థించింది. "ఉత్తమ సాహిత్యం అవుతుందా, లేదా?" అని ఆలోచిస్తూ కూచోకుండా పత్రికలు అనేక కథకుల కథలను, ఏదో ఒక సుగుణం చూసుకొని, ప్రచురించాయి. ఇందువల్ల చాలా చెత్తసాహిత్యం సృష్టి అయినప్పటికీ అనేకమంది కథకులు రచన చెయ్యటానికి ప్రోత్సాహం లభించిన వారైనారు. వారిలో కొందరు ఉత్తమ తరగతి కథకులుగా పరిణమించటం కూడా జరిగింది.

సాహిత్య రచన, అందులోనూ కథారచన, ఒక వృత్తి కాదు. ఈనాడు కూడానూ, ఉపాధ్యా

యులూ, జర్నలిస్టులూ, వైద్యులూ, గుమాస్తాలూ, వ్యాపారం చేసుకునే వాళ్లూ కథలు రాస్తున్నారు. ఇంకే సాహిత్య రూపంలోనూ కృషి చేయని వారు కేవలం కథలు రాసి పేరు తెచ్చుకోనటం జరిగింది. అసలు వీరిని ప్రోత్సహించే పత్రికలే లేకపోతే వీరిలో నూటికి ఒకరు కూడా సాహిత్యం చాయలకువచ్చి ఉండరేమో!

ఇదే నవలలకుకూడా వర్తిస్తుంది. పత్రికలు విజృంభించక పూర్వం నవలలు రచించిన వారు చరిత్ర మీది మమకారం కొద్దీ, నవలలు రాసి అచ్చువేయించుకుని కీర్తీ, కొంత ధనమూ సంపాదించు తామనీ రచనచేశారు. పత్రికలలో ధారావాహినిగా నవలలు ప్రచురణ కాసాగిన అనంతరం నవలలు రాసే ప్రేరణ ఇతరులకు కూడా కలిగింది.

కథలూ, నవలలూ అభివృద్ధికి రావటంలో పత్రికలు నిర్వహించిన పాత్ర అనన్యమైనది. ఈనాడు కూడా పత్రికలు ప్రోత్సహించని సాహిత్యరూపాలు అడుగున పడి ఉండటం కనిపిస్తూనే ఉన్నది.

మంచిచెడ్డల విచక్షణ అటుంచి సాహిత్యం పరిమితంగా సృష్టి కావటంలోనూ, బహుళంగా సృష్టి కావటంలోనూ ఒక ముఖ్యమైన తేడాఉన్నది. బహుళంగా ఉత్పత్తి అయే సాహిత్యం విధిగా ప్రజలకూ జీవితానికీ సన్నిహితంగా వచ్చి తీరుతుంది. కొద్దిమంది కథకులే ఉన్నప్పుడు వెలువడిన కథలలో పాత్రలను "ఉదాత్తం"గా ఉంచటానికి పడినపాట్లూ, వ్యావహారిక భాషలో రాయటానికి చేసిన ప్రయత్నంలో రచయితలను పట్టి కన్న బెరుకూ స్పష్టంగా గోచరిస్తాయి. రచయితలసంఖ్య హెచ్చిన కొద్దీ భాష ధారాళంగానూ, పాత్రలు స్వాభావికంగానూ పరిణమించటం జరిగింది. ఇది కథా సాహిత్యానికి జరిగిన సామూహిక లాభం. ఈ ప్రయోజనం ప్రత్యేక కథలలో పాక్షికంగా మాత్రమే ప్రతిబింబించింది.

అనాదిగా వచ్చే కథాసాహిత్యాన్ని పరిశీలించి నట్టయితే కథల యొక్క స్వరూప స్వభావాలలో పరిణామం కనిపిస్తుంది. పురాణాల లోని కథలు వాస్తవ గాథలు. వాటిలో అతిశయోక్తులుండవచ్చు.

వాటిని రాసినవారి అపోహలూ, మూఢ విశ్వాసాలూ ఒక్కొక్కప్పుడు వాటిలో ప్రతిబింబించి ఉండ వచ్చు. కాని వాటిని రాసిన వారు, అవి యదార్థ సంఘటనలనే విశ్వాసంతోనే వాటిని రాశారు. ఈ కథలను ఎవరో ఇంకెవరికో చెప్పారని మరెవరో వేరెవరికో చెప్పినట్టు పురాణకారులు రాశారు. అవి గత చరిత్రకు చెందిన దృష్టాంతాలుగా మాత్రమే రచించబడ్డాయి. కథకుడు ఆకథలకు సాక్షి కాడు, సమకాలికుడు కూడా కాడు. ఈ కథలలో సామాజిక మనస్తత్వం ప్రతిబింబించదు.

వీటిమీద ఎంతో పరిణామం చెందినవి నీతి కథలు. అవి కేవలం కల్పితాలు. పక్షులమీదా, జంతువులమీదా పెట్టి మానవుల వ్యాపకాలను తీవ్రంగా విమర్శించిన వ్యంగ్య రచనలు. వీటిలో సామాజిక మనస్తత్వం పుష్కలంగా ఉన్నది.

ఆధునిక కథలు పురాణ కథల లాగా వాస్తవమైనవి కావు, నీతి కథలలాగా అభూత కల్పనలు కావు. ఇవి కల్పిత వాస్తవికత కథలు. స్వరూపాన్ని బట్టి ఈ కథలలో వాస్తవికత నూటికి నూరుపాళ్ళూ ఉండవలసిందే, గత్యంతరం లేదు. ఈ వాస్తవికత కథనంలో, పాత్ర చిత్రణంలో, సంభాషణలో సంఘటనలలో ఉండి తీరాలి. వీటిలో మనస్తత్వానికి చాలా ప్రాముఖ్యం ఉన్నది. ఇవి పురాణ కథలలాగా ఒక ప్రత్యేక సందర్భాన్ని పురస్కరించుకుని దృష్టాంతంకింద చెప్పుకునేవి కావు. నీతి కథలలోలాగా వీటిలో ఒక విస్పష్టమైన నీతికూడా ఉండదు. వీటిలో జీవిత ఖండాలు ప్రతిబింబిస్తాయి—సమకాలిక జీవిత ఖండాలు.

ఇది చాలా ముఖ్యమైన విషయం. ఎందుచేతనంటే, కథలు చెప్పటానికి మూడు మార్గాలున్నాయి. ఒకటి, ఎవరో చెప్పగా విన్న విషయాలు చెప్పటం; రెండు, కథకుడు తాను ప్రత్యక్షంగా చూసిన విషయాలు చెప్పటం; మూడు, కథకుడు తన అనుభవాలనే చెప్పటం. ఇందులో మొదటి పద్ధతి పురాణకథలలో కనిపిస్తుంది. మిగిలిన రెండూ ఆధునిక కథా సాహిత్యంలో అమలులో ఉన్నాయి. అందుచేత కథకుడు ఈనాడు విధిగా సమకాలిక సంఘటనలనే

చెప్పాలి. కథా సరిత్సాగరంలో చాలాచోట్ల తమ అనుభవాలను గురించి చెప్పటం మనకు కనిపిస్తుంది. ఇదే పద్ధతిని కాశీమజిలీలలో కూడా మనం చూస్తాం. అయితే అటువంటి కథలకు శ్రోతలు పాఠకులు కాకు — ఇతర పాత్రలు. ఆసాహిత్యంలో స్వానుభవాలు చెప్పించటం శిల్ప చమత్కృతి మాత్రమే.

ఈనాటి కథ - నవలకూడా - స్వరూపం సంబధించినంతమట్టుకు పరిపూర్ణమైన పరిణామాన్ని సాధించింది. కథ చెప్పటానికి ఆదర్శప్రాయమైనదైన మాట్లాడే భాషలో ఈనాటికథలూ, నవలలూ రచించబడుతున్నాయి. వీటిలో ప్రధాన పాత్రలు ఈనాటి జీవితంలోని అన్ని తరగతులకూ చెందినవిగా ఉంటున్నాయి. వర్తమాన జీవితమే ఈ కథలలో, నవలల్లో ప్రతిబింబిస్తున్నది.

కాని ఈ రచనల స్వభావమే ఒక్కొక్కసారి పెడత్రోవబడుతున్నది. కథలకూ, నవలలకూవుండదగిన స్వభావం గురించి ఒక్కొక్కప్పుడు కథకులకే స్పష్టమైన అభిప్రాయా లుండటంలేదు.

ఆధునిక కథయొక్క స్వరూపాన్ని అర్థం చేసుకుని అటువంటి స్వరూపంగల సాహిత్యం యెటువంటి స్వభావం కలిగి వుండాలో అంచనా కట్టటం అసాధ్యంకాదు. ప్రజలకు సన్నిహితమైన భాషలో ప్రజలను చైతన్యవంతులను చెయ్యలేని కథలు రచించి ప్రయోజనమేమిటి ?

కందుకూరి వీరేశలింగంగారు మొదట్లో భాషతో గరిడీసాము చేసికూడా, పదిమందికీ తెలియవలిసిన విషయాలు చెప్పటంకోసం అతిసులువైన భాష అవలంబించారు. ఆయనకు భాష తాలూకు స్వరూప స్వభావ సంబంధం తెలిసివచ్చింది. ఈనాటి కథకులు మట్టుకు ఒక్కొక్కప్పుడు అందరికీ అర్థమయే భాషలో దాదాపు యెవరికీ అక్కర్లేని కథలు రాస్తున్నారు. ఇది తప్పు.

కథలలో నిత్యజీవితం తాలూకు పాత్రలుంటున్నాయి. కాని ఒక్కొక్కప్పుడు ఆ పాత్రల స్వరూపానికీ స్వభావానికి సంబంధం వుండదు. కార్మికుడికి మధ్యతరగతి మనస్తత్వమూ, మధ్యతరగతి వాడికి జమీందారీ మనస్తత్వమూ అంట

గట్టబడుతుంది. ఈనాటి కథలలో జీవితం ప్రతిబింబించ బడుతుంది, కాని చాలా కథలలో జీవిత సత్యం లోపిస్తుంది.

ఈనాటి కథా సాహిత్యంలోని లోపాలన్నీ ఈ విధమైనవే. ఈ కథలకు ఆయువుపట్టు వాస్తవికత. వాటి స్వరూపం వాస్తవికతకు అనుకూలమైనది. అది కథలస్వభావంలో కూడా ప్రతిబింబించినప్పుడే అవి ఉత్తమ కథ లనిపించు కుంటాయి.

కథలలో, నవల్లో ప్రతిబింబించే జీవితం తాలూకు వాస్తవికత, జీవిత సత్యం మాత్రమే. ఈ సత్యం వ్యక్తం కానప్పుడు జీవితాన్ని ఎంత వివరంగా చిత్రించి కూడా ఏమీ ప్రయోజనంలేదు. ఆ జీవిత సత్యమే రచనను అభ్యుదయ రచనగా చేసేది.

"జీవితసత్యం," "వాస్తవికత," "అభ్యుదయం" మొదలైనమాటలు రాజకీయ పరిభాష అని అపోహపడే వాళ్ళు ఈనాడుకూడా చాలా మంది ఉండటం శోచనీయం. మార్క్సిస్టు సాహిత్యం పరిచయం లేకుండానే శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తాము రచించిన కొన్ని కథలలో జీవిత సత్యాలను ప్రతిభావంతంగా చిత్రించారు. ఒక కథలో ఒక అస్పృశ్యుడు ఇస్లాము మతం తీసుకుని సమాజం మధ్యకివచ్చి వెలి వెయ్యమని సవాలు చేస్తాడు. ఆయన రచించిన మరొక కథలో ఒక శ్రోత్రియ కుటుంబానికి చెందిన యువకుడు బతుకు తెరువు గానక హోటలు పెడతాడు. ఇదేవిధంగా, కమ్యూనిస్టు రాజకీయాలను తీవ్రంగా ప్రతిఘటించిన సురవరం ప్రతాపరెడ్డిగారు తమ కథలు కొన్నింటిలో జీవిత సత్యాన్ని చాలా చక్కగా చిత్రించారు. పాఠకులను సమ్మోహింప చేయటంలో అసాధారణ ప్రతిభగల చలంగారు జీవిత సత్యాన్ని అంతగా వ్యక్తం చెయ్యలేక పోయినా, జీవితంలోని అసత్యాలను ఘాటుగా ఖండించారు.

ఆధునిక యుగంలో అనేక మంది కథకులూ, నవలాకారులూ కూడా ఈ సాహిత్య రూపాల స్వభావాన్ని తృణీకరించి, స్వరూపాన్ని తీర్చి దిద్దటంలో ప్రావీణ్యం సంపాదించి ఖ్యాతి సంపాదించు కున్నారు. దీనికి మనం ఈ నాడు

విచారించనవసరంలేదు. ఎందుకంటే కథయొక్క స్వరూపంలో కలిగిన ఈ వాంఛనీయమైన పరిణామం ఏ ఉద్యమమూ లేకుండానే సాగింది. నవ్య సాహిత్య పరిషత్తు పుట్టి ఉద్యమం సాగించినప్పటికే చాలమంది ప్రసిద్ధ కథకులు దేశంలో ఏర్పడి ఉన్నారు. వీరిని కూడగట్టి ప్రచారం ఇవ్వటం తప్ప సాహిత్య పరిషత్తు వచన రచనల స్వభావాన్ని తీర్చిదిద్దటంలో ఎంతమాత్రమూ కృషి చేయలేకపోయింది. ఆ మాటకువస్తే నవ్య సాహిత్య పరిషత్తులో వచన రచయితలు ఎప్పుడూ వెనక బెంచీల మీదే కూచున్నారు.

వచన రచయితలను ముందుకు తోసి కథకులకూ, నవలలకూ, ఇతర సాహిత్య రూపాలకూకూడా ప్రయోజనాత్మకమైన స్వభావాన్ని ఇవ్వటానికి మొట్టమొదటి సారిగా ఉద్యమం సాగించినది అభ్యుదయ రచయితలసంఘం. ఈ ఉద్యమం కొంతదూరం సాగి పరిస్థితులు వికటించటంవల్ల తాత్కాలికంగా నిలిచిపోయినాక కూడా ఉద్యమ ప్రభావం ఎంతమాత్రమూ నిలిచిపోలేదు. గడచిన పదేళ్ళకాలంలో అనేక వందలమంది కథకులు తమ రచనలద్వారా జీవిత సత్యాన్ని వివరించటానికి కృషి చేశారు. వీరి రచనలు అన్ని పత్రికలలోనూ వెలువడ్డాయి.

ఈనాటి పరిస్థితి యేమంటే, యువక రచయితలకు కొంతమార్గదర్శనం అవసరం. కొందరు కొందరు స్వరూపాన్ని గాలికి వదిలి కథయొక్క స్వభావానికి న్యాయం చేకూర్చాలనే ఆశతో వికృతమైన రచనలు చేస్తున్నారు. మరికొందరు వాస్తవాన్ని వాస్తవికతగా భావించి తృప్తిపడుతున్నారు. మరి కొందరు కొన్ని అభ్యుదయకర విశ్వాసాల యందు అపారమైన గురివుంచి, వాటిని నిరూపించటం కోసం జీవితాన్ని తారుమారు చేసి చిత్రిస్తున్నారు.

రచయితకు జీవితానుభవం వుండాలి. జీవితసత్యాన్ని గ్రహించే నిశితమైన దృష్టి వుండాలి. ఏ కళకైనా అపారమైన సాధనవుండాలి. వాస్తవిక కళలకు మరీనూ.

ముందుకు చూస్తే కథా, నవలా సాహిత్యాలకు ఉజ్వలమైన భవిష్యత్తు కనిపిస్తుంది. భావిసాంఘిక పరిణామానికి మూలకందమైన

శ్రామిక వర్గంలో యింకా కళా చైతన్యంలేదు. కాని వస్తుంది. జీవితసత్యం తాలూకు కీలకం వారి చేతిలోవుంది. వారిలోనుంచి కథకులూ, నవలాకారులూ బయలుదేరి తమ జీవితాన్నీ, దానివెనక దాగివుండే సత్యాన్నీ చిత్రించటం ప్రారంభించినాక యీనాడు మనం చూసి మురిసే సాహిత్యం వెలవెలబోయి బొమ్మలాగా గోచరిస్తుంది. ఆవర్గంనుంచి గోర్కీలూ, ఫాస్ట్‌లూ, హార్డీలూ బయలుదేరే రోజు ఆటేదూరం లేదు. అభ్యుదయ రచయితల సంఘం సరిఅయిన పంథాలో కృషి చేసినట్టయితే, యీకృషికి సంఘం నాలుగు మూలలనుంచీ ప్రోత్సాహం లభించినట్టయితే ఆ రోజు మరింత దగ్గిరపడి తీరుతుంది.



# గ్రహణం పట్టింది

## రెంటాల గోపాలకృష్ణ

ఓడిపోయిన సామ్రాజ్యంలా
వీడిపోని త్యాజ్యంలా
ఉంది నా బ్రతుకు !

జీవితం ఒక పద్మవ్యూహం
చిక్కు పడిన అభిమన్యుణ్ణి నేను !
ప్రపంచం ఒక కౌరవసభ
పరాభవం పొందిన ద్రౌపదిని నేను !

నా ఆశాకుసుమములు విచ్చకుండా సైంధవులు అడ్డుపడ్డారు
ఎవరో ధర్మాత్ములు నన్ను చక్రబంధంలో పడేశారు
ఎవరో ధర్మరాజులు నన్ను పణంగా పెట్టారు
నా జీవితంతో జూద మాడారు !

పగిలినకుండలు నా పరువు ప్రతిష్టలు
వడగండ్ల వానవంటి కడగళ్ళు
విరిగినపాలు నా సంసారం
అడుగడుగున పరాభవం
అన్నిచోట్ల పరాజయం !
నేను కాలం గడపడంలేదు
కాలం నన్ను నడుపుతోంది !

జగత్తును చూడలేను
జనంమధ్య నిలువలేను
నన్ను నేను నమ్మలేను

నా మోహం నా కసహ్యం!
ఎవరు దీనికి కారణం?
ఎవరు నన్నీ సుడిగుండంలో నెట్టారు?
ఎవరు? ఎవరు?

తిరిగీ అదే ప్రశ్న!
ప్రతిధ్వనించే ప్రశ్న
సమాధానం దొరకని ప్రశ్న!...

గండం కాళ్ళకు కట్టుకుని పుట్టాను
బాధలపేగులు మెడకు చుట్టుకుని వచ్చాను
దుష్టలగ్న సంధిలో భూపతనమయ్యాను!
కడివెడుశోకం తోడుకుని వచ్చాను
నా జననం నాకే దోషం
పురిటిలోనే సంధి కొట్టింది!

ఉయ్యాలచేర్లలో ఉన్నారు రాక్షసులు
రంపాలతో కోసివేశారు తాళ్ళు -
తల్లి పొత్తిళ్ళలోనే తలుచుకున్నాను దరిద్రం
తల్లి స్తనాలనుండి త్రాగాను శోకం!

రాజులాంటి బ్రతుకునకు
పట్టింది రాహుగ్రహణం!
విముక్తిపొందాలని పోరాటం చేశాను
వెన్నెలచూడాలని ఆరాటపడ్డాను
నెలవచ్చింది, వెన్నెల చచ్చింది!

చీకటి, చీకటి
జీవితం శివరాత్రి
జాగారం, ఉపవాసం
జీవితానికి గ్రహణం పట్టింది

సంపూర్ణ గ్రహణం
సమస్త జగతికి పర్వదినం
జనానికి మృతాశౌచం
నా కన్నీళ్ళలో కాళ్లు కడగండి
అందరూ సముద్రస్నానం చెయ్యండి !

మనుషులంతా ఋషులై నిలవండి
మహామంత్రాలు పఠించండి
మహాయజ్ఞం ప్రారంభించండి
ఈ చీకటి చిక్కుముడిని విప్పండి
ఈ రాత్రివేళ రవిని రప్పించండి !
దివిని దించండి భువికి !

చెప్పండి నా జీవితానికి ప్రవర
తొప్పండి యజ్ఞోపవీతం !
ఒక్కమాటు
నవ్వుతూ నువ్వులతో తర్పణం విడవండి
నేను తరిస్తాను
బాధలు మరుస్తాను !
ఈసారైనా
జీవితాన్ని వరిస్తాను !!!



# చెప్పు కింది పూలు

## అనిసెట్టి సుబ్బారావు

### మొదటి దృశ్యం

★

[ఈ కాలంలో యీ దేశంలో జరుగుతున్న సంఘర్షణ యిది. ఏదో ఒక రూపంలో, ప్రతి యింటిలో అనునిత్యం జరుగుతున్న సంఘటనలు యివి! ఆశలు, ఆశయాలు, అనురాగాలు - అన్నీ దారిద్ర్యపు ప్రళయనృత్యంలో నశించిపోయి పచ్చని సంసారాలే విచ్ఛిన్నమౌతున్నాయి.

ఒక మధ్యతరగతి కుటుంబీకుని ఇంటిలో హాలు. ఇందులో వస్తువులు - కుర్చీ, బల్ల, చిత్రాలు మొదలైన వేవీ గత యిరవయ్యేళ్ళలో కొన్నవి కావు. వృద్ధాప్యంతో ఉద్యోగం విరమించవలసివచ్చిన దశరధయ్యలాగే యీ వస్తువులన్నీ కడపటిరోజులు ఎలా గడుస్తాయా? అని కుమిలిపోతున్నాయి.

దశరధయ్య కళ్ళద్దాలకు దారంకట్టుతూ, అది తన తలకు సరిపోతుందో లేదో సరిచూసుకుంటున్నాడు. ఉన్న ఒక్కడే కొడుకు రామూమీద ఆశలు పెట్టుకుని బతుకుతున్నాడు. రామూ తల్లికిగూడ అదే ఆలోచన. అందుకే తల్లిదండ్రులు కష్టార్జితమంతా రామూమీద పెట్టుబడి పెట్టి చదివించారు. లోకంలోకి వెళ్ళి కష్టనిష్ఠురాలు సహించి సంపాదించి సంసారాన్ని పోషించడం - రామూ ధర్మం.

ఇంతసేపూ వాకిట్లో ఎదురుచూస్తున్న తల్లి విచారంగా లోపలికొస్తుంది.]

తండ్రి: వచ్చాడా?

తల్లి: ఇంకా రాలేదు.

తండ్రి: వాడెందు కొస్తాడు! ఆ జీతం డబ్బులు చేతికొచ్చినయ్యేమో, తిరుగుతున్నాడు!

తల్లి: ఎందుకట్లా విసుక్కుంటారు! మీకు తెలియదూ, వాడట్లా తిరిగేవాడేనా!

తండ్రి: (కోపంగా) మూడురోజులవాడు పోయాడు, ఇంతవరకు అతీ తీ లేదు! విసుక్కుంటున్నానట, బుజ్జగించాలి గామాలు! ఇప్పు డింటి వాడొస్తాడు, నువ్వు సమాధానం చెపుతావా! వాడు నానా మాటలంటే పడాల్సిందేగా...

తల్లి: ఇంకా మాట పడట మెందుకు; అబ్బాయికి జీతం వస్తుందిగా; రాగానే వాడి మొహాన కొడితే సరిపోతుంది.

తండ్రి: వస్తుంది! వాడికి జీతంవచ్చేప్పటికే మనకు ప్రాణంమీది కొస్తుంది.

తల్లి: అబ్బ! ఎప్పుడూ వాడిమీద కసురుకోవడమే గాని. ఒక్క మంచిమాట మాట్లాడరుగద! ఎంత దిగులుపడ్డాడో; వాడిసంగతి ఎప్పుడైనా ఆలోచించారూ, వాణ్ణిచూస్తేనే నాకు ఏడుపొచ్చింది, సరిగా అన్నమైనా ముట్టక సగమైపోయాడు! వాడి మూడురోజుల

నుంచి ఇంటికిరావడానికి జంకాడేమో; మీ పిచ్చికోపం చూసి...

తండ్రి: (నొచ్చుకుంటూ) కోపమా! నా కెందుకు కోపం! నాకు మాత్రం తెలియదూ? (పచార్లుచేస్తూ) ఏడీ? ఇంకా రాలేదేంమరి? ఒకటో తేదీకల్లా జీతం వస్తుందన్నాడుగా...

తల్లి: వస్తాడులెండి! రాగానే వాడితో సంతోషంగా మాట్లాడండి! ఒక ఆఫీసా, ఒక బజారా... ఆరునెలలు ఉద్యోగం కోసం కాళ్ళకి బలపంకట్టుకుని తిరిగాడే! అయినవాళ్ళనూ, కాని వాళ్ళనూ అభిమానం చంపుకుని దేహీ అని అడిగాడే!

తండ్రి: (జాలిగా) అవును, తిరిగాడు...

తల్లి: నలుగురిలో తెలివిగలవాడనిపించుకుని, బి. ఏ. ఫస్టున ప్యాసై, కష్టం అంటే ఏమిటో ఎరుగని బిడ్డ, పిచ్చి వాలకంపడి...

తండ్రి: (జ్ఞాపకంతెచ్చుకుని ఆలోచిస్తూ, దీనంగా) అవును, తిరిగాడు... నేనైతే భరించలేను...... నేనైతే ఏబావో, చెరువో చూసుకునేవాణ్ణి...

తల్లి: (వారిస్తూ) ఊరుకోండి! ఇక మనకేం కావాలి; ఉద్యోగం వచ్చిందిగా! ఇక నుంచి నెలనెలకూ జీతంవస్తే ఈ అప్పులన్నీ తీర్చేసి, హాయిగా వాణ్ణొక ఇంటివాణ్ణిచేసి...

తండ్రి: (ఆలోచిస్తూ) అదే మరి! ఈ అప్పులన్నీ తీర్చేసి, మనల్ని చూసి నవ్వేవాళ్ళందరినీ, ఈ అప్పుల వాళ్ళందరినీ ఈగడపదాటి లోపలికి రాకుండా చేస్తే; హాయిగా మన ఇంట్లో మనం సుఖంగా... (విసుగ్గా) పెండ్లి చేసుకోరా అంటే వద్దంటాడు గద! ఎన్నిసార్లు చెప్పాలి! పెండ్లి కుదిర్చామా; వాళ్ళ మామగారిదగ్గర డబ్బుతీసుకుని చదివించామా! ఈ నెలలో ముహూర్తం నిశ్చయం చెయ్యకపోతే నా డబ్బు నాకు ఇచ్చెయ్యమని ఇంత పొడుగున ఉత్తరం రాశాడు! (చనువుగా) అసలు ఎందుకూ వీడు వద్దనేది?

తల్లి: అబ్బాయికి మనస్సులో ఏముందో, మన కేం తెలుసు!

తండ్రి: (కొంచెం కోపంగా) వాడి మనస్సేమిటి! ఇదంతా వాడి శ్రేయస్సు కోసం గాదూ; నాకు పెండ్లి వద్దూ అంటే ఇప్పుడాగుతుందా, మాట యిచ్చిన తర్వాత—

తల్లి: మాటెందుకిచ్చారు అన్నాడు మొన్న —

తండ్రి: (ఇంకా కోపంగా) అంటాడు వాడికేం! మరి వాడి చదువుకూ, ఈ పరీక్షలకూ డబ్బెట్లా వచ్చిందో ఆలోచించాడా! నేను రిటైరై రెండేళ్ళవుతుంటే ఇన్నాళ్ళనుంచి ఇంటి ఖర్చు ఎట్లా వచ్చిందో ఆలోచించాడా! అయినా నువ్వు వాడితో ఏమీ చెప్పకుండా నాకు పెద్ద సలహా ఇవ్వొస్తావేమిటి!

తల్లి: (దిగులుగా) చెప్పాను! ప్రతిరోజూ చెపుతూనే వున్నా! వాడికేదో దిగులు పట్టుకుంది! ఇట్లా అయితే, అమ్మా! నేను వెళిపోతానన్నాడు —

తండ్రి: ఎక్కడికి? ఎందుకు?

తల్లి: ఏమో ఎందుకో —

తండ్రి: (ఆగ్రహంతో) తెలియదూ? నువ్వడగలా? ఇంకేం ఉద్యోగం

వచ్చిందిగదా, ఇష్ట మొచ్చినట్టు ఊరేగాలనుకున్నాడు గాబోలు! అయినా మొన్న ఎప్పుడో పోయినవాడు ఇంత వరకు ఇంటిమొఖం చూడకపోవడ మేమిటి? అసలు వస్తాడా రాడా! నే నీ సంసారం ఈదలేను, నేనే వెళ్ళిపోతాను. నువ్వూ, నీ అబ్బాయీ హాయిగా ఊరేగండి!

తల్లి: (దగ్గరకు వచ్చి, చేతులు పట్టుకుని) చూడండి! ఇదిగో! (కన్నీటితో గద్గద స్వరంతో) వాడిమీద కోపంవద్దు! ఎంత సుకుమారంగా పెరిగాడో, ఇప్పుడెంత కృశించి పోయాడో మీకు తెలియదూ?

తండ్రి: ఇన్నాళ్ళూ పెంచి చదివించి సంపాదించరా అంటే నీకూ, నాకూ వాడు చేసే ఉపకారం ఇదేనా!

తల్లి: ఇకనుంచీ వాడేగా మనకు! వాడు సంపాదించనన్నాడా, శక్తిలేనివాడా! అప్పుడు మీరు ఎన్నాళ్ళకూ ఉద్యోగం రాకపోతే, మీ నాన్నగారు కేకలేస్తుంటే, మీరు రోజూ కంట తడి పెట్టుకుంటూ—

తండ్రి: (దిగులుగా వెళ్ళబోసుకుంటూ) అవును, అవును, నా గుండె పగిలిపోయింది! నిజమే! మరి ఇప్పుడు గూడా ఈ బాధ భరించవలసిందేనా! (జ్ఞాపకం తెచ్చుకొంటూ) చిన్నతన మంతా, పోనీ యౌవనంలో హాయిగా సుఖం అనుభవించకపోతానా అని ఆశపడ్డా! యౌవనంవచ్చింది, పోయింది! బ్రతుకేద్వలేక ఏడుస్తూ, బండచాకిరి చేస్తూ; ఇక ఇప్పుడు వృద్ధాప్యం వచ్చింది, కన్నకొడుకు సుఖపెడతాడు గదా అని సంతోషిస్తే...ఈ అప్పులు; అవస్థలు; అవమానాలు...అబ్బ!

(బయటనుండి "అమ్మా!" అని రామూ పిలుపు వినిపిస్తుంది.)

తల్లి: (బైటికిచూసి) వద్దు, వద్దు! వాడొస్తున్నాడు! జీతం తెచ్చేవుంటాడు; (వెళ్ళబోయి మళ్ళీవచ్చి) వాడిమీద కోప్పడకండి, సంతోషంగా మాట్లాడండి! (తండ్రి జాలిగా నవ్వుతాడు. ఆమె వెళ్ళిపోతుంది. తండ్రి నిజంగానే సంతోషంగా వున్నాడు. పచార్లు చేస్తూ కుర్చీమీద వున్న వుత్తరీయం తీసిచూస్తాడు. దానినిండా చినుగులే 'నేటితో నీ రుణం తీరింది' అన్నట్లు విసిరి ఒక మూలకు గిరాటు వేస్తాడు.

తల్లి సంతోషంగా రామూను చెయ్యి పట్టుకొని తీసుకొచ్చింది. రామూ ముఖం పాలిపోయివుంది. నిస్సారంగా లోపలికి వస్తూ, జాగ్రతగా తల్లిదండ్రుల మనఃస్థితిని గమనించి దుఃఖం ఆపుకోలేక ఒక సారి రెండు కణతలూ నొత్తుకుంటాడు. నిస్పృహవల్ల కలిగిన నిర్లక్ష్యం, దైన్యం కప్పిపుచ్చుకోడానికి నటించే దైన్యం అతని ప్రతిమాటలోనూ స్ఫురిస్తాయి)

తల్లి: (ప్రేమతో) అసలే ప్రొద్దెక్కిపోయింది, కూర్చో అబ్బాయ్! నిలబడతావేం, అలిసిపోలా?

రామూ: అలిసిపోయాను, బాగా అలిసిపోయానమ్మా!

తండ్రి: (ఎంతో ఆదరంతో) వాడికి వేడినీళ్ళుపెట్టి త్వరగా భోజనం పెట్టరాదూ?

రామూ: నాన్న నామీద చాలా ప్రేమగా వున్నాడమ్మా ఈమధ్య!

తల్లి : అదేమిట్రా! నీమీదగాక ఇంకెవరి మీద ప్రేమగా వుంటాంరా!

రామూ : (ఏడ్వలేక నవ్వుతూ) ఇంత భారం నేను మోయలేనమ్మా!

తండ్రి : (భార్యతోనే) అబ్బ! ఎలాగైనా ఉద్యోగమంటే చాలా కష్టమే! చేస్తున్నంతకాలం ఎప్పుడు రిటైరవుతానా అనిపించేది!

రామూ : (నవ్వుతూ) నేనుకూడా రిటైరు కావాలనుకుంటున్నానమ్మా!

తండ్రి : (భార్యతో నవ్వుతూ) విన్నావా వాడి మాటలు! (రామూతో) మొదటి నెలలో ప్రతిరోజూ అలాగే అనిపిస్తుంది! తర్వాత తర్వాత, సెలవు వచ్చినా యింట్లో కూర్చోడానికే కష్టంగా వుంటుంది!

రామూ : ఇప్పుడు కూడా యింటికి రావాలంటేనే కష్టంగావుంది నాన్నా!

తండ్రి : (ఇంకా పెద్దగా నవ్వుతూ, భార్యతో) చూశావా! నాకు తెలుసు! డబ్బు కంటికి కనపడితే యిక ఆఫీసే వైకుంఠ మనిపిస్తుంది!

తల్లి : (సంతోషంతో) ఎన్నడూ లేదు, ఇవాళ వింటున్నా; తండ్రీ కొడుకులు పరాచికాలాడుకోవడం! అబ్బాయి నవ్వుతుంటే యిల్లంతా కలకలలాడుతుందండీ!

రామూ : నవ్వడమా! చదువుకున్నంత కాలం బాగానే నవ్వానమ్మా; ఆ తర్వాత నాలో నవ్వే రామూ చనిపోయాడు, ఏడ్చే రామూ మిగిలాడు! (పెద్దగా నవ్వుతాడు).

తండ్రి : నీకేంరా! హాయిగా నవ్వుకుంటూ అట్లా సరదాగా కాలం గడపాలబ్బాయ్!

రామూ : ఏడ్వలేక నవ్వుతున్నా నాన్నా! (దుఃఖం పొంగివస్తుంది. చేతులతో ముఖం మూసుకుంటాడు. తల్లి, దండ్రి ఒకరినొకరు ఆశ్చర్యంతో చూసుకుంటారు).

తల్లి : ఛీ! ఏం మాటలురా అవీ! (రామూ చేతులుతీసి మెల్లగా నవ్వుతున్నాడు)

[ ఒక్కక్షణం నిశ్శబ్దం ]

తండ్రి : (కొడుకు నుద్దేశించి భార్యతో) ఇవాళ ఒకటో తేదీ అనుకుంటాను?

రామూ : అవును. ఒకటో తేదీ అనుకుంటాను?

తండ్రి : (నవ్వుతూ, భార్యతోనే) ఒకటో తేదీ జీతం వచ్చేరోజు!

రామూ : అవును. ఒకటో తేదీ జీతంవచ్చేరోజు.

తండ్రి : (భార్యతో) అబ్బాయి త్వరగా వచ్చాడే ఇవాళ? పోయి అన్నం పెట్టరాదూ?

రామూ : అవును. త్వరగానే వచ్చాను. ఆకలయింది. రెండు రోజులనుంచి అసలు అన్నమే తినలేదు.

తండ్రి : (ఆశ్చర్యంతో) అదేమిట్రా!

తల్లి : (బాధపడుతూవచ్చి గడ్డం పట్టుకుని) అంత ఎక్కువగా వుందా నాయనా పని?

రామూ : చాలా ఎక్కువగా వుందమ్మా!

తండ్రి : ఎలాంటిపని ఇచ్చారేమిరా ఆఫీసులో?

రామూ : అబ్బో, చెప్పడానికి వీల్లేదు.

తండ్రి : పోనీ జీతం ఇవ్వలా ఇవాళ?

తల్లి : పోనీ ముందు హోటల్ కుపోయి కాఫీతాగి రాకపోయావా?

రామూ : కాఫీకి డబ్బుంటే ఇంటికే వచ్చే వాణ్ణి కాదమ్మా!

తండ్రి : (ఆదుర్దాగా) ఏం? ఏమయింది? జీతం ఎందుకివ్వలా?

తల్లి : ఇదేం ఉద్యోగంరా? మరి ఎప్పుడిస్తామన్నారు?

రామూ : (దుఃఖం భరించలేక పెద్దగా) ఎక్కడి ఉద్యోగం! ఎవరిచ్చారు?

తండ్రి : (ఆందోళనతో) లేదూ? ఉద్యోగం లేదూ? వచ్చిందన్నావుగా?

రామూ : అన్నాను.

తల్లి: మరి ఇన్నాళ్లూ ఏం చేస్తున్నావబ్బాయ్!

రామూ : ఆరునెలలనుంచి చేస్తున్న తప్పు దిద్దుకుంటున్నా!

తండ్రి : (కోపంగా) అంటే? నీ ఉద్దేశం? ఎక్కడున్నావ్ రా?

రామూ : ఆరునెలలు తిరిగాను; కాళ్ళు బొబ్బలు పొక్కినై! ఊపిరి తిత్తులు చెడిపోయినై! నువ్వు నాస్థితిలోవుంటే ఇంతకంటె ఏం చేస్తావు నాన్నా!

తండ్రి : అయితే ఏం చేస్తున్నానంటావోయ్?

రామూ : విశ్రాంతి తీసుకుంటున్నా; విశ్రాంతి!

తల్లి : ఎక్కడరా? స్నేహితుల దగ్గరా?

రామూ : నావంటివాడికి స్నేహితు లెవరుంటా రమ్మా! రోడ్డు ప్రక్కన, పార్కులో, చెట్లకింద, అరుగుమీద! పార్కు చుట్టూ ఆఫీసులే! అందులో పనిచేస్తున్న వాళ్ళందరినీ చూస్తూ హాయిగా విశ్రాంతి తీసుకుంటున్నా! (యోగిలాగ) ఎందుకు నాన్నా అంత కోపం?

తండ్రి : (ఇంకా ఆగ్రహంతో, భార్యతో) చూశావటే, చూశావా! నే ననుమానించినంత పనీ జరిగింది! వీడు అసలు ఉద్యోగమే లేదంటున్నాడు! ఇప్పటి వరకు ఆ బాకీల వాళ్ళందరినీ కాళ్ళావేళ్ళాపడి ఆపితే, వీడు తెస్తాడుగదా అనే ఆశతో - (రామూతో) అసలు లేదు పొమ్మంటావా?

రామూ : అవును, లేదు! అవును, లేదు! అవును, లేదు!

తల్లి : (ఏడుస్తూ) మీ రూరుకోండి! వాడేదో పిచ్చిలోమాట్లాడుతున్నాడు. మీరు కోప్పడకండి!

తండ్రి : ఇక కోప్పడితే ఏం ప్రయోజనం! నీ కొడుకు భ్రష్టుడై పోయిన తర్వాత!

రామూ : నీ కొడుకే గాదు నాన్నా, మీ నాన్న కొడుకుగూడా! మనందరం అంతే!

తండ్రి : ఛీ! వెధవా! ఇంతపని చేసివచ్చి, ఇప్పుడు నోటికొచ్చినట్టు మాట్లాడతావురా!

రామూ : ఉద్యోగం కావాలని ప్రాధేయపడితే అందరూ ఎవరినోటి కొచ్చినట్లు వాళ్లు మాట్లాడారు; నేను మీతో అయినా మాట్లాడకపోతే ఎట్లా నాన్నా! (తల్లి, తండ్రి దగ్గరకు వెళ్ళి వారిస్తున్నది. అతను కోపాన్ని అణచుకుని మాట్లాడాలని ప్రయత్నిస్తున్నాడు)

తండ్రి : మాట్లాడతావురా! నీకు నా కష్టాలేం తెలుస్తాయ్! రేపటినుంచీ మనం వీధిలో అడుక్కుతినే గతిపడితే నలుగురిలో నా పరువేమౌతుంది!

రామూ : నలుగురిలో కాదు నాన్నా, నలభైకోట్ల మందిలో! పరువా!

బ్రతకలేనివాడికి పరువేం ఒరిగిస్తుంది నాన్నా!

తల్లి : (రామూను లాలిస్తూ) వద్దు రా అయ్యా! మనం లోపలికి పోదాంరా! అన్నం తిందువు రా!

తండ్రి : (భార్యతో కోపంగా) ఇట్లా బుజ్జగించే చివరికి నెత్తి నెక్కించు కున్నావ్! వీళ్ళకు ఖర్చు పెట్టడం మాత్రం తెలుసు! ఖర్చు, ఖర్చు, ఖర్చు! (రామూతో) పెంచాం, చదివించాం, పదిమందిలో గౌరవంగా బ్రతకాలని ఖరీదైన బట్టలు కుట్టించాం! ఆఖరికి మీ అమ్మ చచ్చిపోతున్నా మందులు కొనకుండా పరీక్షకు ఫీజుకట్టాను!

తల్లి : అబ్బబ్బ! మీరూరుకోండి! (ఆగి వింటున్న రామూను లోపలికి తీసుకు పోతున్నది.)

తండ్రి : (తన ధోరణిలోనే) నువ్వు పాసై బికారిగా తిరుగుతుంటే, పోనీ లంచ మిచ్చి ఉద్యోగం సంపాదించుకోరా అని ఐదు వందలిస్తే, అది కూడా చాతగాక, పైగా కేసు వచ్చిపడితే పెద్దవాళ్ళ కాళ్ళు పట్టుకుని తప్పించ లేక నా తాడు తెగింది! (ఈ మాటలు మాట్లాడుతూనే ఇంతకుముందు విసి రేసిన ఉత్తరీయం తెచ్చి పైన వేసు కుంటాడు)

రామూ : (వెనక్కి తిరిగివచ్చి కోపంగా) ఎవరు పెద్దవాళ్ళు! లంచాలు గుంజే వాళ్ళా? లాభాలు సంపాదించేవాళ్ళా? గొప్పగొప్ప పదవుల్లో వుండి నావంటి వాళ్ళగొంతులు కోసేవాళ్ళా? ఎవరు పెద్దవాళ్ళు! నాకు ఉద్యోగం యివ్వని వాళ్ళేగా?

తండ్రి : నీకు మంతి వుందా పోయిందా! ఏమి టీ మాటలు?

రామూ : మతిపోయింది నాకు గాదు, మీ అందరికీ! వొళ్ళమ్ముకుంటానన్నా, మెడమ్ముకుంటానన్నా వొద్దుపొమ్మనే ఈ లోకానికి! మనుష్యులు ఆకలితో చస్తుంటే, నీతులు చెపుతూ గోతులు తవ్వుతున్న యీ లోకానికి! ఏం నాన్నా! నాది తప్పుకాదని నాకు తెలుసు, నీకు తెలుసు! కాని నువ్వు మాత్ర మేం చేస్తావ్! సంసారం పోషించవలసిన వాడివి; ఇల్లు, పరువు, ప్రతిష్ఠ నిలబెట్టవలసినవాడివి (దగ్గు తెర వస్తుంది, ఆపుకుంటాడు. మృదువుగా) నాన్నా! చిన్నప్పుడు అంత ముద్దుగా ఎత్తుకుని తిప్పావే, పెంచావే! ఇందు కేనా! (కోపంగా) యిట్లా చిత్రహింస చెయ్యడానికేనా! నన్ను నీ సంపాద నకు సాధనంగా చూస్తున్నావు గదూ! నీకుగాదూ మతిపోయింది!

తల్లి : (కోపంపట్టలేక చరచర బయటికి వచ్చి) ఏమిట్రా యిది! నాన్నగారి మీద కేకలేస్తావట్రా! (మెల్లగా) ఆయన కష్టం నీకు తెలియదురా అబ్బాయ్! (చెయ్యిపట్టుకునిలాగుతూ) రా, లోపలికి రా! రా రా!

రామూ : ఎందుకమ్మా లోపలికి! ఏముంది! ఈ లోకంలో నాకు కావలసింది నీవు; నీవు యిక్కడే వున్నావుగా! (తల్లిని కౌగిలించుకుంటాడు)

తల్లి : (కరిగిపోతూ) మరెందుకు చెప్పావ్ నాయనా! ఉద్యోగం రాలేదనే చెప్పక పోయావా! అబద్ద మాడతావట్రా నాన్నతో, నాతో?

రామూ : (కన్నీటితో) అవును, అబద్ధమే! ప్రతిరోజూ పట్నమంతా తిరిగివచ్చి, ఉద్యోగం దొరకలేదని చెపితే, మీరు నన్ను అసమర్థుడని నీచంగా, శత్రువుగా చూస్తుంటే, ఒక్క నాలుగు రోజులన్నా సంతోషంగా గడుపుదామని, అవునమ్మా, అబద్ధం చెప్పా! అమ్మా నన్ను క్షమించమ్మా! అమ్మా నాన్నా కూడా నన్నర్థం చేసుకోకపోతే ఎట్లా బ్రతకనమ్మా! (తండ్రి యిది అంతా వింటూనే తల్లివంక చూస్తాడు. తల్లి అతి దీనంగా తండ్రి వంక చూస్తుంది.)

తల్లి : ఇదిగో, (తన మెడలోవున్న ఒకే హారం తీసి రామూకు ఇస్తూ) ఉద్యోగం తప్పకుండా వస్తుంది? నా బంగారు తండ్రికి ఎంత కష్టం కలిగింది! తల్లి దండ్రులు కోప్పడితే ఎక్కడన్నా కష్టపెట్టుకుంటార్రా!

(రామూ గొలుసు అందుకోబోతున్నాడు. తండ్రి చూస్తాడు. వెంటనే వచ్చి ఆమె చేతిలోనుంచి ఆగొలుసు లాక్కుంటాడు).

తండ్రి : (కఠినంగా) ఇదికూడా పోతే ఇక వాడూ, మనమూ వీధికెక్కవచ్చు! రేపు ప్రొద్దుటికల్లా నిలవ నీడలేకుండా ఏనుయ్యో, గొయ్యో చూచుకోవచ్చు!

రామూ : (పెద్దగా) నాన్నా!

తల్లి : (ఆశ్చర్యంతో) అదేమిటండీ!

తండ్రి : (అతి కఠినంగా) ఎక్కడికి పంపిస్తావ్ వీణ్ణి! పోయి ఎవరి నుద్ధరిస్తాడు! ఈ ముఖంచూసి ఎవడుద్యోగమిస్తాడు! ఇక్కడేపడి చావమను!

(తల్లి కంగారుపడుతున్నది)

రామూ : (వొళ్ళు తెలియని ఆవేశంతో కేకపెడుతూ) నాన్నా! నీవు నాశత్రువు!

తల్లి : (వారిస్తూ) రామూ! ఊరుకో!

రామూ : (కేకపెడుతూనే) అమ్మా! నీవు నా... (వెంటనే గ్రహించి, తలదించుకుని దీనంగా) క్షమించమ్మా! వెళ్ళివస్తా! (తక్షణం బైటికి వెళ్ళిపోతాడు. తల్లి, తండ్రీ నిశ్చేష్టులౌతారు).

తల్లి : (బైటికిచూస్తూ) రామూ! రామూ!

తండ్రి : (ఆజ్ఞాపిస్తూ) పిలవొద్దు!

తల్లి : ఏమిటి?

తండ్రి ॥ ఏముంది! నేను శత్రువునట!

రామూ : (తిరిగివచ్చి, సూటిగా గంభీరంగా) నీకు ఉద్యోగం లేకపోతే మీ నాన్న ఐదేళ్ళు పోషించలా? అంత మాత్రం ప్రేమ నీకులేదూ? అంత మాత్రం అర్హత నాకులేదూ? (వెంటనే వెళ్ళిపోతాడు)

తండ్రి : (కలవరపడతాడు. సిగ్గుతో తల దించుకుంటాడు. బైటికి చూస్తాడు.) రామూ! ఓ రామూ!

(రామూ వెళ్ళిపోయినట్టు తండ్రివైఖరి స్పష్టంచేస్తుంది. తల్లి దగ్గరికి వస్తుంది. ఇద్దరూ ఒకరి నొకరు చూసుకుంటారు.)

తండ్రి : (పలవరించినట్టు మాట్లాడతాడు) ప్రేమ!

ప్రేమగాదు శక్తి! శక్తిగాదు సంపాదన! సంపాదనలేని సంసారం శ్మశానమై పోతుందే! (తల్లి కన్నీరు తుడుచుకుంటూ, ఆయన చేయిపట్టుకుని కుర్చీలో కూర్చోపెడుతుంది.)



## రెండవ దృశ్యం



కొన్ని నెలలు గడిచింది. తల్లిదండ్రులు పూర్వంకంటె నీరసంగా బ్రతుకీడ్చుతున్నారు.

దశరథయ్య హాలులో పచార్లు చేస్తున్నాడు. ఆమె లోపలినుంచివచ్చి, అతనికి కన్నీళ్ళు కనపడకుండా కొంగుతో అద్దుకుంటున్నది. దగ్గరికి వస్తుంది. ఆమెలో ఏదో బైటపడలేని బాధ దాగివున్నట్టు స్పష్టంగా తెలుస్తోంది.

తల్లి: ఏమండీ!

తండ్రి: (ఏదో ఆలోచనలో వున్నవాడు ఉలిక్కి పడుతూ) ఊఁ ఏమిటి?

తల్లి: ఏమీ లేదు; ఎక్కడైనా కొంచెం డబ్బు చూడండి!

తండ్రి: నువ్వు నోరెత్తితే ఇది తప్ప వేరే సంగతి వుండదని నాకు తెలుసు!

తల్లి: అవసరమైనప్పుడు అడగక తప్పుతుందా మరి?

తండ్రి: ఉహూఁ ఏమిటా అవసరం?

తల్లి: (మాట్లాడదు)

తండ్రి: చెప్పవేం? ఎందుకు డబ్బు?

తల్లి: అదే...

తండ్రి: ఉహూ! వాడికి పంపించడానికేగా! ఏం, ఎక్కడున్నాట్ట! ఇక్కడికే రమ్మనరాదూ?

తల్లి: వాడు చాలా కష్టాల్లో వున్నాడండీ మనం...

తండ్రి: మనం సుఖంగా వున్నామా? ఏమిటట్లా మాట్లాడతావ్! ప్రొద్దున లేస్తే ఇంట్లో అడుగు పెట్టిన ప్రతీ వాడూ డబ్బుఅడిగేవాడేగా! అందుకు గాదూ, నేను లోకుల మొఖం చూడలేక ఇంట్లో కూచున్నది? పో, వాణ్ణే ఇక్కడికిరమ్మను, లేకపోతే పొమ్మను! ఏం ఉత్తరం రాశాడా? రాస్తే చించి పొయిలో పారెయ్యి!

తల్లి: మెల్లగా మాట్లాడండి! ఉత్తరం రాయడం కాదండీ—వాడు...

తండ్రి: కబురు చేశాడా? ఏం రాచ కార్యా లొరిగిస్తున్నాట్ట? అసలెక్కడున్నాడూ అంటే సమాధానం చెప్పవేం?

తల్లి: (జాలిగా) మీ కాళ్ళు పట్టుకుంటా మెల్లగా మాట్లాడండి! వాడు మన వాడుకాదూ? ఏమిటా మాటలు ఏమిటా పిచ్చి కోపం?

తండ్రి: (ఒక్కక్షణం తాపీగాఆలోచించి) నేనూ వాడూ కలసి నిన్ను యాతన పెడుతున్నాంగదూ! లేనులే, మళ్ళీ అట్లా మాట్లాడనులే! నాదగ్గర డబ్బు లేదు, మరి నేనేం చేస్తాను చెప్పు! (తల్లి దీనంగా లోపలికి వెళ్ళబోతుంది) మాట, ఇలారా! (వస్తుంది, ఆమె మెడవంక తేరిపార చూస్తాడు) నీ గొలుసు ఏం చేశావ్?

తల్లి: అమ్మించి డబ్బు పంపించాను! మీతో చెప్పానుగా!

తండ్రి: (కోపంగా) నీతో చెప్పానుగా, అమ్మవద్దని! (కేకలువేస్తూ) ఎందుకు చెప్పాననుకున్నావ్; నేనే అమ్మేసి ఏదో వొక బాకీ తీర్చెయ్యలేకనేనా!

తల్లి: మెల్లగా మాట్లాడండి! అబ్బ...

తండ్రి: (కోపంగానే) నాకు తెలియకుండా దొంగచాటుగా...

నౌకరు : (తలుపుకొట్టిన చప్పుడు.) ఏమండీ! దశరథయ్యగారూ! దశరథయ్యగారూ !

తండ్రి : ఎవరో వచ్చారు. పో, నేను లేనని చెప్పి తలుపు బిగించిరా !

తల్లి : (వెళ్లి మళ్ళీ తిరిగివచ్చి లోపలికి వెళ్లి పోతుంది.)

వ్యక్తి : (ప్రవేశిస్తూ) శుభమా అని పెండ్లి కొడుకుని చూద్దామని కొస్తుంటే తలుపులు బిగించుకుని కూచుంటారేం ! (తండ్రివేపోలోచిస్తున్నట్టుగమనించి) ఏమిటది! వియ్యంకుడుగారేదో దీర్ఘాలోచనలో వున్నారూ ?

తండ్రి : (నవ్వు నటిస్తూ) ఎప్పుడొచ్చారు ? ఇంటి దగ్గర అంతా క్షేమమేనా ?

వ్యక్తి : ఆహా ! ఏదో కాలం గడుపుతున్నాం! మన ఇంట్లో అందరూ...?

తండ్రి : ఆఁ, కులాసగానే వున్నాం.

వ్యక్తి : అంటే...చూడండి! ముందు నాకొక సంగతి చెప్పాలి !

తండ్రి : (భయంతో) ఏమిటది? భోజనమయిన తర్వాత తీరికగా మాట్లాడుకుందాం లెండి !

వ్యక్తి : అంతే లెండి ! (మనసు పట్టలేక) దానికేమిటిగానీ, ఈ మధ్య ఒకవార్త విన్నానూ...ముందీ ఒక్కటీ చెప్పేసెయ్యండి !

తండ్రి : (భయపడుతూనే) ఆ, అదా; అవునండి ! మావాడు ఒకరి మాటవినే రకంగాదు !

వ్యక్తి : (సంతృప్తిగా) అసలెందుకు వినాలీ అంటాను ! ఈ రోజుల్లో కుర్రవాళ్ళకున్న తెలివితేటలు పెద్దవాళ్లకు లేవండీ ! ఏమంటారు !

తండ్రి : (అర్థంగాక నవ్వువటిస్తూ) అంటె ?

వ్యక్తి : ఇంకా దానికి టీకా తాత్పర్యం చెప్పాలండీ, రెండు మూఁడేళ్ళలో డిప్టీ కలెక్టరౌతాడు చూడండి !

తండ్రి : (ఆశ్చర్యంతో భయంతో జంకుతాడు. మాట్లాడడు)

వ్యక్తి : ఆఁ కులాసగా వున్నాడా? ఏడీ, ఆఫీసు కెళ్ళాడా ?

తండ్రి : (తప్పనిసరియై చెప్పేస్తూ) లేడు ! అసలు ఇంట్లోనే లేడు. ఎక్కడికో వెళ్లిపోయాడు !

వ్యక్తి : ఏం ? అప్పుడే ట్రాన్‌స్ఫర్ అయిందా ?

తండ్రి : అసలు ఉద్యోగ మెప్పుడొచ్చింది?

వ్యక్తి : (ఆశ్చర్యంతో) అయితే ? మీరనేది ?...

తండ్రి : అవును, అసలు ఉద్యోగమే రాలేదు. మాపోరు పడలేక దేశాల మీద పొయ్యాడు. సంతోషించారా?

వ్యక్తి : (గాభరాగా) ఆ, ఆ, ఆ! సంతోషించ దలచుకుంటే మీఇంటి కెందుకొస్తానండి !

తండ్రి : మేం రమ్మనమనలేదే! మీరే వచ్చారు !

వ్యక్తి : రాక ఏంచేస్తామ డీ! నలుగురూ మంచివాడంటుంటే ఏదో పాడిచేస్తాడనుకున్నాం. తినడానికి మెతుకులేదని తెలిసిగూడా చదివిస్తే పైకొస్తాడుగదా అని కట్నంసొమ్ము ముందే ఇచ్చుకుని చదివించాం! ఇప్పుడేం చెయ్యాలి! చెప్పండి !

తండ్రి : అదిగూడా మీరేచెప్పండి !

వ్యక్తి : ఐతే ఇదేనా! ఇంత పెట్టుబడి పెట్టినందుకు మాకు మిగిలేది మీ

కోపాలూ తాపాలూ......ఇదేనా మర్యాద!

తండ్రి: (తనలోని దుఃఖం కర్కశత్వంగా మారింది) నిజం చెప్పుతున్నా! నేను కూడా పెట్టుబడిపెట్టా, మీకంటే ఎక్కువగా మమ్మల్ని పోషిస్తాడుగదా అని! వాడి జీవితాన్ని మన సంపాదన కోసం వాడుకుందామని ఇద్దరం ప్రయత్నించాం...

వ్యక్తి: (పెద్దగా) ఇదేం హాస్యంగాదండీ!

తండ్రి: హాస్యమని నే ననలేదే! వాస్తవం! వాస్తవం హాస్యంకంటే అద్భుతంగా వుంటుంది! (పెద్దగా నవ్వుతాడు)

వ్యక్తి: అదేమిటి! నేనేం నవ్వులపాలు గావడాని కొచ్చాననుకుంటున్నారా! చాల్లెండి!

తల్లి: (లోపలినుంచి వచ్చి, దీనంగా, కాని గట్టిగా) మెల్లగా మాట్లాడుకోండి! ఇంట్లో మేం బ్రతకాలా అక్కర్లేదా?

తండ్రి: (నవ్వు ఆపుకోలేక) తెలిసిందా! మీరు కేకలు వేసినా మెల్లగా వెయ్యాలి! ఇది ఈకాలపు మర్యాద! అవమానించినా, హత్యచేసినా అన్నీ అతి మర్యాదగా జరిగిపోవాలి.

వ్యక్తి: మీధోరణి నాకర్థం కావడంలేదు! ఇప్పు డేం చెయ్యమంటారు? పెండ్లి కుదుర్చుకున్నతర్వాత రెండేళ్ళాగాం; చదువు పూర్తిచెయ్యాలన్నాడు; సరే: పరీక్ష లైపోవాలన్నాడు; సరే, ఉద్యోగం రావాలన్నాడు ... ఇప్పుడేమో దేశాలమీదకి పోయాడంటారు ...

తండ్రి: (మాట్లాడడు)

వ్యక్తి: జవాబు చెప్పరేమండీ?

తండ్రి: (విరక్తుడై) ఏం చెప్పమంటారండీ, నా ప్రాణం తియ్యండీ!

వ్యక్తి: (ఆలోచిస్తూ) బాగానే వుంది! మీ ప్రాణం మా కెందుకు; మా డబ్బు మొత్తం రెండువేల ఐదువందలు, అంతేనా? మాది మాకు పడెయ్యండి! వెళ్లిపోతాం!

తండ్రి: (మాట్లాడడు)

వ్యక్తి: మాట్లాడ రేమండీ! ఇంతకాలం పెండ్లిచెయ్యకుండా అమ్మాయిని యింట్లో అట్టిపెడితే ఎంత అప్రతిష్ట వచ్చిందో మీకేం తెలుస్తుంది!

తండ్రి: (ఒక్కక్షణం మౌనంగా వుండి, హుందాగా) పాపం, మీ అమ్మాయి సంగతి ఆలోచిస్తే జాలివేస్తుంది!

వ్యక్తి: ఎందుకు! ఈ కబుర్లన్నీ మా కక్కర్లేదు. ఇక మీవాణ్ణి పెండ్లి చేసుకోదు; చేసుకుంటానన్నా మేం వొప్పుకోం!

తండ్రి: అందుకు కాదు! అంత మంచి అమ్మాయికి మీవంటి తండ్రి వున్నందుకు –

వ్యక్తి. (ఆగ్రహంతో పెద్దగా) యేమన్నావ్! మీ యింటికొచ్చింది మీ చేత మాట లనిపించుకోడానికేనా!

తండ్రి: (ఇంకా ఆగ్రహంతో) మా దగ్గర డబ్బులేదు! ఇక మేమేం చెయ్యలేం! తర్వాత మీ ఇష్టం!

వ్యక్తి: మరి మా డబ్బు?

తండ్రి: డబ్బు! డబ్బు. ఇదొక జబ్బయిపోయింది! పోండి! మావాడు చచ్చిపొయ్యాడనుకోండి! పోండి!

తల్లి: (చరచర బైటికివచ్చి కోపంగా) ఏమండీ! మమ్మల్నీ ఇంట్లో బ్రతకనిస్తారా లేదా?

తండ్రి : (తీవ్రంగా) బ్రతక్కపోతే చావండి!

తల్లి : (కోపం పట్టలేక) చచ్చే స్థితిలోనే వున్నాడు నీకొడుకు.

తండ్రి : (అమితాశ్చర్యంతో) ఏమిటి? ఎవరు?

తల్లి : (అతి జాలిగా) మన అబ్బాయే!

తండ్రి : (ఆదుర్దాగా) ఎక్కడున్నాడు?

తల్లి : లోపలే!

తండ్రి : ఏం చేస్తున్నాడు? ఎప్పుడొచ్చాడు?

తల్లి : వారం రోజులనాడు వచ్చాడు. వాడికి క్షయ జబ్బు పట్టుకుంది! ఇంటికొచ్చి మంచాన పడ్డాడు! (ఏడుస్తూ) వాణ్ణి చూస్తే ఏడుపొస్తున్నది. నెత్తురు కక్కుతున్నాడు. గొలుసమ్మి మందు ఇపిస్తున్నా...

తండ్రి : నాతో...నాతో చెప్పలేదేం?

తల్లి : వాడే వద్దన్నాడు! మిమ్మల్ని చూడ్డానికే సిగ్గుపడుతున్నాడు!

తండ్రి : (లోపలికి వెళ్ళబోతూ) పద, చూసివద్దాం!

తల్లి : (కట్టిగా) వద్దు!

తండ్రి : (తల్లిని పక్కకు తోసివేస్తూ, తీవ్రంగా) పో అవతలికి! నా కొడుకును నేనుచూసుకోగూడదూ? నేనేం అపకారం చేశాను వాడికి!

తల్లి : (అడ్డునిలిచి వారిస్తూ) వద్దు! మీరంటే భయం వాడికి! మిమ్మల్ని చూడటానికి ముఖం చెల్లడంలేదు వాడికి! వద్దు! (తండ్రి ఆమెవంక నిర్ఘాంతపోయి చూస్తూ నిలబడతాడు. ఆమె లోపలికి వెళ్ళిపోతుంది. అతను పడక కుర్చీలో కూలబడతాడు. ఇంతసేపూ పచార్లు చేస్తూ వింటున్న వ్యక్తి 'డబ్బే ఒక జబ్బయిపోయింది' అని గొణుక్కుంటున్నాడు. తండ్రి దగ్గరకి వచ్చి దైన్యం నటిస్తూ)

వ్యక్తి : మీరన్నట్టు; లోకంలో డబ్బే ఒక జబ్బయిపోయింది! (తండ్రి తల పంకించి వూరుకుంటాడు) మీ కష్టమంతా...ఈ విధంగా...చివరికి... పాపం (తండ్రి తలయెత్తి చూడగానే అతను ఆపేస్తాడు. మళ్ళీ పచార్లు చేస్తూ) మీరన్నట్టు...పాపం...

తండ్రి : (జాలిగా) నే నేమంటే ఏం ప్రయోజనం! మేం ఏమైపోతే ఎవరిక్కావాలి!

వ్యక్తి : (సానుభూతిగా పెదవి విరుస్తూ) నిజం! నిజం! ముమ్మాటికీ నిజం! (పచారు చేస్తూ) డబ్బే జబ్బయిపోయింది...జబ్బే డబ్బయిపోయింది! (హటాత్తుగా ఏదోస్ఫురించి) జబ్బే డబ్బయిపోయింది. జబ్బే...డబ్బే... ఐపోయింది! (ఆలోచిస్తూ తండ్రిదగ్గరికి వచ్చి, తాపీగా అతన్ని పరిశీలించి, అతిమృదువుగా) చూడండి! ఒక్క విషయం చెపుతా, వింటారా? మిమ్మల్నే! లేవండి! (తండ్రిలేస్తాడు. ఇద్దరూ ఒకరి దగ్గర కొకరు జరుగుతారు.) ఎందుకలా దిగులు పడతారు! మన మేం చెయ్యగలం! ఒకరు కష్టపడుతుంటే నేను చూడలేను! నా మాట వినండి!...అబ్బాయికి మందులు తెప్పిస్తారా? డబ్బు కావాలా?

తండ్రి : (ఆదుర్దాగా) ఇవ్వండి! మీ ఉపకారం మరిచిపోలేను!

వ్యక్తి : (డబ్బు ఇవ్వకుండానే) అయితే ఒక పని చేద్దామా?

తండ్రి: మీరేం చెయ్యమన్నా చేస్తాను!

వ్యక్తి: మళ్ళీ కాదనగూడదు! మాట యిచ్చినట్లైనా; తప్పుతారా! (రహస్యంగా) మనిద్దరం చెరిసగం తీసుకుందాం (అదేమిటో అర్థంగాక తండ్రి ఆశ్చర్యంగా చూస్తాడు) తొందరెందుకూ, నేనుచెప్తానుగా! (అతను డబ్బు ఇస్తాడు. తండ్రి తీసుకుంటాడు.)

తండ్రి: వాణ్ణి బ్రతికించుకుంటే అదే పదివేలు!

వ్యక్తి: అంతేగాదు (రహస్యంగా తండ్రి చెవిలో ఏదో చెపుతాడు. తండ్రి నిశ్చేష్టుడౌతాడు) ఒక వేళ చనిపోయినా పదివేలే!

తండ్రి: (నిస్సహాయుడై అటు యిటు తిరుగుతాడు) నాకర్థం కాలేదు!

వ్యక్తి: (చాకచక్యంతో మృదువుగా) ఇందులో ఏముంది అర్థం గాకపోవడానికి! నాదగ్గర కాగితాలు ఉండనేవున్నై! మీవాడి లైఫ్ ఇన్స్యూర్ చేద్దాం! (హటాత్తుగా డాక్టరు బైటి నుంచి లోపలికి పోతున్నాడు. వ్యక్తి చూడలేదు. తండ్రి చూసి కంగారు పడతాడు.) చూశారూ! మీవాడిచేత చిన్న సంతకం చేయిస్తేసరి! తర్వాత ఏది ఏమైనా పదివేలు రేపు తెల్లారేటప్పటికి...(వ్యక్తి డాక్టరును చూసి సంభాషణ ఆపి నాలుక కొరుక్కుంటాడు.)

డాక్టరు: (లోపలికి వెళ్ళబోతూ తండ్రితో) నమస్కారమండి!

తండ్రి: (కంగారుగా) నమస్కారమండి! మావాడు లోప ఉన్నాడు!

డాక్టరు: (వ్యక్తిని గమనిస్తూ లోపలికి వెళ్లిపోతాడు)

వ్యక్తి: మీకేం భయంలేదు! కావాలంటే ఇతనిచేతనే సర్టిఫై చేయించుదాం! (డబ్బులో వుంది అన్నట్టు వేళ్ళు మీటుతూ) ఇందులో వుంది!

తండ్రి: (నోట మాటరాని మనఃస్థితిలో) ఇదా, మీ, ఆలోచన!!

వ్యక్తి: ఏం బాగుందికదూ? ఇంతవరకు ప్రపంచంలో ఎవ్వరూ...అంటే, ఈ విధంగా జబ్బును డబ్బుగా మార్చలా; ఒప్పుకుంటారా!

తండ్రి: ఒప్పుకోవడమే న్యాయమంటారు! ఊ?

తండ్రి: పోయేవా డెలాగూ పోతాడు! మనమైనాసుఖంగా బ్రతకడంలో తప్పేమిటీ అంటారు?

వ్యక్తి: (సంతోషంగా) అంతే! అంతే!

తండ్రి: (కరకుగా) ప్రాణం పోయినా ఫలితముండాలంటారు? (వెళ్ళికుర్చీలో కూర్చుని తలపట్టుకుంటాడు)

వ్యక్తి: మనం ఏదో ఒక విధంగా...

తండ్రి: (కేక వెయ్యడానికి ఓపిక లేక) మీరు! మీరు మనుష్యులుగదా; తండ్రితో ఎలా చెప్పారీమాట! కన్నతండ్రితో!

వ్యక్తి: అయినా ఇందులో తప్పేముంది! మీకు కొంత డబ్బువస్తుంది, నాకూ నా డబ్బు వచ్చేస్తుందనుకోండి! రేపు ప్రొద్దుటికల్లా, అంటే మీవాడి సంగతి తేలిపోయేలోపల; అన్నిపనులూ పూర్తి చేసుకుని ఇంటికొచ్చేలోపల, అంతా సిద్ధంచేస్తా! పదివేలండీ! పదివేలు! పోయే ప్రాణాన్ని మనం పట్టుకోలేం గదా! వచ్చే భాగ్యంటే ఎందుకు వదులుకోవాలి!

తండ్రి : (ఇంత సేపూ నిశ్చలంగా మౌనంగా వున్నవాడు ఇప్పుడు అతిబలహీనంగా నవ్వుతాడు) మీరు చెప్పేది... న్యాయంలాగే కనపడుతుంది...

తల్లి : (ఇంతలో తల్లి లోపలినుంచి ఆగ్రహంతో సూటిగా వచ్చి, వ్యక్తి చెంప మీద ఈడ్చికొడుతుంది) నువ్వు మనిషివికాదు, రాక్షసుడివి! నీ వంటి దుర్మార్గు లుండబట్టే యెంత మంచివాళ్ళయినా, ఎంత చదువుకున్నవాళ్ళయినా నిలువనీడ లేక అల్లాడుతున్నారు!...

వ్యక్తి : (నివ్వెరపోయి చూస్తున్నాడు)

తండ్రి : ఏమిటది ఊరుకో!

తల్లి : (ఆమెకు ఎవరిమాటా విన్పించదు) నీ వంటి నీచులుండబట్టే వాడు దిక్కులేనిపక్షిఅయి దేశమంతాతిరిగి రెక్కలు విరిగి ఇంట్లో వచ్చి పడ్డాడు! మాచావు బతుకులతో చెలగాట మాడతావా! (తండ్రి చేతిలో డబ్బు తీసుకుని, వ్యక్తి మీద విసిరికొడుతుంది తండ్రితో) రండి! అబ్బాయి మిమ్మల్ని చూడాలంటున్నాడు!

తండ్రి : (ఇంతసేపూ సిగ్గుతో తల దించుకుని వున్న తండ్రి ఆశ్చర్యపడతాడు) నన్నా?

తల్లి : (ఆజ్ఞాపిస్తూ) అవును. మిమ్మల్నే! రండి!

తండ్రి : (లేచి నిలబడి, వెళ్ళబోయి, ఆగి) వద్దు! వద్దు! నేను రాను! వాణ్ణి కళ్లారా చూడదగినంత మంచివాణ్ణి కాదు నేను!

తల్లి : పిలుస్తుంటే రారేం!

తండ్రి : వద్దు! వాడు నన్ను క్షమించడు!

తల్లి : మీరు రావాలి! (ప్రాధేయపడుతూ) ఒక్కసారి వచ్చిచూడండి! మీ కంటే వాడి కెంత ప్రేమో మీరు తెలియదు!

తండ్రి : (తల్లి చేతులు పట్టుకుని) నేను కూడా...వాణ్ణి హింసించాను గదూ! లోకానికి బానిసనైపోయి, వాళ్ళతరఫున వాణ్ణి మాటలతోనే హాడిచాను గదూ!

(లోపలనుండి గంభీరంగా, కాని బలహీనంగా "అమ్మా! అమ్మా! అమ్మా!" అని రాముా పిలుపు వినిపిస్తుంది)

తల్లి : (తండ్రిచెయి పట్టుకుని) రండి! పిలుస్తున్నాడు! మీకోసమే! (ఇద్దరు లోపలికి వెళ్లిపోతారు. వ్యక్తి ఏమి చెయ్యడానికీ తోచక ఒకసారి అటూ ఇటు తిరిగి, హటాత్తుగా లోపలికి వెళ్ళబోతున్నాడు. డాక్టరు లోపలినుంచి బైటకు వస్తూ అతనికి అడ్డు నిలబడతాడు. వ్యక్తి తలఎత్తి చూడగానే)

డాక్టరు : (గంభీరంగా) నువ్వు గూడా ఎందుకు వెళ్ళడం! చనిపోయినవాడు సంతకం ఎలా పెడతాడు!

(లోపలినుంచి తల్లి, తండ్రి "రామూ! రామూ!" అని ఏడవటం వినిపిస్తుంది. వ్యక్తి తనవస్తువులు తీసుకుని బైటికి వెళ్లిపోతాడు. అతని వెంట డాక్టరుగూడా.)



## మూడవ దృశ్యం

★

[రాత్రి, హాలులో మినుకు మినుకుమని వెలుగుతున్న దీపం చుట్టూ క్రీనీడలు ఆడుతున్నాయి.

ఇల్లంతా మౌనంగా వుంది. అప్పుడప్పుడు ఎక్కడో చాలా దూరంలో కుక్కలు మొరగడం వినిపిస్తుంది. జాలిగా ఎవరో రాగమాలపించడం వినిపిస్తుంది.

తల్లి కుర్చీలో కూచుని బల్లమీదవున్న మల్లెపూలతో మాల గుచ్చుతోంది. తండ్రి నిశ్శబ్దంగా అటు ఇటు పచార్లుచేస్తున్నాడు.

తల్లి, తండ్రివంక చూస్తుంది. తండ్రి ఏదో చెప్పబోతాడు, కాని మాట్లాడడు. తల్లి చేయెత్తి ఏదో చెప్పబోయి ఆగుతుంది. కొన్ని క్షణాలు ఎవ్వరూ మాట్లాడరు.]

తండ్రి: ఏమిటాలోచిస్తున్నావ్ ?

తల్లి: (త్రుళ్లిపడి) ఆ? అహ, ఏమీలేదు.

తండ్రి: మరిచిపొమ్మని చెప్పానుగదూ!

తల్లి: ఏమిటి?

తండ్రి: అదే!

తల్లి: (హేళనంగా నవ్వి) హు! మీరు మరిచిపోగలిగారా?

తండ్రి: (మాట్లాడలేదు)

తల్లి: నేను మరిచిపోలేను! ఈ జీవితంలో మరిచిపోలేను! వాడు ఇంటి నిండా తిరుగుతూ... చిన్నతనంలో... హాయిగా ఆడుకుంటూ ... నిండుగా నవ్వుతూ పాడుతూ...ఇప్పటికీ వాడు ఇంట్లో తిరుగుతున్నట్టే వుంది...

తండ్రి: వారం రోజులు! అప్పుడే వారం రోజులు! తలుచుకుంటే ఇవాళే జరిగినట్టుంది! నా కళ్ళ ముందుగా వాడే...వాడే చనిపోవాలా; నాకా అదృష్టంలేదూ!

తల్లి: (బాధగా) ఊరుకోండి! ఏం మాటలవి!

(కొన్నిక్షణాలు నిశ్శబ్దం)

తండ్రి: నేను గూడా ... నేను గూడా వాణ్ణి పీడించాను! ఏం ఉద్యోగం చెయ్యనన్నాడా! దొరక్క పోవడం వాడితప్పా? తప్పునాది!...వాడు చనిపోవడమేమిటి. నేను బ్రతకడమేమిటి?

తల్లి: ఊరుకోండి! అట్లామాట్లాడితే నేను భరించలేను ... మీదికాదు తప్పు!

తండ్రి: నాదే! కాదూ, నాదికాదూ?

తల్లి: కాదు. ముమ్మాటికీ కాదు!

తండ్రి: నువ్వు మనసార మాట్లాడుతున్నావా, నన్ను ఓదార్చడానికా?

తల్లి: మీదెలా అవుతుంది! మీరేం చేస్తారు! సంపాదించినంతకాలం సంసారాన్ని పోషించారు! చదివించారు! మీరు రిటైరు కావాలని వాళ్ళంటే మీరేం చేస్తారు!

తండ్రి: అవును! నేను పనికిరాను! పాలన్నీ పిండుకున్న తర్వాత పాడు గెవరికి కావాలి! వాడూ పనికిరాలేదు! వాడు కష్టాలు భరించలేక కృశించి కృశించి చివరికి దిగులుతోనే ఆ జబ్బుపట్టుకుని...అబ్బబ్బా!...

(కొన్నిక్షణాలు మౌనం)

తల్లి: (ఏదో ఆలోచనవచ్చి హఠాత్తుగా) చూడండి! అబ్బాయి కళ్ళు ఎంత అందంగా వున్నాయనుకున్నారు! ధగ ధగ ధగ మెరిసిపోయినై! ఈ వూళ్ళో యింతమంది పిల్లల్ని చూస్తున్నాం గాని, వాడికంటే అందమైన వాళ్ళ

వ్వరూ కనపడలేదు! ఆ కండ్లు! వెన్నెల ముద్దల్లాగున్నై! అమ్మా! అని పిలిచాడు. చూశాను. ఆ కళ్ళలో వాడిదిగులు కనపడింది. వాడి ఆశ కన్పించింది. వాడి ప్రేమ కన్పించింది. 'అమ్మా!' అన్నాడు. 'ఎందు కమ్మా నాన్నకు నా మీద అంత కోపం?' అన్నాడు.

తండ్రి : వాడు చనిపోవడ మేమిటి, నేను బ్రతికి వుండటమేమిటి? నేనే, నేనే వాణ్ణి వేధించుకు తిన్నాను! అబ్బ! నే నెప్పటికీ మరిచిపోలేను. "నాన్నా! నీవు నా శత్రువు!" అన్నాడు. (మొహాన్ని చేతులతో మూసుకుంటాడు).

తల్లి : అబ్బబ్బ! ఇప్పుడెందుకు లెండి! ఊరుకోండి! (కొన్ని క్షణాలు నిశ్శబ్దం).

తండ్రి : (పూలమాలవంక దీక్షగా చూస్తూ) చాలా బాగున్నాయి సుమా!

తల్లి : మల్లెపూలంటే వాడి కెంతో ఇష్టం!

తండ్రి : వాడి జీవితమే అలాంటిది! సుకుమారమైన పువ్వు, ఏముంది చెప్పు కింద రాచి పారేస్తే ఎట్లా బ్రతుకు తుంది!

తల్లి : (పూలమాల చూపుతూ) బాగాలేదూ! అక్కడికి తీసుకుపోయి; అదే సమాధి దగ్గరికి; అలంకరించాలని...

తండ్రి : చాలా బాగుంది! (దీనంగా నవ్వుతూ) నీవు తల్లివి! వాడి మనసు నీకు తెలుసు! వాడికి తగినట్లే సన్నగా నాజూకుగా చాలా బాగుంది! ... ఈ పూలెంతకు కొన్నావ్?

తల్లి : అబ్బో! చాలా ఖరీదు చెప్పాడు. ఎంతైతే నేం, ఉన్న చిల్లరంతా ఇచ్చేసి తీసుకున్నా —

తండ్రి : (హటాత్తుగా కోపంవచ్చి) అంతా ఇచ్చేసి కొన్నావా! తర్వాతెట్లా? అప్పు పుట్టించలేక చస్తుంటే! ఏం ఇప్పుడు పూలదండ లేకపోతే! రేపు మన కెట్లాడబ్బు?

తల్లి : మీరు తండ్రి! కదూ?

తండ్రి : (వెంటనే పొరపాటు గ్రహించి పశ్చాత్తాపంతో కుంగిపోతూ, జాలిగా) నాదే పొరపాటు! నాదే! నాదే తప్పు! నాదే! (ఏదో ఆలోచించు కుంటున్నాడు. తల్లి కన్నీరు తుడుచు కుంటున్నది.)

(కొన్ని క్షణాలు నిశ్శబ్దం)

తండ్రి : (ఆలోచనలోనే తల్లితో) నేను కూడా... చిన్నతనంలో... మన మంతా ఎంత పవిత్రంగా వున్నాం!

తల్లి : (తల వూపుతుంది)

తండ్రి : ఏళ్లు గడిచినకొద్దీ, లోకానికీ, మనకూ జరిగిన పోరాటంలో నేనే ఓడిపోయాను! సంపూర్తిగా నా తత్వమే మారింది! మానవత్వమే పోయింది! నీవిప్పటికీ పవిత్రంగా వున్నావ్! ఏలా వున్నావో తెలుసా? నేను నిన్ను కాపాడాను!

తల్లి : ఇంటిపట్టున ఉండేదానికి నాకు లోకంతో ఏం సంబంధంవుంది! అవును!

తండ్రి : ఆనాడు కోపంతో నువ్వతన్ని ఉడితే ఆశ్చర్యపడ్డాను! అబ్బాయి... అబ్బాయి చనిపోతే...డబ్బు వస్తుం

దని ఆశపడ్డారు! అది న్యాయంగానే కనిపించింది; అబ్బా, ఎంత ఘోరం!

తల్లి: పోనీలెండి! ఊరుకోండి! మరిచి పోండి!

తండ్రి: మరిచిపోవాలనే ప్రయత్నం చేస్తున్నా, కాని గాయం నయమైతే మాత్రం మచ్చ మానుతుందా!

(కొన్ని క్షణాలు నిశ్శబ్దం)

తండ్రి: ఏమి టాలోచిస్తున్నావ్?

తల్లి: (ఉలిక్కిపడి) ఆ? అహ, ఏమీలేదు!

తండ్రి: మరిచిపొమ్మని చెప్పావుగదూ!

తల్లి: ఏమిటి?

తండ్రి: అదే!

తల్లి: (దుఃఖం ఆపుకోలేక) నేను మరిచి పోలేను! నేను మరిచిపోలేను! (ఉద్రేకంతో నిలబడబోతూ పూలమాల చేతిలోకి తీసుకుంటుంది. ఇంతలోనే దూరంగా జాలిగా రామూ గొంతు విన్పిస్తుంది. "అమ్మా! అమ్మా!" ఆమె విని కలవరపడుతుంది. చేతులు వొణుకుతాయి. పూలమాల మళ్ళీ బల్లమీద పడిపోతుంది. మెల్లగా రామూ ప్రవేశిస్తాడు. అతన్ని పోల్చుకపట్టడం కొంచెం కష్టమే అయినా, ముఖం యౌవన తేజంతో కలకల లాడుతున్నది. స్వచ్ఛమైన తెల్లని దుస్తులు ధరించాడు. అతి నెమ్మదిగా, మృదువుగా, గంభీరంగా అమృతత్వాన్ని స్ఫురింపజేస్తూ లోకమంతటినీ క్షమించే ఉదాత్త పురుషునివలె మాట్లాడుతాడు. ఆమె ఆశ్చర్యంతో చూస్తుంది.)

రామూ: అమ్మా! అంతా క్షేమంగా వున్నారా? (ఆమె తనను తాను నమ్మలేని స్థితిలో వుంది) నేనేనమ్మా; రామూని! మరచిపోయావా!

తల్లి: వచ్చావా, నా వొచ్చావా!

రామూ: నిన్ను చూసి పోదామని వచ్చానమ్మా!

తల్లి: (ఆనందం భరించలేక కన్నీరు కార్చుతూ, కౌగలించుకుంటూ) మా తండ్రి వచ్చావా! ఇదంతా కలగా వుంది! ఎక్కడనుంచి వచ్చావో; ఎలావచ్చావో!

తండ్రి: (ఆశ్చర్యపడుతూ, తల్లితో) ఎవరితో? ఏమిటది? ఎవరితో మాట్లాడుతున్నావ్?

రామూ: (తల్లితోనే) ఎక్కడున్నా ఎలా వున్నా అమ్మకోసం రాకుండా ఎలా తప్పుతుంది! (నవ్వుతూ) నీవు నేను జ్ఞాపకం వున్నంతకాలం నేను జీవించే వుంటానమ్మా!

తల్లి: (తండ్రితో) విన్నారా! మనరామూ! మాట్లాడరేం! బ్రతికే వున్నాడండీ!

తండ్రి: (ఆశ్చర్యంతో) రామూ ఆ? నీకేం మతి పోయిందా? ఏమిటా మాటలు, ఊరుకో!

తల్లి: మీకు కనపడటంలేదూ? మనరామూ మనన్ని చూసి పోవడానికొచ్చాడండీ!

తండ్రి: చాల్లే! ఏమిటీ వెర్రి! ఎట్లా వస్తాడు!

రామూ: నాన్నకు నేను కనపడటం లేదమ్మా! పాపం! అది నా తప్పు కాదు!

తల్లి: ఏం నాయనా! అయితే...నాన్నే తప్పు చేశాడా?

రామూ: కాదమ్మా, ఆయనదీ తప్పు కాదు, నాదీ తప్పు కాదు! నాన్న తనపాత్ర తాను నిర్వహించాడమ్మా! నీది విషాదం! నాది అంతం! లోకం దృష్టిలో ఇదంతా ఒక నాటకం.

తల్లి : ఏమిటో, నీ మాటలు నాకర్థం కావడంలేదు ! రా నాయనా, కూర్చోవేం!

రామూ : ఇప్పుడు కూర్చున్నా, నడిచినా ఏం చేసినా నాకు దిగులు లేదమ్మా; నాకు అనంతవిశ్రాంతి దొరికింది !

తల్లి ; (తండ్రితో) విన్నారా, విన్నారా ! మనవాడు సుఖంగా వున్నాడండీ ! ఇప్పుడు వాడికి దిగులన్న మాటేలేదు ! చూడండి ! ఎలా నవ్వుతున్నాడో !

తండ్రి : (ఆశ్చర్యంతో అంతటా పరికించి చూస్తూ) అయితే నిజంగా రామూ వచ్చాడా ? నిజమేనా ? నీతో మాట్లాడుతున్నాడా ? (బాధతో) మరి నాకు కన్పించడేం !

రామూ : ఎందుకమ్మా నాన్నతో చెప్తావ్ ! ఆయన మనస్సు నిర్మలంగా మారేవరకూ ... అంతవరకూ నన్నెలా చూస్తాడమ్మా !

తల్లి : అదేమిటిరా ! నాన్న మీద యింకా నీకు కోపమేనా రామూ !

రామూ : (నవ్వుతూ) లేదు ! కోపతాపాల సోపానాలు గడిచి వచ్చానమ్మా ! పాపం ! నాన్న ఏం చేస్తాడు ! ఆయన దశరథుడు ! కైకేయి స్వార్థంవల్ల ఆయన కళ్ళుమూసుకుపోయి, మనసారా ప్రేమించిన రామూను కష్టాల కారడవుల్లోకి తరిమాడు ! అమ్మా ! ఈలోకం కైకేయి !

తల్లి : (ఆనందం దుఃఖం పొంగొత్తివస్తుంటే పట్టలేక) రామూ ! నువ్వు మారిపోయావురా ! నువ్వు మా రామూవు కావు, దేవుడివి ! రామూ ! —

తండ్రి : (తల్లితో) అడుగు ! అడుగు ! నన్ను క్షమించమని అడుగు!

తల్లి : (అతి మృదువుగా) చూడు! నాన్నను క్షమించవూ ? అమ్మ కోరిక తీర్చవూ ?

రామూ : నే నేం చెయ్యగలనమ్మా ! మీ అందరినీ చూస్తుంటే జాలివేస్తుంది ! ఈ యిళ్ళు; ఇవి గోరీలు ! ఈ మనుష్యులు ఊపిరిపీల్చే శవాలు ! మీకంటె నేను నయం ! అందుకే, మిమ్మల్ని ఓదార్చి పోదామని —

తల్లి : (తండ్రితో సంతోషంగా) విన్నారా ! మన రామూకు మనమీద ఎంత ప్రేమో ! విన్నారా !

తండ్రి : (కోపం వచ్చి) ఏం ! అంతమాత్రం నామీద ప్రేమవుంటే నాకు కనపడగూడదా, నాతో మాట్లాడగూడదా ! నేనేనా అంత పనికిరానివాణ్ణి !

తల్లి : (రామూవంక చూస్తూ ఆందోళన పడుతూ) ఏమీ అనకోవద్దు నాయనా! ఆయన కోపదారి మనిషి, నీకు తెలుసుగా !

రామూ : నాకు తెలుసమ్మా! నాన్నకు కోపంలేదు. దుఃఖమే దుర్భరమై కోపంగా మారింది ! నాకు తెలుసమ్మా !

తల్లి : (కరిగిపోతూ) నీఅంత జాలిగుండె అందరికీవుంటే ఎంత బాగుండేది నాయనా !

రామూ : అందుకే వచ్చానమ్మా !

తల్లి : ఎందుకు ? చెప్పు నాయనా !

రామూ : చెపితే చేస్తారా ?

తల్లి : ఏం చెయ్యమంటావో చెప్పు ! మేమేం చెయ్యగలిగితే అది చేస్తాం; నీ కోసం !

తండ్రి : ఏం చెపుతున్నాడు ! అడుగు ! తప్పకుండా చేస్తాం ! ఈ క్షణంనుంచే!

రామూ : మీకు శక్తివుంటే చెయ్యండి చెయ్యమని అందరితోనూ చెప్పండి ! !

తల్లి : ఏమిటది ?

తండ్రి : అడుగు ! అడుగు !

రామూ : ఏముందమ్మా ! బాధలతో కృశించిపోయే వాళ్ళకు జాలితలిచి సహాయం చెయ్యండి ! మనుష్యులకు కావలిసింది డబ్బు, దర్పం కాదమ్మా; సంతోషం ! సుఖం ! ప్రతి మనిషీ మంచివాడైనా లోకం ఇంత దుర్మార్గంతో ఎందుకు నిండివుందో తెలుసుకుంటే, ఈ లోకాన్ని పూర్తిగా బ్రద్దలుగా పగులగొట్టి ఆకలి, జబ్బులు, ద్వేషం, క్రోధం అన్నిటినీ పూర్తిగా నాశనంచేస్తే, మళ్ళీ పునాదులువేస్తే, ప్రతిఇల్లూ చల్లగా, మనుష్యుల మనస్సులు కలిసి అంతా హాయిగావుంటే అదేనమ్మా సుఖం ! అది మనుష్యులకు తగినలోకం !

తల్లి : (పరవశనై, తండ్రితో) విన్నారా? విన్నారా ? రామూ ఏమన్నాడో విన్నారా ? వాడు దేవుడు !

తండ్రి : (ఆదుర్దాగా) ఏమన్నాడు ? ఆం ఆం ఏం చెప్పాడు ?

రామూ : అమ్మా ! నేను వస్తానమ్మా !

తల్లి : (హఠాత్తుగా దెబ్బతిన్నట్టు) ఆ ! ఆం ! వెడతావా ? వద్దు, వద్దు.

రామూ: తప్పదమ్మా! మనిషికి జీవితకాలమే తక్కువ ! మరి స్మృతి ఎన్నాళ్ళు బ్రతుకుతుందమ్మా ! (నెమ్మదిగా గంభీరంగా వెళ్ళిపోతాడు)

తండ్రి : వెడుతున్నాడా ? మనరామూ ! ఉండమను !

తల్లి : (నిశ్చేష్టురాలై చూస్తూ, భర్తవంకకు తిరిగి) రామూ వెళ్ళిపోతున్నాడు ! మీరు పిలవండి !

తండ్రి : ఏడీ ?

తల్లి : (బైటికి చూపిస్తూ) అడుగో !

తండ్రి : (బైటికిచూస్తూ, ఆశ్చర్యపడుతూ, హఠాత్తుగా ఆనందాతిరేకంతో పొంగిపోతూ) ఆ !, ఆ! అడుగో ! (పెద్దగా పిలుస్తూ) రామూ ! ఓ రామూ ! (రామూ వెనుతిరిగి చూస్తూన్నట్టు) అడుగో నవ్వుతున్నాడు ! (పిలుస్తూ) ఓ రామూ ! (రామూ వెళ్ళిపోయాడని తండ్రి ముఖకళవళికల్ని బట్టి తెలుస్తుంది. భార్యతో) రామూ నాకు కన్పించాడు నా వంక చూసి నవ్వాడు. (ఈ లోపల ఆమె పూలమాల చేతిలో పట్టుకోవడం చూసి) ఎంతపని చేశావ్ ! పూలమాల వెయ్యలేదేం !

తల్లి ! (బైటికి చూస్తూ ఆ మాటలు విని త్రుళ్ళిపడి, కలవరించినట్టు మాట్లాడుతుంది) ఏడీ! ఏడీ రామూ ! రామూ రాలేదుగా ! మన మనస్సులో కన్పించాడు ! అంతేగా !

(అతను విభ్రాంతుడై చూస్తుంటాడు ఆమె వెక్కి వెక్కి ఏడుస్తుంది.)



# పన్నెండు

## కుందుర్తి

కాలం ముళ్లకంపల తోడుగీడ్చిన బ్రతుకుదారి సందుల్లో గొందుల్లో
చెప్పులేని ఉత్తకాళ్లతో గెరిల్లాలు శీఘ్రంగా పరుగెత్తుతారు
వాళ్లెక్కిన ఆశయాల రథాలకు ఆయాసాల కొండలు అడ్డురావు
కష్టాల నీటిబొట్లు అంటీ అంటని మనస్సుల తామరలు వికసించిన
ఆలోచనల సరస్సుల్లో అనుదినం జలకాలాడే గెరిల్లాల మదేభాలను
ప్రాణభీతినక్రాలు పట్టుకోలేవు; బ్రతుకు శాపాలచక్రాలు ముట్టుకోలేవు

ఆశయాల అరమైలు పరుగుపందెంలో వ్యాఘ్రని తగ్గించినవాడే వీరుడు
చీకటి సర్కస్‌లో బాధల త్రాళ్లమీద గొడుగునడక నడిచినవాడే ధీరుడు
ప్రతిమనిషి గుండెలోని పులులను బైటికి తెచ్చి,
ఆడించి చూపేవాడు నాయకుడు
ప్రతి మనసులోని తీరని కోరికల గీతాలకు,
లయ కల్పించినవాడు గాయకుడు
బ్రతుకుబాధ బరువెత్తటంలో, తూకం పెంచినవాడే కుస్తీలపట్లలో నేర్పరి
తన ప్రాణం త్రాసుమీద ముక్కలు
సమంగా తూచినవాడే గడుసరి తీర్పరి

వారం రోజులముందు వట్టి పిరికిగుండె
నేడు ముప్పేట మలచిన దారపు కండె
ప్రాణం పెళ్లాలకు దాసులైన ఒకరిద్దరుపోను
మిగిలినవారు జితేంద్రియులు; ప్రతివ్యక్తిలోని శక్తి చేను
పండిన చైతన్యసస్యం నికరతూకం, కొంచెం తక్కువ కోటిపుట్లు
వ్యక్తులు, చేతుల్లో తెగిపోయిన
గొలుసుకట్లు, మనసుల్లో తెరపిచ్చిన చీకట్లు

తన ప్రజల యోగక్షేమాలను విచారించే
పని, అధికారం, మిలిటరీకి అప్పగించింది
గెరిల్లాల వార్తలువిని తుపాకి చివరకత్తి నాలుకతో చప్పరించింది !
రివిన్యూ లెక్కల్లో పేరున్నా, నిజానికి లేని గ్రామాలుతప్ప
అన్ని గ్రామాలను మిలిటరీ ఆదరించింది.
అధికారం ఆజ్ఞలమేరకు యిదివరకే కాలినగ్రామాలు తప్ప
అన్ని గ్రామాలను మిలిటరీ దర్శించింది.

గ్రామం నాలుగువైపుల గుబురుగా పెరిగిన చెట్లకొమ్మల సందుల్లో
కాపలాదార్లు ఉంటారు;
దూరాన కనిపించేదుమ్ము లారీలదని వారికి తెలుసు
అక్కడేసిన యీల గాలిలో గంతేసి చెప్పినవైనం గ్రామం గుర్తిస్తుంది
మనుషుల్లేని ఊరిమీద మనసుతీర దాడిచేస్తుంది మిలిటరీ

సూర్యుడి కిరణాలు తెలుపు; అందులో దాక్కున్న అనేక రంగులు
అద్దం అంచుగలమీద అవి పలచగా కనిపిస్తే;
సంఘం ఆశయాలుకూడా తెలుపు; అందులో ప్రజలశక్తి అనేకభంగులు
దాడిమధ్యలో అవి దళసరిగా కనిపిస్తే

సంఘం సమయంచూసి యెదురవుతుంది; మిలిటరీ సంఖ్యాబలం
సిరాపుండి పాళీచెడి రాయనికలం
ప్రజల తెల్లకాయితాలమీద రాయలేను ఏమి ఫలం?
ఇప్పుడు యెదురైంది ఆకలితో పదునెక్కి మెలికలుతిరిగిన హాలం
కొలిమిలో వంచిన కొడవలిలాంటి
ప్రశ్నార్థకాల బ్రతుకు టగ్గిమీదవేసిన గుగ్గిలం

ఓ అధికార దౌర్జన్యాల అంధకారమా పో, జయించలేవు నువ్వు
అదుగో పొడిచాడు సూర్యుడు; నవ్వింది తెలివి తామరపువ్వు
ఇప్పుడు యెదురైంది పొలాలనూ, ఫలాలనూ సమంగా పంచే నీతి
ఒక కోటి మహాజనులు విసిగి విసిగి చివరకు చేపట్టినరీతి !

ఇప్పుడు యెక్కడైంది ఆకలితో గుహ వెడలిన కోటికోరల పెద్దపులి
అడివిలో నాలుగు చెరుగులు ముడివేసి నిన్ను తీసుకుంటుంది లే బలి.

మనకండ్ల ముందు కనిపించే వ్యవస్థ; యిది చరిత్రకు పట్టిన అవస్థ
దీన్ని పట్టుకుని వ్రేలాడేవారు; యెన్నటికీ జయించ లేరు.
కారణం తెలీకపోవచ్చు; కార్యం జరుగుతుంది;
సంఘంలో సామాన్యులే మెండు
నీ చిరకాల వ్యసనమైన అసమానతకు చోటుండదు;
దీన్ని పరిష్కరిస్తాము ఉండు.
ఆయుధాల అహంకార దేవిని పూజించి ప్రయోజనం లేదు;
ప్రజల్లో గర్భితమైన శక్తి
అనంతం; నీవు వేసుకునే లెక్కలకు అందదు;
కారణం నీ అనుచరుల స్వార్థభక్తి.

ఈ నేల యెవరిది ? కోటి ప్రజలసొత్తు గదా !
కొందరు వద్దంటే ఒప్పుకోని చరిత్రా ! ముందుకుపదా !

["తెలంగాణా" కావ్యంలోంచి]



# కఠిన మార్గం

## (ఏకాంకం)

## పాకల వెంకటరాజమన్నారు

కాలం : ఏసుక్రీస్తు జీవించి ఉన్న రోజులు.

[ ఇండియాలో యాకూబ్ సౌధం. మేడగదిలో యాకూబ్, అతని భార్య మార్తా. యాకూబ్ చాలా ధనవంతుడు. అగర్భ శ్రీమంతుడు, యౌవనం దాటనివాడు, చిన్న గడ్డం, విశాలమైన నుదురు, కోటేర్చిన ముక్కు, పెద్ద కళ్ళు, నోరూ, పెదవులూ, ఇంద్రియలోలత్వం సూచిస్తవి: మార్తా అందగత్తె యని అంటారు అందరు. ఏ ఒక్క అవయవమూ అంతగా బాగుండకపోయినా, చేష్టల్లో, మాటల్లో, చూపుల్లో లాలిత్యం వుంది.

మార్తా కిటికీనుంచి తొంగిచూస్తోంది. యాకూబ్ మంచంమీద కూర్చున్నాడు. ]

యా : ఏమిటా కలకలం ?

మార్తా : ఏమి జనం ! ఏమి జనం ! కుంటివాళ్లు, గుడ్డివాళ్లు, వాళ్ళ వెంబడి వాళ్ళ బంధువులు, రోగంతో బాధపడే పిల్లల్ని భుజాలమీద వేసుకొని వెళ్ళే ఆడవాళ్ళు, ఒక్కక్షణం ఆగకుండా వెళ్ళిపోతున్నారు. ఏ పండగనాడూ చూడలేదు ఇటువంటి జనసమ్మర్దం.

యా : ఆయనదగ్గరికేనా ?

మార్తా : మరి? అయ్యో, చూడండి నా ముసలిదాది జుబేదాకూడా పది సంవత్సరాలుగా మాసలేదు దాని కాలిరణం. ఎలా నెరిగా పోతూవుందో ?

యా : ఏమిటీ మాయ !

మార్తా : (కిటికీనుంచి మంచం దగ్గరకు వచ్చి) భగవంతుని మాయ. ఇంకేం ఉంటుంది ?

యా : నేనూ చాలా విన్నాను. మొదట నమ్మకం లేకపోయింది గాని ఆయనకీర్తి రోజరోజకూ ఎక్కువైపోతూవుంది. మొన్న గలిలీలో ఆయనచేసిన మహాశ్చర్యం కళ్ళారచూచిన నా స్నేహితుడే చెప్పాడు.

మార్తా : ఏమది ?

యా : ఎలియాస్ ఎరగవూ. అతని కొడుకు వట్టి పిచ్చివాడు.

మార్తా: అవును, పాపం. ఎప్పుడూ కట్టేసి వుంచుతారు. ఒక్క క్షణం అజాగ్రత్తగా వుంటే వెర్రిగా ఎగురుతూ పోయి ఏ బావిలోనో, గోతిలోనో పడి పొయ్యేవాడు.

యూ: కొడుకుని తీసుకువెళ్ళారట; ఏమైనా ఉపయోగం ఉంటుందేమోనని. ఆయన కొండ మీద ఎక్కడో ప్రార్థించడానికి వెళ్ళినాడని విని, పోనీ ఆయన శిష్యులకు ఆ ఒకమాత్రం శక్తి ఉండదా అని, వారిదగ్గరికి పోయి చెప్పుకున్నాడు విషయమంతా. వాళ్ళల్లో ఇద్దరు ముగ్గురు అనుమానిస్తూ ప్రయత్నించి చూస్తామంటూ దగ్గిరకు వస్తే, కుర్రవాడు కరవబోయాడు. భయంవేసి వారు "మావల్లకాదు నాయనా" అని మొఖం వేలవేశారు.

మార్తా: అందరికీ ఉంటాయా అలాటి శక్తులు.

యాకూ: ఎలియాస్ ఆయనవచ్చే వరకూ ఉండి, ఆయన రావటంతో కాళ్ళమీద పడ్డాడు. ఆయన చాలా దయతో లేవనెత్తి, ఎందుకన్నట్లు సూచించగానే జరిగిందంతా చెప్పుకున్నాడట. ఆయన భంగపడి "అయ్యో, ఇంకా ఎన్నాళ్ళకి కలుగుతుంది విశ్వాసం? నేనింకా ఎన్నాళ్ళుంటానుమీతో" అని అడిగాడు. కొడుకుని తీసుకొనివచ్చి, ఎదురుగా నిలబెట్టగానే ఆయన ఏదో మంత్రించాడు. అంతే ఎక్కడ పిచ్చి అక్కడ పారిపోయి, నిక్షేపంలాగ అయ్యాడు కుర్రవాడు. శిష్యులు సిగ్గుపడిపోయి "స్వామీ, మాచేత కాలేదెందుకో" అన్నారట. ఆయన అన్నాడట కఠినంగా "ఊరికే రాదు తపోబలం" అని. ఆశ్చర్యంగా ఉందికదూ. అయితే అంతా నిజం. చూచినవాళ్లే చెప్పారు.

మార్తా: మహాత్ముడే నిజంగా. కానీ, 'నేనింకా ఎన్నాళ్లుంటా' నని ఎందుకన్నాడో కదా. అందులో ఏదో రహస్యం ఉందా?

యాకూ: నీ కెప్పుడూ వింత ఊహలే. ఏదో విసుగుతో అని ఉంటాడు.

మార్తా: మీరు అలాగే అనండి. నాకుమాత్రం ఏదో విశేషార్థం ఉందనే నమ్మకం. ఆయన అట్టే కాలం ఈ లోకంలో ఉండ డేమోనండి, అలాంటి వాళ్ళకి భవిష్యత్తుకూడా తెలుస్తుంది కరతలామలకంగా ... (కొంత సేపు మౌనంగా ఉండి హఠా త్తుగా) ఏమండీ!

యాకూ: ఆఁ. ఇంకేదో ఊహ పుట్టుకొచ్చిందా? చెప్పు.

మార్తా: ఆయన్ని మీ రొకసారి చూచి రారాదండీ?

యాకూ: (పలకడు)

మార్తా: ఇందులో తప్పేమి ఉందండీ.

యాకూ: ఊరికే చూచివస్తే ఏమి లాభం. వింతా, వినోదమూ? ఉత్సవానికి వచ్చిన జనసమూ హాన్ని నోరు తెరుచుకొని చూచే పల్లెటూరి వారి మోస్తరు చూచిరానా?

మార్తా: వద్దు. ఆయన దగ్గిరికె వెళ్ళి మాట్లాడిరండి.

యాకూ: నా వ్యర్థపు మాటలతో ఆయన్ని విసిగించనా. ఆయన చేసే మహత్కార్యాలకు అంత రాయం కలిగించమంటావా?

మార్తా: ఆయన అలాఅనుకోడు. చిన్నబిడ్డల్ని కూడా చేరదీస్తా రటండీ. అతని సౌలభ్యాన్ని పొగడనివారు లేరు.

యాకూ: ఏమడగను?

మార్తా: దైవానుగ్రహంవల్ల మనకు సిరిసంపద లోటులేదు. పరమార్థం ప్రాప్తించే మార్గం ఉపదేశించమని ప్రార్థించండి.

యాకూ: (కొంచెం ఆలోచించి) అబ్బా! (ప్రేమతో మార్తా తల నొక్కుచు) ఈ బుర్రలో ఎంత తెలివి ఉంది!

మార్తా: భయం వేస్తూ వుందండి వెళ్ళి వచ్చాక మెచ్చుకోండి.

యాకూ: భయమెందుకు? నే నే పాపమూ చెయ్యలేదు. ఆయన ఏమి ఉపదేశించినా అదిచెయ్య డానికి నాకేమి అభ్యంతరం ఉంటుంది? తప్పక చేస్తాను.

మార్తా: ఆయనకి మీరు శిష్యు లైతే మీకు నేను శిష్యురాల నవుతానులెండి.

యాకూ: ఒంటరిగా ఉంటావా?

మార్తా: ఫరవాలేదు. కిటికీనుంచి వీధిలోకి చూస్తూంటే ఎంత కాలమైనా గడిచిపోతూ వుంటుంది.

యాకూ: సరే, వెళ్తాను. [నిష్క్రమణ] (మార్తా కిటికీనుంచి చూస్తోంటుంది భర్త వెళ్ళడం; ఇతరులు రావడం, పోవడం. ఇంతలో ఆ గుంపులో దాది జుబేదా కనబడుతుంది. మామూలుగా కష్టంలేకుండా నడిచి వస్తోంది) జుబేదా (బిగ్గరగా) జుబేదా, పైకిరా, రా! రా! అబ్బ? ఏమి ఆశ్చర్యం.

[జుబేదా ప్రవేశిస్తుంది. ౬౦ ఏండ్లు దాటిన ముసలిదాది. ముఖంలో సంతోషం, ఆవేశం, ఆశ్చర్యం తాండవిస్తూవున్నాయి.]

జుబే: అమ్మగారు! అమ్మగారు! నన్ను రక్షించారండి ఆయన. ఈ జన్మలో నాకు మానదనుకున్నాను కదండీ రణం. అంతా ఆరిపోయింది. చూడండి (కాలు చూపిస్తుంది.) ఒక మరక తప్ప ఇంకేమీ లేదు — మాయగా వుందికదూ అమ్మగారు. కాదు, కాదు. ఆయన దయ, ఆయన మహాత్యం.

మార్తా: (కండ్లలో నీళ్ళు తిరుగుతున్నవి) చెప్పు, జుబేదా, చెప్పు. ఏమిజరిగింది? ఎలా జరిగింది?

జుబే: నేనీ రణంతో ఎంతబాధ పడ్డానో మీకు తెలియదండీ. ఎందరు హకీములదగ్గర మందు తిన్నాను. ఎంత ఖర్చుపెట్టాను. ఆవగింజంతా లాభం లేకపోయింది. ప్రాణం విసిగి ఇక తే నా కర్మే అనుకున్నాను. మొన్న ఆయన కథలన్నీ విన్నాను. పదిమందీ చెప్పుకుంటూ వుంటే, ఏమిటో తక్షణమే పిచ్చినమ్మకం కలిగింది. ఎలాగైనా ఆయన నా బాధ తీరుస్తాడు అని ... అంతే ... బయలుదేరాను.

మార్తా: నేనుచూచాను జుబేదా నీవు వెళ్ళడం. తదేకధ్యానంతో నీవు వెళ్ళటం చూచి వెర్రెత్తిందేమో అని కూడా అనుకొన్నాను.

జుబే: అలాగేనమ్మా. నా మనస్సులో ఒక్కటేభావం. వెళ్ళి ఆయన్ని ముట్టుకున్నా చాలు నారోగం కుదిరిపోతుంది అని.

మార్తా: ఎంత వెర్రినమ్మకం?

జుబే: నమ్మకమంతా వెర్రే కదమ్మా!

మార్తా: మాట్చేశావు. ఆఁ, తరవాత ఏం జరిగింది,

జుబే: అలా, ఒకటే ధ్యానంతో వెళ్ళాను. వెళ్ళేటప్పటికి ఆయన్ని మన దేవాలయం ధర్మకర్తో ఎవరో పెద్దమనిషి తన ఇంటికి పిలుచుకెళ్ళుతున్నట్లు చెప్పుకొన్నారు. దూరంగా కనబడింది ఆయన వీపు, తల. నాకూ ఆయనకూ మధ్య వదలు. గుండె జారిపోయింది. ఆయన్ని ఎదురుకొని వేడుకోవడం నావంటి దానికి వీలుగానిపని. పోనీ, ఆయన వస్త్రమైనా ముట్టితే చాలు, అనుకుని దీనంగా "బాబూ దారి తియ్యండి బాబూ" అని అడుక్కొంటూ, ఆయనదగ్గిరకి వెళ్ళడానికి ప్రయత్నం చేశాను.

మార్తా: పాపం!

జుబే: నాపుణ్యా మనమ్మా. అలా ఈదుకునివచ్చి, తీరా సమీపించేటప్పటికి, ఆయన ముందు వెళ్ళడానికి ధైర్యం చాల్లేదు. చెయ్యిచాచి ఆయన ఉత్తరీయాన్ని ముట్టుకొని ఆ చెయ్యి నాకళ్ళ కద్దుకున్నాను. ఒళ్ళు ఝల్లుమంది. చెమటలు పోసినాయి. గుండె గబగబా కొట్టుకుంది. రణంవల్ల ఎప్పుడూ పోటుపెట్టుతూవుండేది. ఆపోటు మాయమైంది. బ్రతికా నను కున్నా.

మార్తా: ఆశ్చర్య మాశ్చర్యం!

జుబే: ఇంకావుంది నా కథ. వినాలి మరి. అలా నేను ముట్టుకున్నా, క్షణంలో ఆయన ఇటూ అటూ చూచి అడిగారు "ఎవరు నా వస్త్రం ముట్టినవారు?" అని. ఆయన శిష్యుల్లో ఒకడన్నాడు "స్వామీ ఈ జనసమ్మర్దం మిమ్మల్ని చుట్టుకోవటం చూస్తూ, ఇందులో ఎవరు అంటే ఎలా చెప్పగలం" అని. అప్పుడాయన గిరుక్కున వెనక్కి తిరిగి నన్ను చూచాడు. అమ్మయ్య! తలుచుకుంటే జలదరిస్తుంది. నాకు అమిత భయం పట్టుకుంది. గజగజలాడిపోయా. నోట్లో తడిలేదు. వేరే ఏమీ తోచక సాష్టాంగంగా పడ్డాను. "స్వామీ నేనే, మీ వస్త్రం తాకినా, నా రణం మానిపోతుందని అలాచేశాను. రక్షించండి" అని ఏడ్చాను. ఆయన తన చేతుల్తో నన్ను లేవనెత్తి అమ్మా, నీ నమ్మకమే, నీరణాన్ని నయంచేసింది.

వెళ్ళు సుఖంగా వెళ్ళు. నీకు ఇక బాధ ఉండదు" అని చల్లగా పలికారు. ఇంతలోనే ఎవరో ఆ ధర్మకర్తగారి ఇంట్లో నుంచి వచ్చి "ప్రభూ, మీ కూతురు చచ్చిపోయింది. ఎందుకు స్వామికి శ్రమ" అని దుఃఖవార్త చెప్పాడు. ఆయన ధర్మకర్తని చూచి "ఏమీ భయం లేదు. నమ్మండి" అన్నాడు. వారలా వెళ్ళిపోయారు, నేను సంతోషం పట్ట లేకుండా గెంతుతూ వచ్చేశాను.

మార్తా: ఎటువంటి మహాత్ముడు!

జుబే: నేను వస్తూవుంటే దారిలో చెప్పుకున్నారు; ఆ ధర్మకర్త కూతుర్ని చచ్చిపోయిందాన్ని లేచి రా అని అనగానే మళ్ళీ బ్రతికి లేచిందని.

మార్తా: వెళ్ళు, దాదీ, వెళ్ళి శ్రమతీర్చుకో.

జుబే: అలాగే తల్లి. సెలవు.

[నిష్క్రమణ]

[మార్తా ఇటూ అటూ పచారుచేస్తుంది. ఖంగారుగా, అప్పుడప్పుడు కిటికీలోనుంచి చూస్తుంది. కొంతసేపటికి భర్తరావడం చూచి ధ్యానంవద్దకు పరుగెడుతుంది.]

[ప్రవేశం యాకూబ్. అలసినట్లుంటాడు గాని అది కేవలం శరీరం అలసట కాదు. ముఖంలో తేజస్సులేదు. ఆశాభంగంవల్ల వాడిపోయినట్లుంది.]

యాకూ: (తలమీద పాగా తీసి మంచంమీద విసిరి ఉస్సురంటూ కూర్చుంటాడు.)

మార్తా: ఏమండీ, ఆయన కనిపించనే లేదా.

యాకూ: ఓ, దర్శనానికేమీ భంగంకలగలేదు.

మార్తా: ఏమండీ అలా వున్నారు? ఆయన చులకనగా చూచారా? పరుషంగా పలికారా? దూషించారా?

యాకూ: అయ్యయ్యో, అలాంటి నిందలకి ఆయన చోటిస్తారా? ఆయన్ని అంటే పాపంతో నాలిక కుళ్ళిపోతుంది. మార్తా, అటువంటి సౌమ్యమూర్తి నేనీ జన్మలో చూడలేదు. ఇక చూడబోను. ఆయన నన్నుకాదు కదా, డబ్బుకు శరీరం అమ్ముకునే భోగస్త్రీని కూడా ఒక్క మాట పరుషంగా అనలేడు.

మార్తా: మరి?

యాకూ: వెళ్ళి, చేతులుమోడ్చి అడిగాను. "పుణ్యప్రభూ, నాకు

పరమార్థం ఎలా లభిస్తుందో సెలవియ్యండి." ఆయన విని చిరునవ్వుతో "నన్నెందుకు పుణ్యప్రభువని పిలుస్తావు. పుణ్య స్వరూపుడు ఆ భగవంతుడు ఒక్కడే. నీ ప్రశ్నకు నేనేమి జవాబు చెప్పమందువు. మన ఆచార్యులు నిర్ణయించిన నీతి మార్గాన్ని అనుసరించు అంతే" అన్నారు.

మార్తా: అంటే ?

యాకూ: అదే నేనూ అడిగాను. ఆయన ప్రత్యుత్తరం ఇచ్చారు. "ప్రాణం తియ్యకు, వ్యభిచరింపకు, అపహరింపకు, అసత్యమాడకు, తల్లిదండ్రులను పూజించు, అందర్నీ నీతో సమంగా ప్రేమించు." ఇంతే నా అని గర్వపడ్డాను. "స్వామీ, ఇవన్నీ నా చిన్ననాటినుంచే అనుసరించాను. ఇంకా ఏమి చెయ్యమని తమ సెలవు, పరిపూర్ణమైన పారమార్థిక జీవితానికి" అని ఉత్సాహంతో అడిగాను. మార్తా, అప్పుడాయన నన్ను పరామర్శించినట్లు చూచాడు, జాలిగా, నాకు అర్థం కాలేదు. మృదువుగా, అయినా నిశితంగా, గంభీరంగా పలికిన ఆయన మాటలు విస్పష్టమైంది.

మార్తా: (తొందరగా) ఏమన్నారు?

యాకూ: ఏమనా, చెప్తాను. "నాయనా నీకు పరిపూర్ణత్వం సిద్ధించాలంటే ఇంకొకటి చెయ్యాలి. నీ వస్తు వాహనాలు, ధన ధాన్యాలు యావత్తూ బీదలకు ఇచ్చేసి బంధాలన్నీ తెంచేసి, నా వెంట వచ్చేయి" ఇవీ ఆయన మాటలు. మార్తా! మార్తా! అలా అంటారని అనుకోలేదు. నానోట మాట రాలేదు. నమస్కారం చేసి, వంచినతల పైకెత్తకుండా, వచ్చేశాను. వస్తూవుంటే శిష్యులతో ఆయన అన్నది విన్నాను. ఏమంటే "నిజం చెప్తున్నాను! ధనవంతుడు ఆధ్యాత్మిక రాజ్యంలో ప్రవేశించడం దుస్సాధ్యం. లొటిపిట్ట సూది బెజ్జంలో నుంచైనా పోవచ్చునుగాని, ధనవంతుడు ఆ రాజ్యంలోకి పోలేడు" అని.

మార్తా: అబ్బా!

యాకూ: చాలా కఠినమార్గం కదూ మార్తా?

మార్తా: (పలకదు-కాని జాలిగా భర్తవంక చూస్తోవుంటుంది.)

యాకూ: (రెండు చేతులతో ముఖం కప్పేసుకుంటాడు.)

(ఈ నాటికకు ఆధారం బైబిల్)



# జకోస్లొవేకియా రచయితల సంఘం సందేశం

"ప్రియ మిత్రులారా, ఆంధ్ర అభ్యుదయ రచయితల ఐదవ మహాసభకు, అఖండ విజయాన్ని, తత్సభ్యులకు అనేక సృజనాత్మక విజయాలను ఆకాంక్షిస్తున్నాము. మాతో మీా సంఘము స్నేహమయి సౌహార్ద సంబంధాలను యేర్పరుచుకొంటుందని, అభ్యుదయ సంస్కృతి కొరకు, సమస్త విశ్వశాంతికొరకు మనము ఉభయులము సాగిస్తున్న కృషిలో భ్రాతృభావ ప్రేరిత సహకారాన్నికూడ స్థాపిస్తుందని నమ్ముతున్నాము".



# క్రాంతి - శాంతి

## కారుమంచి

గ్రీష్మర్తువు అపరాహ్నం
పంకా తిరగడం మానేసింది
కడలి క్రుంగింది
లోకం కుతకుతలాడింది
ప్రకృతి స్తంభించి
క్షోభించింది
సంక్షోభం వెర్రితలలు వేసింది.

♦ ♦ ♦

ప్రభంజనం పక్షాల విప్పించి
పర్వతాలకు పక్షాలూడాయి
గగనం ఉక్కిరిబిక్కి రయింది
మార్తాండుని ముఖం ఎర్రవారింది
ఆటంపై
ఎలెక్ట్రానులు ఎదురు తిరిగాయి
కాలుడు గంట వాయించాడు
అనుభవించిన సౌఖ్యం
విద్యుల్లతై ఆటలాడి
పాటబాడి మాటలాడింది.
రెండోమారు గంట మ్రోగింది
పోగుచేసుకొన్న పాపం
పొగమంచై చుట్టు ముట్టి
తట్టి లేపి ఉక్కిరి బిక్కిరి చేసింది

గంట మూడోసారి మ్రోగింది
పిల్లగాలులు తల్లి ఒడిలో జేరాయి.

♦ ♦ ♦

గడ్డిపరకలు గజాన్ని బంధించాయి.
చలిచీమలు సర్పాన్ని చంపాయి
భూమి ఆకాశాన్ని వెక్కిరించింది
గప్పు గప్పుమని
పెట్రోమాక్సులైటు ఆరిపోయింది
విద్యుల్లతేమో
నిలబడి వెలుగు లొలికించింది

♦ ♦ ♦

అశాంతి ముద్దుబిడ్డ క్రాంతి
ఆ క్రాంతి చిరునవ్వే శాంతి!

---

## బల్గేరియా రచయితల సంఘం సందేశం

"ప్రియమిత్రులారా, ఇవే మా హృదయపూర్వకాభినందనలు, ఘనమైన మీ దేశం ఆర్థిక, సాంస్కృతిక పురోగతికొరకు, శాంతి, సాంఘిక న్యాయంకొరకు జరిగే పోరాటంలో అభ్యుదయ రచయితలను మీ మహాసభ సంఘటితపరచి ఉత్సాహ మొసగగలదని మా నమ్మకము."



# హాస్య రచన

## పుచ్చా పూర్ణానందం

హాస్యం నశ్యం లాంటిది. అయితే ఆఫీసర్లక్వాలిటీ. ఘాటు, మంట వుండదు. నరాలు సళ్ళిస్తవి. పొడిత్రయం - కాఫీ పొడి, వక్కపొడి, ముక్కుపొడి - సేవించనివారరుదు. ఈ నాగరికత ప్రపంచంలో. మూర్తిత్రయం, సమిధత్రయం, కవిత్రయం, త్రయారుష్యం ఇంకా ఎన్నో. చుట్ట, బీడీ, సిగరెట్ యేదో వొక రూపంగా ఆ జ్ఞానపత్రాన్ని సేవించటమే మన లక్ష్యం. నశ్యం జ్ఞానచూర్ణం గనుక పండితులుకూడా నిండుసభల్లో పీలుస్తూ సీట్లు ఖరాబుచేస్తుంటారు. శంకరుడంతటివాడు పొడుండబ్బీ వదలను నిత్యాభిషేకాలకల్ల జలుబు చేసి.

హాస్యరచనంటే చమత్కారమైన పలుకులతో కితకితలు పెట్టడం. నవ్వుపువ్వులు విసిరి చక్కలిగింతలు పెట్టటం. దీనిలోకూడా ద్రాక్షాపాకం, నారికేళపాకం, కచ్చకాయపాకం వున్నాయి. ఒక జాతియొక్క గొప్పతనం తెలుసుకోవాలంటే చమత్కారంగా మాట్లాడగలవాళ్ళు, వ్రాయగలవాళ్ళు యెక్కువగా వుంటంబట్టి రుజువౌతుందని వొక చైనాకవి సెలవిచ్చాడు. హాస్యరచనలో వినోదమే కాదు; వికాసంకూడా వుంటుంది.

హాస్యమంటే బఫూనరీ కాదు. క్లౌను పాత్రకాదు. వసంతకుడి ధోరణి కాదు. కేవలం ప్రియవచనాలే కాదు. భావముండి తీరాలని లేదు. హాస్యం అనేది అనిర్వచనీయం. నిఘంటువుకు అందదు. హ్యూమర్‌ను డిఫైను చేయటానికి పూనుకోవటం హ్యూమర్ లేని లోపమే. ఒక రకమైన అసంబద్ధం, అస్పష్టత, అతిసున్నితం, అర్థరహితం — వీటన్నిటిలో నుంచీ హ్యూమరు పుట్టవచ్చు. తాను నవ్వించి తనుకూడా యితరులతో పాటు ఆ ఆనందంలో సగర్వముగా పాల్గొనగలగటమే హాస్యరచన. ఇతరుల వైచిత్రిని వేలెట్టి చూపి వేళాకోళం పట్టించటం. వెక్కిరించటం మాత్రంకాదు. నొప్పి కలిగించాలి; గాయపరచకూడదు. హ్యూమరిస్టు అంటాడు-పడతాడు. విట్టు పెంకు, హ్యూమర్ కొబ్బరి. హ్యూమర్‌కు విట్టు వాహనం. మన హాస్యం వుందే, విట్టు, సెటైరు, హ్యూమరు మూడూ నూరి కలిపి ముద్దకట్టు. విడతీస్తే సొగసులేదు. హాస్యం మానవ సౌందర్యానికి మంచి మెరుగు. దీనితో నొక జాతియొక్క సంస్కృతి తూకం, కొలత వేయవచ్చు. ప్రపంచంలో వున్న వాఙ్మయము లన్నిటిలోనూ యిది పెనవేసుకుంది. నవలలు, నాటకాలు, ఇతిహాసాలు, పురాణాలు, ప్రబంధాలు, ఆఖరుకు వేదాంత గ్రంథాల్లోకూడా వెతుకుతుంటే యీ మణిపూసలు విరివిగా దొరుకుతూ వుంటాయి. ఆదికావ్యం లగాయితు పొట్టి కథలవరకూ అన్నిటి

లోనూ అంతోయింతో కనబడుతూనే వుంటుంది. ఆంగ్ల సాహిత్యంలో యీ హాస్యరచన హెచ్చు; మేలైనరకం కూడానూ. ఇతరులు కొంత వెనకబడ్డారనే చెప్పాలి.

ఒక తలకాయపంతులు విట్టు వదిలాడు. పిల్లలు నవ్వాలా. బాలకులారా నేను మాట్లాడిన దాంట్లో హ్యూమరు వుంది నవ్వండి అన్నాట్ట. అప్పుడు స్టూడెంట్సు నవ్వారుట అందుకు. తబ్బిబ్బు మాటలు, స్పెల్లింగుతప్పులు, ఆగ్రహంలో, ఆవేశంలో తొట్రుపాటు, తొందర, పరధ్యాసలో తొస్సు, భోజన సమయాల్లో ఛలోక్తులు, వివాహాల్లో వరుసలు సరసోక్తులు, హ్యూమరిస్టుకు కావలసినంత ఫుడ్ కనుక హాస్యమంటే యిది అని చెప్పటంకంటే నా సంచికట్టులోని మచ్చుకు కొన్ని కుప్పెలు సభికులపై వాడి చూస్తా.

హైస్కూల్లో చదువుతుండే అన్నదమ్ములిద్దరూ కీచులాడుకుంటూ వొకడంటాడు—మీ మాస్టారుకు నత్తి; బట్టతల; గొగ్గిపళ్ళు; వొంటినచీడ. రెండోవాడు—మీ టీచరుకు చుండుబుర్ర; బుర్రముక్కు, యేప్రొద్దూ కారాకిళ్ళీనముల్తాడు. మొదటివాడు—మీ పంతులిమొగం సొరుగులు తీసిన డ్రాయరుకు మల్లే. వృత్తిక్షామ దేవత. ఇహ రెండోవాడు—మీ మాస్టరు ముక్కు పందికొక్కు కన్నాలు. గాలికి పిలక యెగురుతూవుంటుంది. అస్తమానం గోచీ వూడిపోతూ వుంటుంది. తండ్రి వచ్చి కేకలేసేదాక వీళ్ళిద్దరూ తమకు తెలియకుండానే తమ టీచర్లను పాడువర్ణన చేస్తుంటారు. వినేవాళ్ళకు యీ అమాయకపు భాషలలో కడుపు చెక్కలయ్యేట్టుగా నవ్వు వస్తూవుంటుంది.

నాన్నగారూ యముడు సూర్యుడి కొడుకా అని కుమారుడు తన సందేహం తీర్చుకోవాలని తండ్రిని అడిగాడు. కాదు, నాకొడుకు అని నాన్న జవాబు. 'రాముడు రావణుని చంపెను' యీ వాక్యంలో కర్మ యేదో చెప్పమని తండ్రి ప్రశ్నించాడు. చంపబడటం రావణుని కర్మ, వ్యాకరణము చదవటం తన ఖర్మ అని జవాబు. ముత్తయిదు యెదురొచ్చినా పరీక్ష తప్పితిని, శకునం పనిచేయలేదని పిల్లాడు అన్నాడు. గంగా భాగీరథిలో మాజీ ముత్తయిదుతనం వుంటుంది. శ్రీమతిలో రాబోయేవిధవత్వము వుంటుంది. అదీకాక కొందరికి జీవకళ, కొందరికి ప్రేతకళ పుట్టుకతోనే వుంటవి. ఆయాపాళ్లను బట్టి పనులు అవుతూవుంటవి. ఒక్కొక్క ముత్తయిదు యెదురైతే ఆగోజు వంతెన్లు విరిగి రైళ్ళు వాగుల్లో పడతై. బస్సులు ఢీకొని బ్రద్దలౌతాయి. లారీలు నిర్దాక్షిణ్యంగా నారీలపై పోతై. అంచేత శకునాన్నిబట్టి ఫలితం చెప్పలేమన్నాడు తండ్రి. నాన్నగారూ ఆ ముసలాయనవి పెట్టుడు పళ్ళా, పాలపళ్ళా అని అడిగాడు. "లేమరా అబ్బి, సహజంగా అగుపడాలని కట్టించినపళ్ళకే అక్కడక్కడ చిల్లులు, తూట్లు పొడిపించాడు. పాపం రెండు పళ్ళకు బంగారంకూడా వేయిస్తే, దారిలో దొంగలు పళ్ళూడగొట్టి ఆకాస్త బంగారం లాక్కున్నారు. చవకలో మళ్లా చేతకాని వాడి డెంటిస్టుచేత కట్టించుకుంటే నిద్రలో అవికాస్త వూడి గొంతునపడి ప్రాణం పోయినంతపని అయింది. ఈమాటు తెల్లని పాలపళ్ళు కట్టించాడు." పిల్లలు జన్మమే జయుడులాగా సందేహాలు అడుగుతునే వుంటారు.

మా బంధువు వొకావిడ ఆజన్మాంతం తబ్బిబ్బుమాటలే. ఒకమాటు పెండ్లికి వెళ్ళి వచ్చి అక్కడ ముచ్చట్లు చెప్తున్నది. పెండ్లి కుమారుడికి పట్టుచెంబులు, వెండిబట్టలు పెట్టారూ. అయిదురోజులూ విస్తళ్ళతిని అన్నాలు పారేసే టప్పటికి తెల్లగా కోడి కూసేది. అక్కడ జబ్బు చేసింది. మందు తెచ్చుకో సీసాయిస్తానన్నాడు డాక్టరు, అంది.

మరొకాయన సినిమా ముచ్చట్లుచెప్తూ దేవికాకుమార్ అశోకరాణీలులాంటి యాక్టర్లిప్పుడు లేరన్నాడు. పోతరాజు గానము, త్యాగరాజు కవిత్వం తనకు చాలా నచ్చినవన్నాడు. స్వరరాగసుధ అనబోయి సర్వరోగసుధ తనకు చాలా యిష్టమన్నాడు. మరదల్ని పిలిచి సున్నానికి ఆకులు రాయమని ఆజ్ఞాపించాడు. బావమరదులు వేళాకోళం పట్టిస్తే ‘నే నేమంత రంభనా’ అన్నాడు. ఒకమాటు అశ్వపతి వేషంవేసి ‘సత్యవంతా, యేమిటో నీగ్లుడు. చెప్తుంటే వినవేమిటి. నీవు కాకపోతే రేపీపాటికి నా కూతురికి నిక్షేపంలాంటి సంబంధం తెస్తానన్నాడు. పాడిసంగతి చెప్తూ గేనె యీదిందన్నాడు. చిన్నకర్రనైనా, పెద్ద పాముతో కొట్టాలని సెలవిచ్చాడు.

కొందరికి యింట్లో కవిత్వపు దొర్లుడు యెక్కువ.

‘ఒరేయి వెంకటరమణా ఎంతసేపురా సవరణ?’

గుడ్డలు మాపావా, గుద్దులు పడ్తై.

పంపువద్ద సబ్బుతుంపు వుంది యిటు పంపరా.

అతివరో అతిగా వాగకు, సుకుమారివైనాసరే తుక్కుమారి తంతా. మనకు నవ్వొస్తూ వుంటుంది వింటుంటే.

పిల్లల చదువులో వింత ఘట్టాలు వస్తూ వుంటాయి. సంధులు చెప్పరా అంటే— గుణసంధి, గూడూరుసంధి, పెనామాభూ సంధి, జిబ్రాల్టర్ జలసంధి, విజయవాడ రైల్వేసంధి, యుద్ధరాజ్యాలసంధి, టైఫాయిడ్‌లో సంధి అని వొకడు దండకం. మనిషికి ‘మని’ లేకపోతే ‘షి’ క్రింద జమ అని బ్రహ్మవాక్కు. తుఫాను + వుప్పెన = తుప్పెన; గుర్రం + అశ్వం = గుశ్వం; బజ్జీ + పకోడి = బజోడి— మొదలగు కొత్తపదాల సృష్టి. అక్షరాల్లో ‘ణ’ కానీ తనదగ్గర అణా లేదని నొక కుర్రాడు ఓగాల పడ్డాడు. నాన్నగారూ మంగయ్యగార్కి తైలచిత్రం కాదు ఘేతి చిత్రం తయారు చేయించాలన్నాడు. రెండో కుర్రాడు అందుకని సెంటరులో దిమ్మకట్టించి విగ్రహానికి బదులు వారినే నిలబెట్టితే బాగుంటుందని సలహాయిచ్చాడు. మూడోవాడు మరీ కొంటెకోణంగి. మంగయ్యగారి రంగునుబట్టి యినపవిగ్రహం చేయించి పేడపూయిస్తే బాగా సరిపోతుందని చెప్పాడు. ఇహ ఆ కవినాయన కొప్పడతాడు కవిత్వంలో. తిండికీ, తిరుగుడుకు వున్న హుషారు చదవడం వచ్చేసరికి చప్పబడుతుందేమిరా. పలక యెక్కడ పెట్టావురా, పలుకవేమిరా? యెక్కాలురాందే లెక్కలు రావురా, వల్లించరా, అడుక్కుతినాలన్నా అక్షరంముక్క వుండాలిరా. ఒరేఅబ్బీ నిచ్చెనపుచ్చింది. దాన్ని నమ్మి యెక్కకురా. అదేమిదస్తూరిరా, సాలెపురుగు సిరాబుడ్డిలోమునిగి కాగితంపై చిందరవందరగా పరుగెత్తినట్లు, కంగారుమృగం గంతేసినట్లు... లక్ష్మీ యివాళ్ళ సాజ్జభక్ష్యం చేయవే మనసోయింది. ఆబిడతక్కువా! వెన్నకాచిన నెయ్యిలేదు; వెన్ను కాచిన

నెయ్యే. కలియుగంలో కామధేనువు ఫాక్టరీరూపంగా మారింది. పాలపిండి వచ్చాక నాక్కూడా పాడిగేత బయట పడ్డది.

కొందరు కక్షిదార్లు కోర్టుభాషలో తిట్టుకుంటారు. నిన్ను పప్పుచారు త్రాగిస్తా. గోదావరిస్నానం చేయిస్తా. ఇనపమురుగులు పెట్టిస్తా. నీకు ఆటోదిబ్బహారు ఘుమఘుమ, నీఆస్తి యావత్తూ టపటప. ఇరసాల్ వెంటెక్కిస్తా. ఆటే నెగ్గితే వుయ్యాల వూగిస్తా. ఇదీ వరస.

ఇహ నాటకాలు : బాలురు, గర్భిణీ స్త్రీలు రావొద్దని హెచ్చరిక. రాళ్లుపడినను నాటకం ఆపబడదు. విసిరిన చెప్పులు హాల్లోనే వేలంవేస్తాము. నటకులకు తగిలిన దెబ్బలకు కేసులుపెట్టము కిరాయి తక్కువైనా నటులందరికీ తురాయివేసాలే. పాట్లుతక్కువైనా ప్రతి యాక్టరూ ఆర్టు చూపిస్తారు. సరుకు తక్కువైనా సంగతులు యెక్కువ వేస్తారు. గొంతు తక్కువే కావచ్చు. గంతు జాస్తి. కిర్రగాత్రాలు కనుక బొంగురుపోవు. మంగళాంతంలో అందరికీ కఫం తెగుతుంది.

ఒక వుపన్యాసకుడ్ని వార్షికోత్సవానికి రమ్మనిపిలిస్తే శరీరస్థితి సరిగా లేదన్నాడు. కీర్తికాంత గట్టిగా కౌగిలించుకుంటే మెడనరం పట్టిందన్నాడు. అనేక సభలలో వేసిన పూలదండల బరువుకు నడుం వంగిపోయిందన్నాడు. వ్రాసియిస్తాను అక్కడ చదువుకోండి; అక్కడ పెట్టబోయే ఫలహారాలు పొట్లంకట్టి ముందుయిచ్చి వ్రాతప్రతి తీసికెళ్ళమన్నాడు. ప్రయాణపు ఖర్చులు యిచ్చేస్తే చేబదుళ్ళు తీర్చుకుని రుణ విముక్తి పొందుతానన్నాడు.

మరి కట్నాలు : నీకు కట్నం యెట్లా యిల్లుకూడా లేదుగా. అది పెట్టి గృహ నిర్మాణంచేసి వొక యింటివాడవౌదామని కోరిక. మరో అల్లుడుగారు కట్నం జాస్తి అడిగారు. ఎందుకుట అంటే, యీసొమ్ములోనే సగం పెట్టి మొదటి పెండ్లాం మనోవర్తి తగువు పరిష్కరించుకోవాలన్నాడు.

ఇహ తిండిగోడవ: కోడి చాలా రుచిగల వస్తువుగనుక 'పకోడీ' శాకాహారులు విరివిగా వాడుతున్నారు. పేరు పెట్టినంత మాత్రాన్నే ఆ కమ్మదనం. భోజన పరులకు తృప్తి యేదో రకంగా.

మిత్రుల ఛలోక్తులు : నాకు కాలం సమీపిస్తున్నది. యముడి దున్నపోతు మెళ్లో గంటల చప్పుడు వినవస్తున్నది. మీరు వాహకులుగా వుండాలి అని వొకాయన కోరాడు. మీ శరీరం చాలాభారం. మృతకళేబరం బరువింకా జాస్తి. నేను బక్కవాడ్ని. సింహమకరధ్వజం సేవించి తయారు తింటాను. పెట్టుబడిక్రింద డబ్బివ్వండి అని జవాబు. ఆ టానిక్ నేనే పుచ్చుకుంటే మీరు మోయకలసిన అవసరం కలగదేమో అని ఆ పిసునుకట్టు.

పోట్లాటల్లో : నీ బిల్డింగ్ కంటె నా కాంపౌండుగోడ పెద్దది. నీ పెండ్లాంకంటె నా పనిమనిషి అందమైనది. నీ ఆస్తి నా అప్పంతలేదు. నీ తలపాగా కన్న నా కొల్లాయి పెద్దది. నీ పెండ్లికంటె నా వొడుగు అతి వైభవంగా జరిగింది. నేను వేసేవి చేనేతవస్త్రాలు, నీవు కట్టేవి కావి నేత గుడ్డలు. ఇహవాడు నీవు పాలెస్‌లో పిల్లివి. నేను పూరింట్లో పెద్దపులిని. నీవు రామకోటి వ్రాసినా దస్తూరి కుదర్లా. నాకు జాతాలు జాస్తి. చెప్పులు జతలకు పట్టిన మన్ను తీసి కొన్ని బళ్ళు నా

మాగాణి చేలకు తోలించా. నా యిస్త్రీ గుడ్డలు దులిపితే రాలిన యిసుకతో సిమెంటురాళ్ళ తీయించా. నేను అందరి మోస్తరు కింద చావను. మేడపైనే ప్రాణం వదులుతా...అయితే నిన్ను మోయలేక వాహకులు చస్తారు. నీకు వొక చెంప చేస్తుంటే రెండో చెంప మాస్తూవుంటుంది. అంచేత నిత్యక్షవరం...నీవు నాటుకత్తితో చేయించుకుంటావు. ముఖమంతా రక్తపాతం; కందిపిలక చెక్కినట్లే...మా ఆవిడ కనకాంబరాలు తప్ప పెట్టుకోదు. చదువుకున్న దాన కనుక శిరోజాలు మృగ్యం. నా పెళ్లాం ముద్దబంతి పూలజడ వేస్తుంది. ఆరోగ్య నిలయం...మాటకారులైన మిత్రులు చేరితే యీ గొలుసుకు గొళ్ళెం పడుతునే వుంటుంది.

మా కుర్రాడు బస్తీలోనే పుట్టి యిక్కడే పెరిగాడు. వాడు చేలు, తోటలు చూడలా. మామిడిమట్టలకున్న సొగసు కొబ్బరి కొమ్మలకుండదు; పనసముంజలు తాటితొనలకన్న రుచి జాస్తి; వరిచెట్టు బెండతీగలాగా అల్లుకుంటుందా, పెండలం వృక్షం మాదిరిగా పూడలు వుంటవా ?... నాన్నా విండ్సరు ప్రభువు పట్టాభిషేకానికి పెట్టిన ముహూర్తం మంచిదికాదు... అదేమిట్రా రాములవారి పట్టాభిషేకానికి వశిష్టుడంతటివాడు పెట్టే, ఆంధ్రరాష్ట్ర అవతరణకు దైవజ్ఞులైన జ్యోతిష్కులు పెట్టారు...కనుక యెన్నో వ్రాయవచ్చు.

సంఘానికి ప్రయోజనం, వుపయోగం కాని నిరర్థకి పుక్క ప్రలాపాలలోకూడా హాస్యం జనించవచ్చు. కపటమనస్కులు, నాలిముచ్చులు, మౌనవ్రతులు - వీరిని కదిలిస్తే కిటికిచీకటి. హుషారుపురుషుల్ని కదిలిస్తే నవ్వుల దొంతర్లు. వివిధ విపరీత ప్రవృత్తుల సమ్మేళనం, విచిత్ర పురుషుల చిత్రమైన సంభాషణలు, కోతలరాయుళ్ళ డచ్చీలు, కాముకుల ప్రేమగోడవలు, తేనె చంద్రుడ్ని అనుభవించగానే భగ్న ప్రేమలు, ముద్దమాటలు, ముద్దుమాటలు, వున్న వొత్తులు మ్రింగి లేనిచోట వేయుట, ముక్కుధ్వనివాళ్ళమాటలు, మందపాటి చర్మంగాళ్ళ జవాబులు - యివన్నీ హ్యూమరిస్టుకు కావలసినంత ఆహారం. ప్రహస్యదృష్టిపోయి హాస్యదృష్టితో చూడాలి.

అభ్యుదయ రచయితలకు వొకి మనవి. కత్తిసాధించలేని ఘనవిజయం మనం చేపట్టాలి. మానవుడ్ని పశుత్వంలోంచి పైకి లాగి దైవత్వంలోంచి కించిత్తు క్రిందికి దింపాలి. ప్రపంచమంతా పైరుపచ్చలతో, పాడిపంటలతో, సిరిసంపదలతో, ధగధగాయమానమున, జగజ్జేగీయమానంబుగ చేయాలి. కవులు కల్పనమర్చంట్సు కాగూడదు. మనం పూనుకుంటే సప్తసాగరాలు సాంబారుగామారి పర్వతశ్రేణులన్నీ యిడ్లీరాసులుగా తయారౌతాయి. ఇంటింటా వరలక్ష్మి పనిమనిషై పోతుంది. సరస్వతి పంతులమ్మ, కుబేరుడు పాలేరు. హరిహరులు ద్వారపాలకులు, నారదుడు, తుంబురుడు సంగీతపు మాష్టర్లు, వాకిట్లో కామధేనువు, దొడ్లో కల్పవృక్షం, వంట చెరుకుకు సంజీవిపుల్లలు. కట్టుకోటానికి పట్టు పీతాంబరాలు. ఆత్మకింపయిన భోజనం. వేపుడు కూరలేగాని పూరగాయ పచ్చళ్ళకు స్వస్తి. అందరికీ అజీర్ణబాధ గాని ఆకలిమంటలు వుండవు. కప్పూరవిడెం, హంసతూలికా తల్పం. వుయ్యాలమంచం. కేళీగృహ నవ్యహర్మ్యంబులలో నివాసం. విశ్వమంతా తోరణాలు. నిత్య కల్యాణం

పచ్చతోరణం. మానవులంతా సర్వమంగళ గుణ సంపూర్ణులౌతారు. నిరాశకు నిస్పృహకు తావులేదు. నవచైతన్యం. మారణాయుధాలకు భూస్థాపితం. చీలిపోయిన గ్రామాలు చిగురిస్తాయి. కావ్యవృక్షాలు భావకుసుమ-లతో భూభాగమంతా బృందావనం. నెమళ్ళు పింఛాలు విప్పి మయూరీ డాన్సు. పొన్నచెట్టుపై మోహన మురళీ. ఇహ భోగం మేళా లుండవు. ప్రతి పందిట్లోనూ కవిసమ్మేళనమే. పౌరుషాలు పోట్లాటలు కలలో కూడా కనపడవు. మానవ కుటుంబమంతా మమేకం. పరస్పరాభ్యుదయానికి అంకురార్పణ. మానవశ్రేయస్సు, శాంతి, ధర్మనిరతి, సంస్కృతి దీప్తి. జాతి, మత, కులభేద నిర్మూలన, విశ్వప్రేమ, విశ్వకళ, విశ్వగానము, ప్రపంచ ఐక్యత, సమహితత్వం, సౌభ్రాతృత్వము, శాంతిపుష్పాలు, ప్రేమఫలాలు విదేశాలకు రవాణా. సామ్రాజ్యకాంక్ష, సంఘర్షణలకు తిలోదకాలు. యుద్ధానికి మారకం. సత్యకిరీటం. ప్రేమబావుటా శాంతిపథకమే మనకు మేలుబంతి. ప్రపంచమంతా ఒకే జెండా. సహనం, సమత్వం, సౌజన్యం, సౌశీల్యం, సహకారం - వీటి పునాదిపై ప్రపంచ ఐక్యత సౌధనిర్మాణం. ఈ బిల్డింగుకు కంట్రాక్టర్లు అభ్యుదయ రచయితలు.

రష్యాలో మిత్రుడు మొన్న మా నెహ్రూగారు ఊరికే రుచిచూపించి పోయాడు, మా ఆవిడకు వేవిళ్ళు, మామిడి పళ్ళమీద మనసోయిం దన్నాడనుకో. వెంటనే మనం నూజివీడు చిన్నరసాలు, జహాంగీరు పసందు, అక్బరుపసందు, షాజహానుపసందు వేగన్లకొద్దీ శీఘ్రగా పంపటమే. మా దేశంలో ముత్తయిదులకు నగలమీద మమకారం, బంగారం కావాలని కోరామనుకో వెంటనే అమెరికానుంచి టన్నుల కనకవర్షం. జర్మనీ జపానులు మాకు యిరుకుగావుంది భూదానం కావాలన్నారనుకో ఆస్ట్రేలియావారు, ఆఫ్రికావారు దఖలు వ్రాస్తారు. ప్రతిఫలం అక్కర్లేదు. మా దేశంలో బొగ్గు, యినుముతప్ప యేమీ లేవు; యింత తిండీ గుడ్డా కావాలని ఆంగ్ల సోదరుడు అనగానే, మన దేశం నుంచి మరమరాలు, అటుకులు, అప్పడాలు, దూది యెగుమతి. అరువూ లేదు, ఖాతా లేదు. ఇలా వుంటుంది మన అభ్యుదయ రచయితలకు పెత్తనమిస్తే. అలాంటప్పుడు తగాదాలు, యుద్ధాలు యెందుకు వస్తాయి బ్రదర్.

చతుస్సాగర పర్యంతం శుభంభవతు లోకాస్సమస్తాస్సుఖినో భవంతు. విశ్వమానవ కల్యాణానికి మన అభ్యుదయ రచయితల మంగళవాయిద్యం.



# విక్రాంత సంక్రాంతి

సోమసుందర్

తెలుగులకు తొలినొల్ల సంక్రాంతి వచ్చింది
వెలుగులుగ విరిజాజి పరిమళాల్ కూర్చింది
రండిరా సంక్రాంతి వేడుకలు దండిగా...
రండిరా చూదాము పండుగుల సరదాలు...

తూర్పులో రవికాంతి తొంచితొంచకముందె
మేల్కాంచి కోడిపుంజులు గొంతు విదళించి
ఇంటి నడికొప్పులకు నెగిరి మోరలనెత్తి
రెక్కలను రుప్పుకొని కొక్కొరోయని పిలిచె...
లెండిరా తలగడిగి పండుగుల ముస్తాబు
విస్తారముగ నేడు కైసేసికొండిరా...

గుమ్మళ్ళు పూశాయి కొమ్మరటికాసింది
నారింజపండ్ల గుత్తులు నేల కొరిగాయి...
జనపచేలో పసిడిపూట తలలూచాయి
మావి కొంజిగురాకు జొంపాల్ హసించాయి...
రండిరా సంక్రాంతి పుడమి తల గడిగింది...
రండిరా చూదాము పండుగుల సరదాలు...

ఆవపూవుల పసిడి, గొబ్బిపుమముల మిసిమి
సెనగపూవుల జాళువాతళ్కు మిలమిలలు
తెనుగు మందిర ప్రాంగణములలో గొబ్బిళ్ళు
తెనుగు మొగసాలలో ముత్యాల ముగ్గులు...
రండిరా సంక్రాంతి వేడుకలు దండిగా...

తెలుగు పొలముల కివే పైరుపచ్చల వేలు...
తెలుగు పసువుల కివే పసుపు కుంకుమ పూలు...
తెలుగు పుడమికి నిండె నోడిలో తలంబ్రాలు ..
తెలుగు పడతుల ఎడదలో మెరయు రాగాలు
రండిరా దండిగా సంక్రాంతి సరదాలు
ఇంటింట పూగించు డానంద డోలికలు !

తెండి కన్నియలార భోగి పిడకల దండ
ఇంటిముంగిట నేడు పెట్టండి గొబ్బిళ్ళు...
బుగతగారికి కలదు గొప్పదగు కమతమ్ము...
తెండిరా దుంగలను భోగిమంటకు నేడు...
రండిరా సంక్రాంతి వేడుకలు దండిగా...

గడప గడపకు పసుపు కుంకమలు పెట్టండి
బంతి పూవుల తోరణాల్ తెండి కట్టండి
ఇంతి చేమంతి విరిమాలలను కూర్చండి
పండు వలపుల మిటారుల కోర్కెలీనాడు ?
రండిరా చూదాము పండుగుల సరదాలు !

రస హృదయమున నుషోమజ్జనమ్ముల సేసి,
కదళీ ఫలాల పొంగలి విందులను గుడిచి,
పసికందులకు దీవెనల భోగిపళ్ళోసి
చదలేటి కెరటాల కదలికల మదికూర్చి...
రండిరా సంక్రాంతి పండుగుల వేడుకలు !

దండిగా పిండివంటల మెక్కి కైపెక్కి
ప్రతిచోట బాలవీరుల మొండికెత్తాలి...
కదన కౌతూహలాయత్త చిత్తుల వోలె
బిరిగీసి చెడుగుడుకు తొడగొట్టి నడవాలి...

లెండిరా యువజనులు సంక్రాంతి నేడెరా...
రండిరా చూదాము పండుగుల సరదాలు...

తెలుగునేలలు ప్రసవమైన బాలెంతలై
వింతవింతల రంగుకలలు కంటున్నాయి...
వెలుగు సొంపులమీరు చూతతరుశాఖలు
తొలిచూలు బరువు చూలింతలై మెరసినవి...
రండిరా చూదాము సంక్రాంతి సుందరిని
తెండిరా బంతిపూదండ లీ తరుణమున...

సింహాద్రిరప్పన్న సిరిమువ్వ లూగించి
గాంద్రుగాంద్రని రంకె వేసింది పండుగని!
గోవుమాలక్ష్మి తన గంగడోలూపుతూ
అంబా యనుచు సంక్రమణగీతిపాడింది
రండిరా సంక్రాంతి వేడుకలు దండిగా!

పెయ్యలూ గిత్తలూ లగువుతీస్తున్నాయి —
శోకలెత్తుక నురికి కాల్దువ్వుతున్నాయి,
తల్లి కలవల శోక కొరుకుతూ తువ్వాయి
పాతపండుగ వేడుకలు చెప్పమంటోంది
రండిరాచూదాము సంక్రాంతి సరదాలు!
ఎలుగెత్తిపాడండి పండుగ పదాలూ!!

దాసర్లు తలల గుమ్మడిచెంబు లానించి
తాంబురామీటి శ్రుతికలిపి గొంతులనెత్తి
హాయిగా రామకత పాతపాటలుపాడి
పల్లెలోగిళ్ళ ముంగిళ్ళ కరుదెంచారు...
గ్రామసీమలు శోభశోభలై విరిశాయి
సామమైపొంగాయి ఈమధుర గానాలు!

కడుపులో చల్ల కదలని పెద్దకామందు —
మెదడు నరములు కదలి కంపించు కరణాలు —
గ్రామసావడిలోన సభతీర్చినా రంట —
మ్రోగుతున్నాయవే మంజులూ వీరణాల్...
రండిరా చూదాము సంక్రాంతి విక్రాంతి?
రండిరా కనులపండువ దేశమెల్లెడల!

పిల్లకాయల గూటు బిళ్ళాట సరదాలు
కన్నెపిల్లల కేలి గోరింట కొనగోళ్ళు...
మదవతుల ఎదలలో మరగిన మరందాలు
ముత్తయిదు సిగలోన మురియు మందారాలు...
రండిరా చూదాము వేడుకలు దండిగా...

రేయి ముగిసిం దిదిగో చిరువెన్నెలలు కురిసి
అప్పుడే కోడె గాళ్ళారు బైటకు చేరి
ఉప్పు పట్టెకు గొప్ప ఏర్పాటు చేశారు
మొనగాళ్ళు ఇద్దరూ ఉజ్జీలు వేశారు
రండిరా చూదాము వేడుకలు దండిగా

ఆట సాగిందిరా రణ గోలగా రేగి...
పెద్దలంతా మూతి మీసాలు మెలివేసి,
ఎలనాగ లిరుగోర జటపటా లేసుకొని
ముదముతో మురిపాలు మురిసిపోతున్నారు.
రండిరా చూదాము సంక్రాంతి సరదాలు.

'రాముడే గెల్చు'నని "కిట్టయ్య కొట్టు"నని
తమలోన తామేదో వాదాలు పడతారు;
ముసి ముసి పసందు చిరునవ్వు మువ్వలు మ్రోసి
ఎకసక్కెములతో కిసుక్కుమని నవ్వెదరు
రండిరా చూదాము సంక్రాంతి సరదాలు!

గొబ్బిపూవుల మెత్తనైన పొత్తిళ్ళలో
దూరి గీ పెడుతోంది చూడు తుమ్మెదజంట;
కొత్త చీరల గుబాళింపులో హత్తుకొని
తత్తరించిన దదే జవ్వనపు పంట...
రండిరా చూదాము వేడుకలు దండిగా.

ఇది దిశలనిండిన విహాయస సుహాసమో...
మోదములు కురిసిన విపంచికా స్వనమో
ఇవి నేల పొరలు వెలుగుల వెల్లువలునో...
ఎద పాలనము సేయు వలపుకలలవునో
రండిరా మనకివే తొలిపంట సరదాలు -
ఎలుగెత్తి పాడండి పండుగ వినోదాలు...

గ్రామ జీవనశోభ మధురసాలూరింది
చెరుకుపానక మందరము నొవ్వ త్రాగాలి
రండిరా చూదాము సంక్రాంతి వేడుకలు -
పెద్దపండుగ సద్దులివిగో వినండిరా!



# మహాసభకు సందేశం

హైదరాబాదు,
25–7–55.

ఆర్యా, నమస్కారాలు.

తాము దయతో పంపిన ఆహ్వానము అందినది. ఇక్కడి పనుల ఒత్తిడివల్ల మహాసభలో పాల్గొనజాలనందుకు మిక్కిలి చింతిల్లు చున్నాను. గడచిన ఒకటిన్నర దశాబ్దమున తెలుగుసీమలో సారస్వతాభి వృద్ధికై అభ్యుదయ రచయితల సంఘము చక్కని కృషిగావించినది. అభ్యుదయ రచయితల సంఘము అభ్యుదయ, తెలుగుతల్లి అను రెండు ఉన్నతస్థాయికి చెందిన సారస్వత మాసపత్రికలను కొంతకాలము ప్రక టించుటయేకాక, సుప్రసిద్ధ రచయితల గ్రంథాలను గూడ ప్రకటించి ప్రోత్సహించి ఆంధ్ర భాషాభివృద్ధికి అమూల్యమైన సహకారము గావించినది. కందుకూరి, గిడుగు, గురజాడ, కొమర్రాజుల వంటి యుగ పురుషుల వర్ధంతుల తెలుగుసీమ యందంతటను జరిపి, ప్రజలలో సార స్వతాభిరుచిని వ్యాపింపజేసిన దీ రచయితల సంఘము.

మహాకవి శ్రీరంగం శ్రీనివాసరావుగారి అధ్వర్యమున నేడు అభ్యుదయ రచయితల ఐదవ మహాసభ సమావేశము జరుగుట బంగా రమునకు పరిమళ మబ్బినట్లైనది. శ్రీ శ్రీ తెలుగుసీమలోని అభ్యుదయ రచయితలకు మార్గదర్శకులైన మహాకవులు. అనేక రచయితలకు భావనా గురువు. కావున శ్రీరంగం శ్రీనివాసరావుగారి అధ్యక్షతన జరుగు యీ సభలు సకలాంధ్రమునందలి అభ్యుదయ రచయితలకు నూతనోత్తేజము కలిగించగలవని ఆశించుచున్నాను.

మహాకవి శ్రీరంగం శ్రీనివాసరావుగారికి నా నమస్కారాలు అందజేయండి.

సభా కార్యక్రమములు దిగ్విజయముగా జరుగగలవని ఆశించు చున్నాను.

భవదీయ,

దేవులపల్లి రామానుజరావు.

# ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసం

(8 వ పేజీ తరువాయి)

ఈ రెండూ కవితకు చీడపురుగులే. బీడును దున్ని, ఎరువువేసి, నీరుపెట్టి, నాశిరకం విత్తులను నాటితే పడ్డకష్టం అంతా వృధా అయినట్టు విజ్ఞాన వికాసానికి కవిత్వం తోడ్పడని నాడు ఛందోబద్ధ సాంప్రదాయాల యొక్క బానిసత్వం నుంచీ, వ్యాకరణ బంధంలో నుంచీ, విముక్తి పొందడానికి పడిన ప్రయాస, పూర్తివ్యర్థమే. బూడిదెలో పోసిన పన్నీరే అవుతుంది.

అజ్ఞాన అగాధం నుండి విజ్ఞాన శిఖరాగ్రాలని చేరుకోడానికి మానవుడు సలిపే నిరంతర ప్రయత్నాన్ని, ఔన్నత్యాన్ని స్తుతించేందుకు బదులు నేటికవిత్వం ప్రేమజ్వరపీడితుల విలాప ప్రలాపాలతోనూ - విప్లవ జ్వరపీడితుల నినాదాలతోనూ నిండి ఉన్నత లావణ్యాన్ని, గంభీరత్వాన్ని కోల్పోయి ఆదర్శవంతం కాకుండా వెలవెలబోతూంది. నేడు వెలువడుతూన్న అసంఖ్యాకములైన గేయాలనీ, గీతికలనీ ఓపికతో పరిశీలిస్తే, వాటిలో నోరు తిరగని సంస్కృతసమాసాలు, కవికి తప్ప ఇతరులకి అర్థంకాని భావాలూ, అపరిచితములైన సాంకేతికాలూ తప్పితే - స్పష్టంగానూ, హృదయరంజకంగానూ వుండి, ఆనందాన్ని, ఆవేశాన్ని, ఉత్తేజాన్ని కలిగించే ఉత్తమ కవిత్వం వాటిలో కనిపించదు. ఈ లక్షణాలు అతి వాస్తవిక కవుల్లోనూ, భావకవుల్లోనూ, కనిపిస్తే మనం ఆశ్చర్యపడవలసిన అవసరంలేదు. కాని, విప్లవ కవులనీ, అభ్యుదయ కవులనీ, ప్రజా కవిత్వ సృష్టికర్తలనీ అనిపించుకొన్నవారు సహితం యీ వ్యసనాలకి లోనవడం మిక్కిలి విచారకరం.

మనం యిచ్చే ఉపమానాలు నిత్యజీవితంనుంచి తీసుకొనబడినవై, మనం ఉపయోగించే సాంకేతికములు అందరి అనుభవాల్లోనూ వుండి చిరపరిచితములైనప్పుడే, కవి ఉద్దేశాలు భావనాకూర్పు అలంకారాల అల్లిక పాఠకులకి గ్రాహ్యం అవుతుంది. భావాన్ని సూటిగానూ, శక్తివంతంగానూ, చదువరికి ఎరుకపరచాలంటే భావోద్రిక్తతకు అనువైన నడక కలిగి, అందలి వివిధ స్థాయిలను సహజంగా స్ఫురింప జేయ్యాలి కవితా శైలి.

స్వేచ్ఛాకవిత్వం అంటే ఎటువంటికట్టుబాట్లూ లేక విచ్చలవిడిగా కవిత్వం చెప్పడము కాదు. ఛంద సూత్రాలని విసర్జించడానికి కారణ మేమంటే - విస్తృతం అయి, అభివృద్ధి పొంది పరిణామం చెందిన నేటి భాష, ఆ కాలపు వ్యాకరణసూత్రాల పరిమితిని బద్దలు చేయడానికే. ఆనాటి కవిత్వంయొక్క లక్ష్యం కేవలం ఐశ్వర్యవంతుల ఆశయాలనుభవాలని, చిత్రించి వారిని సంతోషపరచి వారి ప్రాపకాన్ని సంపాదించడమే. కాని నేటి కవిత్వాన్ని సమాజ పునర్నిర్మాణానికి అనువగు పరికరంగా రూపొందించే బాధ్యత కవిమీద వుంది. అందుకు కవిత్వం ఉపయోగపడాలంటే మునుపటిలా కాకుండా, వాడుక భాషలోనే వుండాలి. వాడుక భాషకి ఇంకా ఒక విశిష్టమైన వ్యాకరణం ఏర్పడ

లేదు. కాని వ్యాకరణం సిద్ధాంతీకరింపబడి నంతవరకు మనము చేతులుముడుచుకొని కూర్చోలేంకదా! భాషా పరిణామానికీ, సంఘ పరిణామానికీ కారణభూతాలైన ప్రకృతిసిద్ధాంతాలను మనము నేడు అవగాహన చేసుకొని, వాటి కనుగుణ్యంగా కవిత్వం చెపుతూ భాషని ఉపయోగిస్తే, ఈవాళ మనం నెలకొల్పే సాంప్రదాయాలే రేపు వ్యాకరణం అవుతుంది. కవిత్వ విషయాలు, మానవాలోచనలు, ఉద్రేకాలు, ప్రక్రియలు, కొన్ని శాస్త్రీయ సిద్ధాంతాల ననుసరించి ఉన్నాయని గుర్తించి, వాటికి బద్ధమైన కవిత్వం చెప్పబడితే, అది సౌష్టవాన్ని, శైలిని పొందడమే కాకుండా కవిత్వంయొక్క ఉద్దేశం కూడా నెరవేరుతుంది.

గ్రాంథికమా, గ్రామ్యమా అనే వివాదం ఇంకా నేటికీ కొంతమంది సలుపుతున్నా ఆ వివాదం కొంతమందికి సలుపు కలిగిస్తూన్నా - ఏటంబాంబు మొదలుకుని గోవా సమస్య, చెడుగుడి పోటీ, వారఫలితాలవరకూ అన్ని సమస్యలూ వ్యావహారికభాషలోనే మన తెలుగు దినపత్రికలు ముక్కోటి ఆంధ్ర జాతికి అందజేస్తూ ఆంధ్రప్రజలో విజ్ఞానాన్ని, సంస్కృతినీ వెదజల్లుతున్నాయి ఇంత మహోత్కృష్టమైనకార్యాన్ని ఎన్నో కష్ట నిష్ఠూరాలకోర్చి జయప్రదంగా నెరవేరుస్తూన్నందుకు ఆంధ్ర పాత్రికేయులకి మన మెంతో ఋణపడివున్నాం! వారికి పాండిత్య ప్రకర్ష లేదనీ, చిన్నయ సూరి వ్యాకరణం, సూర్యారాయ నిఘంటువు కంఠపాఠం రాదనీ మనం లోపాలు ఎంచినా, ఆంధ్రప్రజ మాత్రం వారికి నిత్యం తమ జోహార్లను అర్పిస్తూనేవుంది. సామాన్య వ్యావహారిక భాషలోనే ఇంత విజ్ఞానాన్ని సంస్కృతినీ, సారస్వతం ప్రజకి అందజేయబడుతూండడం వ్యావహారిక భాషయొక్క సరళత, నాజూకుతనం, విస్పష్టత పాటవం ధారావాహినే కారణం. ఇతర దేశభాషల్లో వెలువడుతున్న, దినపత్రికలు అన్నీ కూడా గ్రాంథిక భాషనే వాడుతున్నా, మన తెలుగు పత్రికలొక్కటే ప్రజాభాషనే వాడుతూండడం మన వ్యావహారిక ఆంధ్రభాషయొక్క విశిష్టతను చాటుతూంది.

అభ్యుదయ రచయిత నవలని కాని, కావ్యాలని కాని వ్రాసేటప్పుడు ఒక ముఖ్యమైనవిషయాన్ని గమనించాల్సి వుంటుంది. అదేమిటంటే: సంఘర్షణ, సమరం, వీటిని చిత్రించడమే ప్రధానంకాదు. వీటిని చిత్రించినంత మాత్రాన ప్రగతిశీలమైన సాహిత్యాన్ని సృష్టిస్తున్నాం అనుకోవడం పొరబాటు. ఒక వ్యక్తిలోకాని, కుటుంబంలోకాని, సమాజంలోకాని, దేశంలోకాని, అంతర్జాతీయ క్షేత్రంలోకాని - సంఘర్షణ జరిగిందంటే - ఆ సంఘర్షణ ఫలితంగా అభ్యుదయ నిరోధకశక్తులు పరాజయం పొంది, పురోగామి శక్తులు విజయంసాధించి, ప్రగతిపథం సుగమం కావాలి. అలా చిత్రించడమే నిజమైన వాస్తవిక కళ, సృజనాత్మక కృషి, అభ్యుదయ రచన సంఘర్షణలను సృష్టించినపుడు జయాపజయాలనీ, సాహసకృత్యాల్నీ చిత్రించడం సహజం. సంఘర్షణను ఏ స్థాయిలో చూపించినా సరే - ప్రతీ జయానికీ మాత్రం తగిన పరమావధి ఉండాలి. ప్రతీ వీరోచిత కార్యానికీ, ప్రతీ సాహసకృత్యానికీ సమ

ర్థింపదగినంత లక్ష్యం ఉండాలి. ప్రతీ త్యాగంలోను హర్షింపదగినంత ధ్యేయం, పరమార్థం వుండాలి. ప్రతీ ఆత్మబలిదానంలోనూ ప్రవర్థమానమైన ప్రజాభీష్టం ప్రస్ఫుటమై ఉండాలి. ప్రతీ ఓటమీ విజయోన్ముఖంగా దారితీయాలి. ప్రతీ అపజయం విజయసాధనానికి ద్విగుణీకృత ప్రోత్సాహం కలుగజేయాలి. ప్రతీ పరాజయం అంతిమ విజయానికి నాందీప్రస్తావనగా పరిణమించాలి. అలా రచించిననాడే మన ఆంధ్ర అభ్యుదయ సాహిత్యం పరకాష్ఠతని చెందుతుంది.

నవల అయినా సరే, కవిత అయినా వ్యాసం అయినాసరే, గేయం అయినాసరే అభ్యుదయ రచనకి ఆధునికయుగం, దేశాభిమానం, ప్రజాకోటి-ప్రధానాంగాలు. అందులోనూ ప్రధానపాత్ర సామాన్య ప్రజదే. నేటి సమాజంలో సకల సౌభాగ్య సౌఖ్యాలనీ కష్టించి సృష్టించేవాళ్ళు సామాన్య ప్రజే. అందుచేత రచనాసృష్టి అంతా వాళ్ళపైన కేంద్రీకరించడం న్యాయం, సమంజసం, అవసరం, వాస్తవమూన్నూ. వారి సామాన్య జీవితాల్లో, దైనందిన కృత్యాల్లో, వారి సృజనాత్మకమైన కృషిలో, వారి కష్టసుఖాల్లో, స్నేహప్రణయాల్లో, ఎంతో ధీరత్వాన్ని, వీరత్వాన్ని ప్రదర్శిస్తుంటారు. అట్టి వీరులనీ, సర్వతోముఖమైన వారి జీవితాలనీ చిత్రించడం మన అభ్యుదయ రచయితల ప్రధాన కర్తవ్యం.

అభ్యుదయ రచనలన్నీ ఒకే వక తరహాగా వుంటాయనీ, ఒక్క మూసలో పోసినట్టు ఒక్క నమూనామీద నడుస్తూంటాయనీ, విశిష్టతలేక, వ్యక్తిత్వరహితమై, పై నించి తెచ్చి నెత్తిమీద రుద్దిన సిద్ధాంతాలప్రకారం తు-చ- తప్పకుండా వుంటాయనీ, దేశీయంకాక విజాతీయం అనీ ఒక అపవాదు కద్దు. వ్యక్తి వైవిధ్యంలేకుండా, శైలి విశిష్టతలేకుండా, కవితాధారని, కల్పనాశక్తిని, సృజనాత్మక కళని నేలమట్టానికి తుడిచిపెట్టేస్తూందని ఒక యీసడింపుకూడా వుంది. అంతేకాదు. భావకవిత్వంలో ఎలాగైతే 'ఎద', 'ప్రేయసీ', 'వియోగం', 'ఏకాంతం', 'కన్నీటి దొంతరలు' పట్టలమీద పట్టీలుకొట్టి ఎలా దొర్లుతూండేవో, అలాగే అభ్యుదయకవిత్వంలో కూడా, 'ఓయి, ఓరీ, ఓసీ', 'ఓ కార్మికుడా,' 'ఓ కర్షకుడా,' 'ఓ ఆంధ్రుడా' అనే సంబోధనప్రథమతోనూ, 'మొండెం' 'తుండెం', 'పేగులు', 'పుర్రెల కుప్పలు', 'రక్తపు ధారలు', 'కుమిలిన హృదయాలు' తోనూ కొల్లలుగా నిండి వుంటుందని వీరి నింద. దీని గురించి నే నిదివరకే విమర్శించాను. కాని ఇప్పుడు అభ్యుదయ కవులని వెనక వేసుకుని రావాలి. నేటికి పదిహేనేళ్ళ దినదినాభివృద్ధి పొందుతూన్న అభ్యుదయ సాహిత్యాన్ని పరిశీలిస్తే ఇవి వుత్త నీలాపనిందలే అని స్పష్టం అవుతుంది. అభ్యుదయ సాహిత్యం ప్రజాసాహిత్యం. ప్రజావాణి.

అందుచేతనే ప్రజాశయాలకీ, ప్రజావాంఛలకీ, ప్రజోద్దేశాలకీ సన్నిహితంగాను, చేదోడువాదోడుగాను వుండడం సహజం. కష్టజీవుల కోర్కెలతోనూ, ఆకలితో అలమటించువారి హాహారాలతోనూ, మురుగుపేదల కుళ్ళు దుర్గంధాలతోనూ, అందులో బతికే సామాన్యప్రజల సంసార సుఖదుఃఖాలతోనూ, ప్రేమానురాగాలతోనూ,వారి నవ్వులపువ్వులతోనూ,

ఆశాజ్యోతులతోనూ, పీడిత తాడితప్రజల కోపాగ్నితోనూ' విప్లవ జ్వాలలతోనూ, రణభేరీ రౌద్రనినాదంతోనూ, విజయానంద సంభ్రమ నినాదాలతోనూ ప్రతిధ్వనిస్తూంటుంది. అలా ప్రతిధ్వనిస్తుందని అభ్యుదయ రచయితలందరూ గర్విస్తారు. ప్రజావాహినికి తిరుగంటూ ఎలా లేదో, ప్రజోద్యమంలో నిస్పృహకి ఎట్లా తావు లేదో, అట్లాగే ప్రజాసాహిత్యమై ప్రజాసన్నిహితమైన అభ్యుదయ సారస్వతంలో కరడుకట్టిన ఛాందసత్వానికిగాని, భావనాలోలత్వంతో కూడిన మిథ్యాశూన్యవాదాలకి కాని, మనిషిని పిచ్చి పిప్పిచేసే నిరాశా నిరుత్సాహాలకికాని, నిండువ్యక్తిని జీవచ్ఛవంగా మార్చే నిస్పృహా నిస్సహాయతలకిగాని తావు లేనేలేదు. మానవాళి గమ్యస్థానం ప్రగతి - అనే మూలసూత్రమే అభ్యుదయ సాహిత్యానికి జీవగర్ర. ప్రజాళిపై అచంచలభక్తి, ప్రజాన్యాయం, ప్రజాధర్మందే అంతిమవిజయం అనే పరిపూర్ణ విశ్వాసం - ఇవే అభ్యుదయ సారస్వతీ పురోగమనానికి వెలుగుబాటలు.

ఇలాంటి ఆశయాలు కల్గి ఉత్సాహపూరితులు కాబట్టే అభ్యుదయ రచయితల కవితలలోనూ, రచనల్లోనూ, నవలల్లోనూ, వ్యాసాల్లోనూ, గేయాల్లోనూ, అనేక విశిష్టశైలులు, పోకడలు, వ్యక్తిత్వాలూ, రచనా స్వాతంత్ర్యం, కళావస్తు వైవిధ్యం రచనారీతులు, వచనపాంకాలు, పాత్రపోషణలు - కనిపిస్తున్నాయి. ఈ వైవిధ్య విభిన్న మార్గాలు ఎంతవరకూ విజృంభించాయంటే - అభ్యుదయ రచయితలందరూ తమ రచనల్లో ఒక్క సరిసమాన మట్టానికి దిగజారిపోతారు, దిగజారిపోతున్నారు, దిగజారక తప్పదూ - అని ఈసడించిన వారే - ఈవేళ "ఓ-నా-మః రాని ప్రతివాడూ అభ్యుదయకవినయ్యా!" అని వకమూల అభాండం వేస్తున్నారు. అయినా దీన్ని మనం అంతగా పాటించవక్కర లేదు కదా!

అభ్యుదయ సాహిత్యం ప్రజలమధ్యనే కాని వర్ధిల్ల నేరదు. ప్రజలకు ఏమాత్రం దూరం అయిపోయినా, ప్రజా సమస్యల నుంచి యేమాత్రం విడివడినా - నీట బాసిన కమలాల్లా కమిలిపోయి, కుళ్ళి, నిస్సారమై, నిర్జీవమై అధఃపతనానికి క్షీణించిపోయి, నాశనం అయిపోతుంది - అభ్యుదయ సాహిత్యం - దాంతోపాటు అభ్యుదరచయితలుకూడా!

భగవల్లీల అనండి, ఈశ్వర చిద్విలాసం అనండి, శివతాండవం అనండి, అణుశక్తి జీవమహిమా మహాత్యం అనండి అట్టహాసం అనండి, విప్లవశక్తుల చైతన్య బీభత్సం అనండి - ఏదైతే నేం; విశ్వరంగం మీద జరుగుతూన్న యీప్రతినాటకంలో మానవుడు ఏపాత్ర వహిస్తున్నాడు? ఉత్త ప్రేక్షకుడిగానా? కాదు కాదు. ప్రయోగశాలలో పరిశోధకుడిగానా? అదీకాదు. అసలు నాటకంలో ప్రధానపాత్ర వహించే నాయకుడు; రంగాన్ని దేదీప్యమానంగా ప్రకాశింపజేసే తార, అంతేకాదు దర్శకుడు, సూత్రధారుడుకూడా అతనే! ప్రకృతి - పురుషుడు అన్న ద్వైధ్యానికి, అద్వైతానికి తావులేదు. పురుషుడు అంతర్విశ్వం అయితే-ప్రకృతి బాహ్యవిశ్వం. రెంటికీ మూలకారణం పదార్థం. పదార్థమే ప్రత్యక్షసత్యం. అభ్యుదయ సాహిత్యం దృష్ట్యా మనం యిప్పుడు చేసిన యీ నిర్వచనం, సుప్రసిద్ధ అభినవ భౌతిక శాస్త్రజ్ఞులు మాక్స్‌ప్లాంకు, ఐన్‌స్టైనుల

క్వాంటం మెకానిక్స్, రెలిటివిటీ, న్యూక్లియర్ ఫిజిక్సుల సిద్ధాంతాలతో పూర్తిగా మేళవిస్తూంది. శివుడు పార్వతి, పురుషుడు ప్రకృతి-కర్త,కర్మ-దవ్యం, శక్తి-అనే ద్వైతంలేదు. సర్వం పదార్థమే. చలన రూపములోవుండే పదార్థమే శక్తి. విశ్వంలో జరుగుతున్న ప్రకృతివిశేషాలన్నీ, బ్రహ్మాండంలో ప్రాప్తించే సంఘటనలన్నీ, జగన్నాటకంలో సంభవించే ఘట్టాలన్నీ-చైతన్యయుతమైన పదార్థంయొక్క రూపాంతరాలే, సాక్షాత్కారాలే, వివిధ స్వరూపాలే, భిన్నాభిన్నములైన చేష్టలే, చమత్కారలీలలే, నృత్యం చేస్తున్న పదార్థంయొక్క అనంతకోటి అవతారలే. అందుచేతనే పదార్థమే ప్రప్రధానమైనదీ, ఆద్యాంతాలు లేనిదీ. అన్నిటికీ మాతృక. మనస్సు, బుద్ధి, ఊహ, వికారము, జ్ఞానము-పదార్థంయొక్క ప్రతిబింబాలే ఇవన్నీ పదార్థజన్యాలే. ద్వితీయములే. పదార్థసాక్షాత్కారంయొక్క పరావర్తనమే.

ఆ కారణంచేత కర్త, కర్మ రహితమైన యీ జగన్నాటకంలో - "నాకు దేంతోనూ సంబంధం లేదు - ప్రపంచంతో నిత్యజీవితంతో, తోటిసోదరులతో, అంటే ముట్టకుండా, తామరాకుమీద నీటిబొట్టులాగు వుంటాను" అని రచయిత అంటే - అందులో యేమీ అర్థం లేదన్నమాటే. నిజమైన కళారాధకుడు, ప్రగతిశీలుడైన కవి, అభ్యుదయకాముకుడైన రచయిత తన సృజనాత్మకకృషిలో వాస్తవాన్ని తాను సందర్శించి, పాఠకులకి సాక్షాత్కరింపజేయడమే కాకుండా, మానవజీవితంయొక్క, మానవసమాజంయొక్క పరిణామక్రమాన్ని, గమ్యస్థానాన్ని తాను గ్రహిస్తాడు. తన పాఠకులచేత గ్రహింపజేస్తాడు. ఈ శక్తి, ఈ ఉత్సాహం, ఈ ఆవేశం అతని కెలా కలుగుతుంది? తోడి కష్టజీవులతో తానూ వకడై, వారి సుఖ దుఃఖాలను పంచుకుంటూ, వారి ఆశయాలతో తానూ సంతోషపడుతూ, వారి పోరాటాల్లో ముందంజవేస్తూ, వారి సంఘర్షణల్లో సైనికుడిగాను, నమ్మిన బంటుగాను వుండి, వారితో భుజం భుజం కలిపి ఫలసిద్ధికోసం పాటుపడినప్పుడే, రచయిత ప్రజారంజకునిగా, ప్రజా సేవకునిగా, ప్రజా సైనికునిగా తన పౌరధర్మాన్నీ, తన కళాధర్మాన్నికూడా నిర్వర్తించ గలుగుతాడు. ప్రజలకష్టాల్లో, త్యాగాల్లో, నికృష్ట జీవితంలో, కొత్త సౌందర్యాన్ని కొత్త సత్యాన్ని తన కళాకౌశలంవల్ల నిరూపించ గలుగుతాడు.

అందువల్లనే అభ్యుదయరచయితకి 'కళ కళకోసమే' అన్న సిద్ధాంతం వుత్త బూటకంగా కనిపిస్తుంది. మన భారత సంప్రదాయానికి యిది విరుద్ధంకూడాను. మన భారత సారస్వతచరిత్రలో ఏ కవికాని, ఏ రచయితకాని, ఏ సాహిత్యపరుడుకాని, ఏ కళాకారుడుకాని, ఏ హిమాలయాపర్వతాల మీదకో వెళ్ళిపోయి కవిత్వం చెప్పినట్టు కాని, యే దండకారణ్యంలోనో చిత్రలేఖనం చేసినట్టుకాని, సప్తసముద్రాలు దాటి ఒంటిస్థంభం దంతపుమేడలో కూచుని కంద పద్యం చెప్పినట్టుకాని ఎక్కడాకానబడదు. కళారాధన వక సాధనక్రింద పరిగణించారు మన పూర్వీకులు - కాని 'కళ కళకోసమే'నని ఎక్కడచెప్పలేదు. త్యాగరాజు సంగీతకళ గురించి యేం చెప్పాడో చూడండి: "సంగీత శాస్త్ర జ్ఞానము సారూప్య సౌఖ్యప్రదమే మనసా... శృంగారరసాయాఖిలసారము......నియమ

నిష్ట యశధనము కల్గు నే... నేర్పుగల్గు త్యాగరాజు నేర్పిన సంగీతశాస్త్రజ్ఞానము" అని గానం చేశాడు. "కళ కళకోసమే" అని నమ్మిన కొంతమంది సాహితీపరులు యీనాడు తమ కవిలికట్టలను చంకబెట్టుకుని ఏ టెక్స్టుబుక్కు కమిటీసభ్యుల చుట్టునో, యే పుస్తక వ్యాపారుల నాశ్రయించో, లేకపోతే సిగరెట్టు బీడీ ప్రచారచిత్రాలకి నిదానాలు వ్రాసో, అష్టకష్టాలు పడుతూండడం మనం చూస్తూనేవున్నాం. "కళ కళకోసం" అనే సిద్ధాంతంలో ఎంత సత్యం వుందో అనుభవరీత్యా వారికి బాగా గ్రాహ్యం అవుతుంది.

అభ్యుదయ సారస్వతం సాహిత్యంలో కొన్ని వృత్తాలనీ, అభ్యుదయ రచయితలని ఎదుర్కొంటున్న కొన్ని సమస్యలనీ సూక్ష్మంగా సూచాయాగా మీ ఎదుట వివరించాను. ఈ విషయాలు, యింకా ముఖ్యమైన యితర విషయాలు ముసాయిదా ప్రణాళికలో పేర్కొనబడివుంది. వీటిని మనం ముందుముందు సావధానంగా చర్చించవలసివుంటుంది. కాబట్టి నేనింక కాలయాపనం చేయడం సమంజసం కాదు. మన సారస్వతలోకంలో నేడు ఆవరించిన నిస్తబ్ధత పరిస్థితులను గమనించి, మన సాహిత్యాన్ని ప్రగతి తోవలో పెంపొందించడానికి అభ్యుదయ రచయితల సంఘాన్ని పునర్నిర్మించడం అత్యావశ్యకమని భావిస్తూ, దూరభారమని యెంచక, వ్యయప్రయాసలకు వెనుదీయక మా ఆహ్వానాన్ని అంగీకరించి యీసభకు దయచేసినందుకు మీ కందరికీ మరోసారి ఆహ్వాన సంఘం తరఫున హృదయపూర్వకముగా నా కృతజ్ఞతను తెలుపుచున్నాను.



# అంజలి

(అభ్యుదయ కవి మహాసభాధ్యక్ష ప్రశంస)

ఎవడీ
అభినవాంధ్ర జగతి
అభ్యుదయ యుగప్రగతి
కవితా ప్రస్థానములో
కలమె చలత్ ఖలీనముగ
ధాడె త్తిన
యువభావుక హృదయాశయ
జగన్నాథ రథసారథి !

ఎవడీ
భూతకాల వైతరణిన్
బాతువులగు జడబుద్ధుల
కులవృద్ధుల కురువృద్ధుల
కలమె గదా దండముగా
ధట్టించిన
క్రుద్ధవృకోదర ధీరుడు !

ఎవడీ
దంధన ధన మదాంధ ఘన
దౌర్జన్యపు టూహాలపై
కలమె ఖండపరశువుగా
దండె త్తిన
నవవిప్లవ రవభైరవ
మార్గాపర భార్గవుడు !

ఎవడీ
ధనికవ్రజ పరిపీడిత
ప్రజాహృదయ ప్రతినిధియై
కలమె విజయ కాహళిగా
ధ్వజమె త్తిన ధనంజయుడు !

అతడే
అభినవాంధ్ర మహాభ్యుదయ
శుభోదర్క సుకవి సభా
విభావసుడు మన శ్రీశ్రీ !

అతని కిదే
మహాభ్యుదయ సభాసమయ
సభ్యహృదయ సదా సదా -
శయ మరందమయ సరోజ
నిచయాంజలి ! నిత్యాంజలి !

—యస్వీ. జోగారావు.



# అభ్యుదయ కవిత్వము సమీక్షాత్మక సమీక్ష

## రమణా రెడ్డి

### ప్రవేశిక:

అభ్యుదయ సాహిత్యోద్యమము తల యెత్తక ముందునుండికూడ తెలుగునాట అభ్యుదయ సాహిత్యము పరంపరాగతమై వివర్థిల్లుతుండినది. అభ్యుదయ రచయితల సంఘ సభ్యులచే సృష్టింపబడిన దొక్కటే అభ్యుదయ సాహిత్యమని, తత్పూర్వులూ తద్భిన్నులూ సృష్టించినది అభ్యుదయ సాహిత్యము కాదనీ అనుకోరాదు.

నింగి నీలిమనుండి పిడుగువలె ఆకస్మికంగా ఏ సాహిత్యోద్యమముకూడ విరుచుకొని పడదు. ఆ విధంగా హఠాత్తుగ అవతరించిన ప్రతీది అంతే హఠాత్తుగ అంతరిస్తుంది. అభ్యుదయ సాహిత్యం తెలుగునాట వేళ్ళులేని వృక్షంకాదు. ఆంధ్ర సంస్కృతీ ప్రవాహమందు ఇదొక క్రొత్త పాయ; సాహిత్యవృక్షాన క్రొత్తశాఖ. పరదేశాలలోను, పరరాష్ట్రాలలోను యేర్పడిన ఉద్యమాలను ఆంధ్రదేశంలో కొందరు అంటుకట్టి పాదుకొల్పినారని, లేకుంటే యీ అభ్యుదయ రచయితలకు సాహిత్యంకంటె రాజకీయాలే ప్రముఖతరాలని కొందరు ఆరోపించివున్నారు. ఈ ఆరోపణలకు ఒకే ఒక్క సమాధానం వుంది.

అభ్యుదయ సాహిత్యానికి సీమాభేదాలు లేవు. అంతర్జాతీయత జాతీయతకు విరుద్ధమైనదికాదు. తర్వాత, ఉత్తమ పౌరుడు కావలెనంటే, బ్రతుకులో ప్రముఖస్థానమాక్రమిస్తున్న రాజకీయాలనుండి రచయిత విడిపోడు. రాజకీయాలూ, సాహిత్యమూ పరస్పర బాహ్యాలుకావు.

అభ్యుదయ సాహితీపరుల దృష్టి సమగ్రమైనది. మనసు వికచమైనది. స్వప్రయోజనపరులు దేశాలమధ్య, జీవిత ఖండాల మధ్య కల్పించిన అరమరలు అభ్యుదయ సాహిత్యం గుర్తించదు. కనుక అభ్యుదయ సాహిత్యాన్ని గురించిన సమీక్షలో ఓం ప్రథమంగా గుర్తించవలసిన విషయమేమిటంటే, అంతర్జాతీయంగా, జాతీయంగా, సాంస్కృతికంగా, రాజకీయంగా యిరవయ్యో శతాబ్ది మధ్య భాగంలో మానవ జీవితంలో ఏర్పడిన చరిత్రాత్మక పరిణామాల కనుగుణంగా వేరువేరు దేశాలలో, రాష్ట్రాలలో దాదాపు ఒకే శుభసమయాన అభ్యుదయ సాహిత్యమొక సంఘటితోద్యమంగా జన్మించింది. తెలుగు సీమలో గత శతాబ్దపు చివరి కాలంలో గిడుగు – గురజాడ – వీరేశలింగాలు ప్రారంభించిన భాషా, సంఘ,

శైలీ సంస్కరణోద్యమాలు, ప్రస్తుత శతాబ్ది రెండవపాదంలో మొదలై విజృంభించిన జాతీయ, సమతావాదోద్యమాలు, వీటన్నిటి ప్రభావ ఫలితంగా అభ్యుదయ సాహిత్యోద్యమం 1940 ప్రాంతాల జన్మించింది. సాహిత్యాన్ని సంపన్నం చేసిన యీ వుద్యమం సిద్ధింప చేసిన విజయాలలో మొట్టమొదట ఎన్నతగినది, సాహిత్యాన్ని మానవ జీవిత వ్యాఖ్యాతగా చేయడం. అంతకుముందే వ్యావహారిక భాషావాదం చాలామంది అంగీకారాన్ని పొందినప్పటికీ, క్రొత్తసీసాలలో పోసిన పాత ద్రాక్షాసవం వలె, క్రొత్తశైలితో పాతవస్తువే వాడుక అవుతూవచ్చింది. కాని అభ్యుదయ సాహిత్యావతరణతో, కావ్య వస్తువులో విప్లవం వచ్చింది. సామాన్య మానవుడు మాన్యుడయ్యాడు. పోరాటాలు ప్రతిబింబితాలైనవి. నిత్యజీవితముతో సాహిత్యానికి సమీపబాంధవ్యం ఏర్పడింది. సాహిత్యంపట్ల సంఘంలో ఆత్మీయతా భావం ఏర్పడింది. ఊరూర, యింటింట రచయితలు ప్రభవించారు. సాహిత్యం ప్రజా వ్యవహారాల్లో ఒకటైంది; ప్రజల చేతిలో ఆయుధమైంది; ప్రజలకు వుత్సాహాన్ని యిచ్చింది; తెలియ చెప్పింది; మేల్కొల్పింది; నడిపించింది; పోరాడించింది.

## 2

## శ్రీ శ్రీ అవతరణ :

ఆంధ్రాభ్యుదయ సాహిత్యానికి శ్రీశ్రీ మూలవిరాట్టు; ఏకలవ్యుని అంగుష్ఠంవంటివాడు. కాని చాలమంది భ్రమపడినట్టుగా, అతడే ఆదీ, తుదీ కాదు. కాల్పనికోద్యమ కవిత్వంమీద విరక్తి, వెగటూ, ఏతూరీగా బద్ధలై శ్రీ శ్రీ అభ్యుదయ సాహిత్యోద్యమ వైతాళికుడయ్యాడు. 1930 ల నుండి దాదాపు నలభైలవరకు తానొక్కడే యీ మహాభారాన్ని వహించాడు. కాబట్టి అభ్యుదయ సాహిత్యోద్యమాన్ని అంతటిని శ్రీ శ్రీ ఒక్కనితో ఏకీకరింపచేయడం జరుగుతున్నది. శ్రీ శ్రీ ని విరాణ్మూర్తిగ, అధిమానవ ప్రమాణాలతో అతిశయోక్తి అలంకారమంతటివానిగ చిత్రించడం జరుగుతున్నది. శ్రీ శ్రీ తర్వాత అభ్యుదయ సాహిత్యంగతి చెడిపోయిందని అనడం జరుగుతున్నది. ఆవ్యక్తి చేసిన తప్పొప్పులను ఉద్యమాని కంతటికీగా చెందినట్లుగా వర్ణించడం జరుగుచున్నది. అందుచేత కళ్ళు విప్పి, దుర్నిరీక్ష్యుడని పేరందిన శ్రీ శ్రీని పరీక్షించి ఆంధ్రసాహిత్యంలో అతనికిగల స్థానాన్ని వురామరికగానైనా నిర్ణయించడం చాల అవసరం.

1920 నాటికి భారత జీవితంలో భూస్వామి పలుకుబడితగ్గి, పెట్టుబడిదారుల ప్రాభవం ప్రారంభమయింది. 1915 తర్వాత గాంధిగారి అవతరణతో జాతీయోద్యమం క్రొత్తదారులు పట్టింది. ఆ సమయానికే గురజాడ-గిడుగు-కందుకూర్ల సంస్కరణాభిప్రాయాలకు పునరుజ్జీవనం కలిగి, మహా మహోపధ్యాయుల, కళాప్రపూర్ణుల శిలావర్ణాలు తెరిపినిచ్చాయి. భూస్వామ్య విధానానికి పెట్టుబడిదారీ విధానానికి జరిగిన పోరాటం స్థూలంగా కాంగ్రెస్ - జస్టిస్‌పార్టీ గొడవలనవచ్చు. కాని జాతీయోద్యమాన్ని దాని సంపూర్ణ కర్తవ్యం నిర్వహించకుండా అడ్డుతగులుతూ పెట్టుబడిదారులు ఏ ఘడియలో దానిపై ప్రాభవం సంపాదింప ఘనుకొన్నారో,

ఆ ఘడియలోనే పెట్టుబడిదారీ వ్యవస్థను శవవాహకులైన కష్టజీవులు ఒక సంఘటిత శక్తిగా రూపొందసాగినారు. ఈ "ప్రభంజనం" ఈ "వర్షకాభ్రా"న్ని చూచి, పెట్టుబడివారులు జాతీయోద్యమాలను కైవసం చేసుకొని, ప్రజావిజృంభణ సంఘటిల్లినపుడల్లా వాటిని ఆపుచేయడం జరుగుతూ వచ్చింది. కాని "త్రాచులవలెనూ, రేచులవలెనూ, ధనంజయునిలా" త్రోసుకు ముందుకు, "కదం త్రొక్కుతూ పదం పాడుతూ" పోతున్న "నెత్తురుమండే శక్తులునిండే" యువకశ్రమికశక్తికి ఆనకట్టలు వేయలేకపోయారు. "ప్రభవ" పద్యాలువ్రాసి వాటిమీద, వాటి ప్రయోజనంమీద తృప్తిలేక, కొంతకాలంపాటు, దాదాపు 1927 నుండి 1934 వరకు, శ్రీశ్రీ సందిగ్ధంవంటి విరామం తీసుకొన్నాడు. ఈవిరామకాలంలో అతని మానస క్షేత్రానమహాప్రస్థాన గీతాల ధోరణి విత్తినట్లయింది. శ్రీ శ్రీ "ప్రభవ" ప్రకటించి అసంతృప్తితో క్రొత్తకాంతులు నింపుకొంటూ క్రొత్తసత్తువ నూరుకొంటూ వుండిన రోజులలోనే, అంతర్జాతీయంగానూ, దేశీయంగానూ శ్రామికశక్తి ప్రధానాంగంగా రూపుదిద్దుకోవడం జరిగింది. 1929 లో సోవియట్ సమాఖ్యతప్ప తక్కిన యావద్దేశాలమీద ఘోరాశనిపాతం వలె పడిన ఆర్థిక మాంద్యం తన కళ్ళువిప్పిందని, ఆయనే వ్రాశాడు. "పెట్టుబడిదారీ దేశాలన్నీ ఆర్థిక మాంద్యంలోబడి కొట్టుకులాడుతున్నాయి. ఒక్క సోవియటు యూనియను మాత్రమే, ఈ దురవస్థలు లేకుండా ఉంది. ప్రణాళికాబద్ధమైన సోషలిస్టు ఆర్థిక విధానంతో ఆదేశంలోని ప్రజలందరి జీవన పరిణామం నానాటికి అభివృద్ధి చెందుతోంది...దారిద్ర్యము, దురవస్థ, ఇవే 1930-40 మధ్యకాలంలో మన దేశాన్ని, ముఖ్యంగా ఆంధ్రదేశాన్నిగూర్చి చెప్పవలసిన మాటలు...ఈ పరిస్థితులలో తెలుగు రచయితలు తమచుట్టూ ఆవరించియున్న దారిద్ర్యాంధకారాన్నుంచి బైటపడి, రష్యాలోవున్నలాంటి మంచి పరిస్థితులు కావాలని ఆశించడంసహజంకాదా?"

ఈ విధంగా శ్రీశ్రీ అభ్యుదయ కవిత్వమూ, శ్రామికోద్యమమూ సహజన్ములు, సహచరులు. మహాప్రస్థాన గీతాల వాతావరణం విశ్వవ్యాప్తమైనది. చారిత్రిక పరిణామాలు శ్రీ శ్రీ కవిత్వాన్ని, శ్రామికోద్యమాలనూ సృష్టించాయి. అంటే వ్యక్తిగా శ్రీ శ్రీ నిష్ప్రతిభుడని అర్థం కాదు. నాగరికతాక్రమమందు ఒక క్రొత్తఅడుగు పడినప్పుడు దానికి అనుగుణంగా తాళంవేసేందుకు అనేకులనేకులు కవులు ముందుకు రావచ్చునేమో కాని ఐరావతగజంలాగ ఒక్కడో యిద్దరో మౌలికంగా నిలువగలరు. ఎందుచేతనంటే, యితరులు అస్పష్టంగా అర్థోక్తిగా అవకతవకగా వుండివుండి చెప్పగలిగిన దానిని యీ మహామహుడైన కవి విడమర్చి చెప్పగలడు. యుగఘోష అతని జిహ్వారంగనర్తకి కాగా, యీ అసాధారణనిపుణుని చుట్టూ అనేకులు గుమికూడి అనుసరించక తప్పదు. 1930 లలో జగత్ప్రళయంగా దుర్ఘటిల్లిన ఆర్థిక, సాంస్కృతిక కల్లోల జలరాశిలో, గట్టుకుచేరగలగడమే ఘనతకు పడికట్టు అయినప్పుడు, ఆ యపూర్వ సంధ్యాకాంతిలో సరైన త్రోవను శ్రీశ్రీ తెలిసికోగలిగినాడు. తన "గుహలో, కుటిలో, చీకటిలో ఒక్కడనై క్రుక్కిన రోజులు" పోయాయి. "శ్మశానాలవంటి

నిఘంటువులు", "వ్యాకరణాల సంకెళ్లు", "ఛందస్సుల సర్పపరిష్వంగం" వెనుక విడిచి, తన రచనలలో లోకం ప్రతిఫలించాలని, తన ఆకాశాలు లోకానికి చేరువ కావలెనని, తన ఆదర్శాలను సోదరులందరూ పంచుకోనవలెనని, తనగీతం జాతిజనులు పాడుకొనే మంత్రం కావలెనని కోరుకొన్నాడు. లోకపుటన్యాయాలు, ఆకలి, ఆవేదన, దారిద్ర్యం, దౌర్జన్యం - వీటిని "పరిష్కరించే బహిష్కరించే బాటలు తీస్తూ పాటలు వ్రాస్తూ," తనలో కదలే నవ్యకవిత్వం "కార్మికలోకపు కల్యాణానికి, శ్రామికలోకపు సౌభాగ్యానికి సమర్పణంగా, సమర్చనంగా, త్రిలోకాలలో, త్రికాలాలలో, శ్రమైక జీవనసౌందర్యానికి సమానమైనది లేనేలేదని," కష్టజీవులకు స్వస్తివాక్యములు సంధానిస్తూ, "వ్యధార్త జీవిత యథార్థదృశ్యం పునాదిగా" భావివేదములు సృష్టించి, జగత్తుకంతా చవులిస్తామని ఆశించాడు. తన నవీన గీతికి, నవీనరీతికి "సహస్రవృత్తుల సమస్త చిహ్నాలు...భావం, భాగ్యం, ప్రాణం ప్రణవం," అన్నాడు. ఈ విధంగా 1930 లలోనే, అభ్యుదయ రచనోద్యమం యేర్పడక మునుపే, సామాన్య మానవాభ్యుదయ శిఖరంవైపు ప్రయాణించసాగినాడు.

మహాప్రస్థాన గీతాలు తెలుగుభాషకు మందార కుసుమమాలలు. ముఖ్యంగా వాటినిబట్టే, వాటికివికే మహత్త్వమబ్బింది. శ్రీశ్రీ మహాశిల్పి. అతని వులి తాకిడికే తెలుగు కవిత అనర్ఘ విక్రమోద్ధత యవ్వన విలసితమయింది. ఉత్తర గోగ్రహణ కాలమందు బృహన్నల గాండీవిగా పరిణమించినట్లయింది. శబ్దాలమీద అసాధారణమైన ప్రభుత నెరప గలిగినందుచేత, పదాలు ఈ చండశాసనుడికి దాసదాసీజనాలైనవి. కృష్ణశాస్త్రిలోని జాలిగాలులవంటి పదాలు, విశ్వనాథలో పాషాణాలవంటి పదాలు, శ్రీశ్రీ లో అరబ్బీ తురంగాలయ్యాయి. ఖదంత్రొక్కే సైనికులయ్యాయి. కాని శ్రీశ్రీ ఎంతో పొదుపుగా, పిసినారివలె వాడినాడుమరి! "గర్జించే హ్రదంత రాళా"లు, "వజ్రకాభ్రముల ప్రళయఘోష"లు, శివసముద్రమూ, నయాగరా, "నరకలోకపు జాగిలాలు," "యముని మహిషపులోహ ఘంటలు," "ఆది సూకరుని ఘుర్ఘురధ్వని," "రాంబందుల. రెక్కల చప్పుడు, పొగగొట్టపు భూంకారధ్వని, అరణ్యమున హరీంద్రగర్జన, పయోధర ప్రచండఘోషం, ఖడ్గమృగోదగ్ర విరావం, ఝంఝానిలషడ్జ ధ్వానం"— "మౌన మృదంగాలు" "నక్షత్రాంతర్ని ఒడ నిఖిలగానం", "ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదం" "శిశువు చిత్రనిద్రలో ప్రాచీనస్మృతులూచే చప్పుడు," "రోగార్తుని రక్తనాళ సంస్పందన", "త్రాగుబోతు వ్యక్తావ్యక్తాలాపన, ప్రేలాపన," "ఘూకం కేకా" "భేకం బాకా", "ఆకటి చీకటి చిచ్చుల హాహాకారం, ఆర్తారావం," "ఒక లక్ష నక్షత్రాల మాటలు," "ఒకకోటి జలపాతాల పాటలు, శతకోటి సముద్ర తరంగాల మ్రోతలు" విన్నాడు. జడమూ చేతనమూ చేతకూడ పలికించగలిగాడు.

శ్రీ శ్రీలో యెన్నదగిన రెండవగుణం విశ్వజనీనత. "ప్రపంచపు బాధ అంతా శ్రీ శ్రీ బాధ," అని చలం సరిగా అన్నాడు. ఈ విషయంలో శ్రీ శ్రీ దేశీయ కవిత్వంలో గురజాడ ప్రారంభించిన సత్సంప్రదాయాన్ని కొనసాగించాడు. తెలుగు

దేశాన్ని శేషభారత దేశంనుండి కాని, భారతదేశాన్ని శేషజగత్తునుండి కాని విడదీసే హిమాలయాలను, మహాసాగరాలను శ్రీ శ్రీ గుర్తించలేదు. గురజాడ వ్రాసిన "దిందు లంగరు దీర్ఘయుద్ధం, ధర్మపక్షము మ్రుల్లుమూసెను, నరుల పీనుగ పెంటపోకల, నాటి వెలయును శాంతివృక్షము" అనే గీతిక వ్రాయబడిన ఐదేళ్ళలోనే కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారు, గురజాడలో లోపించిన నిశితదృష్టిని సమకూర్చుకొని, "సమరతృష్ణ" అనే మహాగీతికలో ప్రస్తుతయుద్ధాల యథార్థకారణాలను పట్టి వెలికీడ్చాడు. వలస విధానానికీ సామ్రాజ్యవాద యుద్ధాలకూగల సంబంధాన్ని కను గొన్నాడు: "వాణిజ్యదేవత ... పాద చిహ్నాల రాపాడివచ్చు సంగర పశుశక్తి చచ్చి చావకయ, యాత్మకృతాపరాధాంకమైనిలిచి, బహుళపశ్చాత్తప్త బాష్పపూరములఁ దన మనోవికృతుల దాహంబు తీర్చు"చున్న దన్నాడు. "సమరపరాజిత శత్రువర్గముల, కొల్లద్రవ్యము పంచుకొను వేడ్కఁజిద్ద, భాగంబులకుఁ బోరు "పరమ సౌహార్ద చక్రవర్తుల" "ఖండాంతరంబుల కపట నాటకము"ను ముసుగు చీల్చి ప్రదర్శించాడు. గురజాడ, దువ్వూరి, శ్రీశ్రీలు భావిదర్శనాన్ని చేశారు.

"మాదు మనుమను మేటివారల
మాటలనియెడి మంత్రమహిమను
జాతి బంధములన్న గొలుసులు
జారి, సంపద లబ్బుచున్.
"ఎల్లలోకము వొక్క యిల్లై,
వర్ణభేదము లెల్ల కల్లై
వేల నెరుగని ప్రేమబంధము
వేడుకలు కురియు.

"మతము లన్నియు మాసిపోవును,
జ్ఞాన మొక్కటి నిలిచి వెలుగును;
అంత స్వర్గసుఖంబు లన్నవి
యవని విలసిల్లున్", అని గురజాడ;
"సకలమానవజాతి సంతతులు కులుపు
వర్ణభేదంబులఁ బాటింపఁబోక
యొక్కకడుపునఁబుట్టి యొకచన్నుఁ
బాలు
ద్రావినరీతి సౌందర్యంబుగలిగి
యన్యోన్యసాహాయ్య మర్థించువారు..."
"దేహంబు నలుపైనఁ దెలుపు పసుపైన
నాత్మబంధువులుగా రె యఖిల జనంబు?
కామంబు క్రోధంబు గర్వంబు జాతి
దేశంబు భాషయన్ దెగలుచింపంగ
సర్వసామాన్యమై చను మానవత్వ
మొక్కటీకునఁగాకయున్నె వేర్వేఱ?"

అని దువ్వూరి దర్శించిన సర్వమానవ సౌభ్రాతృత్వము శ్రీ శ్రీలో పరాకాష్ఠనందుకొన్నది. తాను "భువనభవనపు బావుటా"యై పైకిలేస్తాడు; "విశ్వవృష్టికి అశ్రువొక్కటి ధార" పోస్తాడు, "భువన ఘోషకు వెర్రిగొంతుక విచ్చి" మ్రోస్తాడు

"చీనాలో రిక్షావాలా
చెక్ దేశపు గనిపనిమనిషీ
ఐర్లాండున ఓడకళాసీ
అణగారిన అస్తులందరూ—
హాటెన్‌టాట్, జూలూ, నీగ్రో,
ఖండాంతర నానాజాతులు
చారిత్రక యథార్థతత్త్వం
చాటిస్తారొక గొంతుకతో."
"ఆసియా, అమెరికా, యూరప్,
ఆఫ్రికా, ఆస్ట్రేలియాలలో,
సముద్ర ద్వీపాలలో
ధ్రువప్రాంతాలలో

పట్టణాలలో, పల్లెలలో
ధనివో, దరిద్రుడవో
వృద్ధుడవో, యువకుడవో,
తెల్లని, నల్లని, ఎర్రని, పచ్చని రంగో,
బలవంతుడివో, బలహీనుడివో,
బ్రతికేవాడా! పాడేవాడా!
మానవుడా! మానవుడా!
అవిభక్త కుటుంబీ!
ఏకరక్తబంధూ!
మానవుడా! మానవుడా!"
"మానవుడే నా సంగీతం
మానవుడే నా సందేశం."

గురజాడ, దువ్వూరి, శ్రీ శ్రీ లలో యావత్ప్రపంచాన్ని కౌగిలిలో యిముడ్చుకోగల భేదరహిత మానవప్రేమున్నప్పటికి, "ధర్మపక్షాన్ని" గురించి గురజాడ ప్రస్తావించినపుడు, "వాణిజ్యశక్తి"ని గురించి రామిరెడ్డి తెగడినప్పుడు, వారిలో యధార్ధదృష్టి కొరవడలేదని తెలుస్తుంది. ఈ యథార్థదృష్టికూడా శ్రీశ్రీలో పరాకాష్ఠ నందుకొంది. ఆయన "దారుణద్వేషాగ్ని పెంచే దానవత్వం" నశించి, "బానిసల సంకెళ్లు బిగిసే పాడుకాలం" లయించి, "సాధుసత్వపు సోదరత్వపు స్వాదుతత్త్వం"జయించవలెనని ఆశించాడు. కాని రెండవ ప్రపంచయుద్ధం యీ ఆశలను వమ్ముచేసింది. అభ్యుదయ మానవాళికి నాయకత్వం వహించిన సోవియట్ రష్యాలో మానవుల ఆశలను దర్శించాడు. ఎందుకంటే తన ఆశయాలు, రష్యా ఆశయాలు ఒకటే: సమానత, స్వతంత్రత అనేవి. ఇటీవల ఆంధ్రదేశంలో జరిగిన ఎన్నికలలో కట్టుకట్టిన "పెట్టుబడికూటాలు" చెలరేపిన కుట్రలూ, కూహకం ఫలితంగా శ్రీశ్రీని దేశవిరోధిగా, విదేశభక్తుడుగా చిత్రించడం జరిగింది. "పెట్టుబడికీ కట్టుకథకీ పుట్టిన" పత్రికలు రాజకీయాలలో రంకు వేషాలు వేశాయి. దేశీయ సారస్వతంలోని ఉత్తమప్రజాతంత్ర సంప్రదాయాలలో అగ్రగణ్యమైన అంతర్జాతీయదృష్టికి శ్రీ శ్రీ వారసుడయ్యాడు. యావజ్జగద్విశీయాలైన ప్రపంచయుద్ధాలు రెండు వుత్పత్తిల్లినా, మానవ సమస్యలను పట్టించుకోనక, శిథిలాలను బూజును కిరీటాలను ప్రేమిస్తూనో, ఊహాసుందరికి రూపు దిద్దుతూనో వ్రాసినవి వ్రాస్తూ, నెమరువేస్తూ ప్రసిద్ధులైన ఆంధ్రకవులు మూగవోయి వున్నప్పుడు, శ్రీశ్రీ అసహాయుడై ఒంటరిగా తెలుగునాటినుండి ప్రపంచమానవ సమస్యలలో అభిమన్యునివలె చొరబారినాడు. ఆయన పెట్టిన ఒరవడిని అభ్యుదయ రచయితలందరూ శిరోధార్యంగా ఎంచి, వర్తమాన మానవ సమస్యలమీద దృష్టి నిలిపారు. అభ్యుదయ సాహితీపరుల దృష్టిలో అంతర్జాతీయదృష్టి దేశాభిమానానికి వెలికాదు; అసలైన దేశాభిమానానికీ, జాతీయవాదానికీ నడుమగల తేడా తల్లిపట్ల ఓడరుగల ప్రేమకూ, స్వప్రయోజనచింతకూ కలట్టిది. జాతీయవాదానికి ఎన్నో శతాబ్దాలముందునుండి, మానవజాతిప్రాదుర్భావ కాలంనుండికూడ దేశాభిమానము వుంటున్నది. నడుమంతరాన దూరిన జాతీయవాదము కాలక్రమాన దేశాభిమానంగా చెలామణీ కాసాగింది. దేశభక్తికీ, అభిమానానికీ నడుమగల తేడా చాలగొప్పది. భక్తి గుడ్డినమ్మకాన్ని ప్రేరేపుతుంది; వర్తమానంటె గతాన్ని గోరింతలు కొండంతలు చేస్తుంది; మాలిన్యాన్నికూడ మాన్యంచేస్తుంది; కంపును యింపు చేస్తుంది. కాగా అభిమానమనేది వివేచనాయుతమైన,

ప్రగతిశీలమైన, ఆరోగ్యవంతమైన దృష్టిని అలవరింపచేస్తుంది. దేశభక్తికి అంతర్జాతీయత వెలి. దేశాభిమానానికి అది జత. అభ్యుదయ సాహితీపరులు దేశాభిమానులు అంతర్జాతీయ వాదులున్నూ. అంతర్జాతీయ వ్యవహారాలు పట్టని మన సుప్రసిద్ధ కవివర్యులకు వర్తమాన దేశీయ సమస్యలు కూడ అంతంతమాత్రమే. ఎంతసేపటికీ హంపీక్షేత్రాలు, ఆంధ్ర ప్రశస్తులు, ఆంధ్ర పౌరుషాలే కాని, వారికి వర్తమానంతో పని లేదు. "మంచి గతమున కొంచెమేనోయ్, మందగించక ముందు అడుగెయ్", అని గురజాడ వుద్బోధించినప్పుడూ, "గతము గతంబె, ఎన్నటికి కన్నులఁగట్టదు, వర్తమానమే సతత మవశ్య భోగ్యమగు సంపద", అని కవికోకిల ఒమార్ ఖయ్యాం నెపాన ప్రవచించినప్పుడూ, "ఏ దేశ చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం? నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం ... పరస్పరాహరణోద్యోగం... రణరక్త ప్రవాహసిక్తం, బీభత్సరసప్రధానం, పిశాచ గణసమవాకారం,...దరిద్రులను కాల్చుకుతినడం...గతమంతా తడిసె రక్తమున, కాకుంటే కన్నీళులతో", అనీ", "వెనుకటి గొప్పలు కలపోసినలాభం బండి సున్న", అనీ శ్రీ శ్రీ అన్నప్పుడూ వారు అబద్ధాలకంటె సత్యాన్ని, భ్రమలకంటె వాస్తవాన్ని ఎక్కువ మన్నించారనవచ్చును. భ్రమలపాలైన మన ప్రసిద్ధ కవులకు పూర్వాంధ్రయొక్క గొప్పతనాలే స్మరణీయాలు కాగా, వర్తమానాంధ్ర దుస్థితి వారి చూపునుండి జారిపోయింది. వారి దేశభక్తికి యిదే నిదర్శనం. కాని శ్రీ శ్రీ "విషాదాంధ్ర"ను దర్శించాడు. రాజకీయ చదరంగాలను, నక్కలు, కొంగలు, పిల్లుల వంటి నాయకులను, వారి కుమ్ములాటలను గమనించాడు. "శిశువుకు దక్కని స్తన్యం లాగా" ప్రజలకు వుపయుక్తాలు కాక సముద్రాన కలిసిపోయి మన అఖండ వాహినీ జలాల గలగలను విన్నాడు.

స్వాతంత్ర్యోదయం మన ప్రసిద్ధకవుల దృష్టిలో సకలసమస్యా పరిష్కారంగానూ, సకలరోగ నివారిణిగానో కనుపిస్తే, శ్రీ శ్రీకి హర్షోల్లాసాల నడుమ చిరునవ్వు కనుపించని సామాన్య భారతపౌరుని నిరాసక్తవదనం కనుపించింది. వర్తమాన సమస్యలు కావ్య వస్తువులుగా చిరంజీవాలు కావని ఒకవాదం వుంది. దీనిని అభ్యుదయ సాహితీపరులు లెక్కించరు. జడప్రకృతిలోకంటె, వారికి జీవన్మానవ లోకమందు సౌందర్యాధిక్యత గోచరిస్తుంది. అబద్ధాలను, అప్రసక్తాలను, అనావశ్యకాలను చిత్రించడంమట్టుకే కళ యొక్క పరమ ప్రయోజనమయితే, అభ్యుదయ సాహితీపరులకు అటువంటి కళ అక్కరలేదు. వారు వాస్తవ కళావాదులు. కాని, తక్షణ సమస్యాచిత్రణ వల్ల ప్రచారంలా కళాదారిద్ర్యం అడుగడుగునా బయల్పడడాన్ని ఒప్పుకోరు. సాహిత్య మూల్యాలు అడుగంటడాన్ని సహించరు. ఈ విషయంలో కూడ శ్రీ శ్రీ పెట్టిన ఒరవడి అభ్యుదయ రచయితలందరికీ అనుసరణీయమైనది. కళ లోపించకుండానే, వర్తమాన సమస్యలను కావ్యవస్తువులుగా స్వీకరించి, వస్తువునకు తగినరీతిని మేళవించాడు శ్రీ శ్రీ. ఛందస్సుల ప్రాగల్భ్యం లేకుండా, పాండిత్య ప్రస్ఫుటత్వం లేకుండా, అభిప్రాయాల కొత్తదనం కొట్టవచ్చేటట్లు లేకుండా శ్రీ శ్రీ ఛందోబద్ధంగా కొన్ని పర్యాయాలు, విశృంఖలంగా మరికొన్ని పర్యాయాలు నూత్నాభిప్రాయాలను

పండితులుకూడ జేజేలివ్వదగిన నైపుణితో వెల్లడించాడు. ఈ ప్రత్యేకగుణం పోను పోను బయల్వెడలిన అభ్యుదయ రచయితలలో రానురాను సన్నగిల్లిందని మన మంగీకరించక తప్పదు. శిల్పంమీద, శైలిమీద అధికారం తగ్గిపోసాగింది. ప్రచారంపాలు హెచ్చయింది. లేదా యీలోపాలను కప్పిపుచ్చుకొనేందుకు గారడీపను లెక్కువైనవి.

## 3

### పెడత్రోవలు :

ఈ శతాబ్దిలో మూడవ దశాబ్దినుండి అభ్యుదయ సాహిత్య వ్యవసాయాన్ని ప్రారంభించిన శ్రీ శ్రీ, మరికొందరు భారతదేశంలో అభ్యుదయ సాహిత్యోద్యమం నెలకొనేనాటికి (1936) పరిణతబుద్ధులయ్యారు. "తెలుగు రచయితలలో అగ్రగామిదళం ఒకటి అభ్యుదయ సాహిత్యం వైపు మొగ్గింది," అని శ్రీశ్రీయే వ్రాసివున్నాడు. కాని ఆంధ్రదేశంలో అభ్యుదయ సాహిత్యోద్యమం స్థిరపడి సంఘటితమయ్యేసరికి మరో ఏడేళ్ళు పట్టింది. ఈ ఏడేళ్ళలో దేశీయంగానూ. అంతర్జాతీయంగానూ వచ్చిన అగణ్యాలైన మార్పులు అభ్యుదయ కవిత్వంలో ప్రతిఫలించాయి. అభ్యుదయ కవిత్వ నాయకుడుగా దేశమంతటా గుర్తింపబడిన శ్రీశ్రీ బ్రతుకులో కూడ గతుకులు, కుదుపులు వచ్చాయి. ఆనాటికే ఆయన మనస్సులో సర్రియలిజం వంటి పాశ్చాత్య సాహిత్య ధోరణులు ప్రవేశించాయి. తత్ప్రభావ ఫలితంగా శ్రీశ్రీ చేసిన ప్రయోగాలు దేశంలో ఎక్కువ ఆమోదాన్ని పొందలేదు. శ్రీ శ్రీ వ్యక్తిగతంగా త్రొక్కిన ఈ వింతత్రోవలను అభ్యుదయ సాహిత్యానికి అంటగట్టారు. ఈ ధోరణులకు దేశంలో వేళ్ళులేవు. రెండు ప్రపంచయుద్ధాల నడుమంతరాన పాశ్చాత్య సాహిత్య ప్రపంచమందు చెలరేగిన నిరాశా నిర్వేదాలు, పితూరీ తిరుగుబాటు ధోరణుల ఫలితంగా సకల సంప్రదాయ నిరసనతోటి మానసికాలైన సంబద్ధాసంబద్ధ, వ్యక్తావ్యక్త, సభ్యాసభ్య భావాలతోటి అమానుషమైన సాహిత్యమొకటి వుత్పత్తిల్లింది. యుద్ధ ప్రమాదచ్ఛాయలో మానసిక ప్రశాంతిని కోల్పోయి, అల్లకల్లోలాల పాలైన పాశ్చాత్య దేశాలలో యీ ధోరణులు పరిస్థితుల ప్రభావంచేత సహజాలై యుండవచ్చు! కాని తెలుగునాట వీటి ప్రవేశానికి కారణ మేమీ లేదు - వ్యక్తుల యిచ్ఛ తప్ప. శ్రీశ్రీతో, ఆరుద్రకూడ జతకలిశాడు. ఇద్దరూ సైన్యంలో వుద్యోగం చేస్తూ, "స్థాయి" లేని జీవితాలుగడుపుతూ, "అశాంత" చెందుతూ, సాల్వడార్ డాలీ వ్యాసాలను చదువుతూ, యీ అభిప్రాయాలను ఒంటబట్టించుకొన్నారు. తమకంటె ముందే తెలుగు పాటల్లో సర్రియలిజం వుందని, కనుక ప్రత్యేకించి తాముగా ప్రవేశపెట్టిన అనౌచిత్యాలు ఏవీ లేవని తృప్తిపడసాగినారు. "మాత" పత్రికలో ప్రకటింపబడిన శ్రీశ్రీ, ఆరుద్రల లేఖాసారస్వతంలో, "చూశావా! మనకి ముందే సర్రియలిజం పాటల్లో వుంది," అంటూ ఆరుద్ర,

"అబ్బో రబ్బో ఎలాగ అయితే
కురుచా కురుచా మొక్కలు పీట ?
కందం నాయుడి కూతురు నోరయ్యో
కొయ్యాడ,"

అనేపాటను వుదహరించి, "ముక్కాలి పీటపై రెండు అగ్నిపర్వతాలు పగిలినవి అని రాశేను. ఇప్పటిదాకా ముక్కాలి పీట నా స్వంతం అనుకొన్నాను," అని శ్రీశ్రీకి వ్రాశాడు. (9-1-1943)

ఇంతకూ ఈపోకిళ్ళకు కారణాలేమిటి? తెలియవు. ఉన్నా వ్యక్తుల అభిరుచులు తప్ప, లేవు. వీరిద్దరికీ సాదా జీవితంమీద వెగటు పుట్టినట్లు పైన పేర్కొనబడిన లేఖాసాంగత్యంబట్టి తెలుస్తుంది. "దినములు పాస్వగ ప్రతిధ్వనులు" అని శ్రీశ్రీ వెళ్ళబుచ్చిన విసుగుదలకు ఆరుద్రనుండి వెంటనే "యథాయూంషిక యూంషికః మన పని. అనునిత్యం అదేపని. గ్రామఫోను జీవితం అన్నాను పాటలలో. ఇంకా,

పొద్దున్నే నిద్రలేవడం
మధ్యాన్నం నిద్రపోవడం
సాయంత్రం బేజారవడం
రాత్రంతా కలలుగనడం"

అని ప్రతిధ్వని వస్తుంది. రాత్రులలో నిద్రలో సాదాకలలు మజాలేదు. రాత్రి పడుకునేముందు నీరుల్లిపాయలు తింటే విచిత్ర స్వప్నాలను కనవచ్చునని నారాయణబాబు చిట్కా చెప్పాడట. సాధారణంనుండి అసాధారణానికి పోవలెననే యిచ్ఛ వీరిలో ప్రబలంగా వున్నట్లు కనిపిస్తుంది. విశృంఖలమైన బ్రతుకుకోరకు అర్రులు చాస్తున్నట్లు తెలుస్తుంది. "సిరిసిరి మువ్వ శతకము" (ఆంధ్ర జ్యోతి: ఫిబ్రవరి'46)లో శ్రీ శ్రీ యే చెప్పినట్లు,

"బేపరతు బ్రతుకుకోసం
శోషిల్లెడి మామకాత్మ చుట్టూ ఏవో
ఘోషలతో నియమాలా
శ్లేషిస్తే ఏది దారి ?"

బ్రతుకులో విశృంఖలతను కోరినట్లే, సాహిత్య విషయాలలోనూ కోరారు. సమాజానికున్న షరతులవంటివే సాహిత్యంలో ఛందస్సు మొదలగు నియమాలు. ఈ విశృంఖలవాదులకు యీ బందోబస్తులు పనికిరావు.

"ఛందో బందోబస్తులన్నీ
ఛట్ ఫట్ మని త్రెంచి
Damn it, ఏమిట్రా ఇదంటే
Pray, it is poetry, అందాం."

అధివాస్తవికవాదుల ఆశయాల జాబితాలో ప్రథమ స్థానగౌరవం పొందిన యీ సకలచ్ఛందోనిరసనను తప్పు పట్టినప్పుడు, "కవితా గీతం"లోని

"నా విన్నవి కన్నవి విన్నవించగా
మాటలకై వెదుకాడగబోతే—
అవి
పుంఖాను పుంఖంగా
శ్మశానాలవంటి నిఘంటువులదాటి,
వ్యాకరణాల సంకెళ్ళువిడిచి,
ఛందస్సుల సర్పపరిష్వంగంవదలి
వడిగా, వడివడిగా
వెలువడినై, పరుగిడినై, నాయెద
నడుగిడినై."

అన్న మాటలలోకూడ తప్పుపట్టవలసి వుంటుందని కొందరనవచ్చును. కాని, 'కవితాగీతం' వ్రాసేటప్పటి మనస్థితి, అధివాస్తవికధోరణి ఆవేశించినప్పటి మనస్థితీ వేరైనవి. ప్రవక్తృవాగింద్రజాల ప్రవాహానికీ, వున్మత్తప్రలాపధోరణికీ వున్న అంతరమే పైరెంటికీ కలదనవచ్చును. వ్యాపారనాగరికత తెచ్చిపెట్టిన దుఃఖదాయక విషయాలనుగురించి ఆలోచించినప్పుడు మహోద్రిక్తుడై, నియమోల్లంఘనం సాహిత్యంలోనేకాక, బ్రతుకులో కూడ

చేయ నుద్యమించినప్పుడు, శ్రీశ్రీ పీడితుల కందరికి ప్రతినిధిగావున్నాడు. కాని, వ్యక్తి మాత్రుడైన తన యిష్టానిష్టాలను ప్రపంచం మీద రుద్దచూచి, తన మానసిక కల్లోలాన్ని సాహిత్యసంప్రదాయ నిరసనగానూ, సంఘ అరాజకంగానూ తయారు చేయ చూచినప్పుడు, పోకిరి పోతడలయందే అకారణమైన ఆనందాన్ని, విధ్వంసనమందు సంప్రీతిని, వైపరీత్యాలందు వెర్రిదాహాన్ని ప్రదర్శించే వక్రమనస్కుల (Pervents) కు మట్టుకే శ్రీ శ్రీ ప్రాతినిధ్యంవహించాడు అర్థవంతమయిన ప్రపంచంలో అర్థవంతమయిన సాహిత్యానికి స్థానముంటే, అడవివంటి ప్రపంచంలో సాహిత్యానిక అర్థంతో అవసరంలేదని కాబోలు సిద్ధాంతీకరించబోయాడు. అడవిలో మృగాలవలె నే అధివాస్తవ సాహిత్యారణ్యంలోని కవులు మృగలక్షణాలను అలవరచుకొని,

"హాష్! వాూష్! హూష్! హాష్! అని కేకలువేసి కావ్ కావ్! మ్యావ్! మ్యావ్! అందాం గమ్మత్తుగా."

ఈ వ్రాతలలో చివరకు మానవుని మహాధనమూ, సంస్కృతి కంతటికీ మూలకందమూ నయిన మానవవాక్కుకుకూడ విలువ తీసివేయబడింది.

"న...న...న...న...వట్టిమాటలు కూడా
మ...మ...మ...మ...మన వ్రాతల్లో
వుండవచ్చు."

పఠాభి వ్రాసిన "ఫిడేలు రాగాల డజను" కు "ఇంట్రో" లో శ్రీశ్రీ, "నవకవులీ తిరుగుబాటు"ను వివరిస్తూ, "పదార్థాల నిరంకుశత్వం భరించలేడు నవకవి... వ్యాకరణం మాత్రం? వాక్యానికి కర్త, కర్మ, క్రియల అనుబంధం విధిస్తారు కామా? వీటికి నవకవి విడాకులిస్తున్నాడు. కర్త లేకుండా ఒక్క క్రియమాత్రమే నిరంకుశంగా విహరిస్తుంటే కొందరు కళ్ళుపొడుచుకుంటున్నారు. కాని కవి సర్వతోముఖ స్వాతంత్ర్యదూత. స్వేచ్ఛాదాత. అవ్యయం అనాచ్ఛాదితంగా ఆకాశమధ్యంలో ఊగవచ్చును. విభక్తి విశృంఖలంగా షికారు పోవచ్చును. ప్రతిఫలం విచిత్ర సౌందర్యం. విచిత్రమే సౌందర్యం! సౌందర్యమే విచిత్రం. ఛందస్సుల చండశాసనానికికూడ కాలం వెళ్ళిపోయింది. కవి హృదయంలోని రాగాలాపన ఎట్టి తీగలుగా సాగితే అదే గీతానికి ఆకారం నిర్ణయించాలి", అంటాడు. స్వాతంత్ర్యమూ, స్వేచ్ఛ అంటే వీరిదృష్టిలో అర్థమూ అదుపూ గానీ, క్రమమూ నియమమూ గానీ లేని విశృంఖలత్వమని ఇంతకు మునుపే తెలిపాను.

ఈ అసంబద్ధ బీభత్సకవిత్వంలో శ్రీశ్రీ కంటె శ్రీరంగం నారాయణబాబు మరొక మెట్టు పైకివెళ్ళాడు. "నల్లమందు"వంటి భావకవిత్వంపై పితూరీ లేవదీసి, దానిని వస్తు వ్యాకరణాలలో తెచ్చినమార్పులతో నిలుపక, అపరిచితాలూ, అసహ్యాలూ నయిన పథాలు పట్టించాడు. "అతి వాస్తవికత మనకు కావాలంటే వెర్రివాళ్ళ దగ్గరకు, త్రాగినవాళ్ళ దగ్గరకు పోవాలి అంటున్నారు నిజమే. స్వచ్ఛందమైన అస్తాత మనస్సు విహారం చేస్తుంది. కాని వెర్రివానికి కవికి వ్యత్యాసముందంటే, కవి కావలసినప్పుడు వెర్రిని తెచ్చుకొని ఉపయోగం తీరాక, అరికట్టుకోగలడు. వెర్రివాడు అలాగా చేయలేడు," అని తన తాత్కాలికమైన వెర్రిని నారాయణబాబుగారు సమర్థించుకో జూచారు. అది అపస్మారం కాదట, క్రోశోత్సాహమట. "వాస్తవికత భాగా

చిత్రంలాంటిదైతే, అది వాస్తవికత X'ray లాంటిది," అని, "అది వాస్తవికత సాహిత్యంలో తెరువబడిన మాత్రకవాటం. ఫ్రాయిడ్ సిద్ధాంతాలు, మార్క్సు సూత్రాల కలయికలో పుట్టిన కమ్రగానం," అని అన్నారు మార్క్సు సూత్రాలంటే వీరికృష్టిలో యథార్థవాదమేమో. కాని దీనికి ఫ్రాయిడ్ సిద్ధాంతాలకూ ఏ విధమైన బాంధవ్యమూ లేదు. బ్రతుకులోని భేదసంధాయకాలైన విషయాలను చిత్రించడమొక్కటే యదార్థవాద మనిపించుకోదు. బహుముఖమైన మానవజీవిత సమస్తాన్ని సమగ్రంగా విమర్శించి విస్పష్టత - సారళ్యము - సౌందర్యము అనే లక్ష్యత్రయానికి కట్టుబడిన సాహిత్యాన్నే వాస్తవవాద సాహిత్య మంటాము. జడమైన మానవప్రకృతిని సంఘస్థితిని యథాతథంగా చిత్రించడమూ, మానవ ప్రకృతిలోని నీచగుణాలకే ప్రాముఖ్యమిచ్చి చిత్రించడమూ అప్రధానాలు, అశ్లీలాలూ అయిన ధోరణులను అభిమానించడమూ వాస్తవ వాదాపని భిన్నమయిన గుణాలు. అనునిత్యమూ రికి, వర్తనమందుతూవున్న సంఘమందు ప్రముఖస్థానాలాక్రమిస్తూ, అర్థవంతాలై ఒప్పారుతూవున్న జీవద్ధోరణులనే వాస్తవ వాదకళ మన్నిస్తుంది. కాని అది వాస్తవిక కళను, ప్రయోజకాలతో కాక, అప్రయోజకాలతోటి, సార్థకాలతో కాక నిరర్థకాలతోటి, అనర్థదాయకాలతోటి, వ్యక్తంతో కాక అవ్యక్తంతోటి, వ్యక్తావ్యక్తంతోటి, వుచ్చాలతో కాక నీచాలతోటి ఎక్కువ ప్రమేయం వుంది. ఉదాహరణకు, మన శాస్త్ర పారంగతులమంటూ వీరు "కామేచ్ఛ"కు యిచ్చిన అనుచిత ప్రాముఖ్యాన్ని చూడవచ్చు. అది సహజమయినంత మాత్రాన, దానికి కావ్యాలలో పట్టంగట్టి, తద్వారా తమ దాహాన్ని తీర్చుకోజూచే వారికి సభ్యాసభ్యాలు, శ్లీలాశ్లీలాలు మదికెక్కుతాయా?

ఇక నారాయణబాబు గారు శైలివిషయాలను గురించి శ్రీశ్రీ కంటె మరొక మెట్టు పైకి పోయారు. స్పష్టతకు బదులు క్లిష్టతపై మోజు. ఎంత సూక్ష్మంగా చెప్పగలిగితే అంత సామర్థ్యమున్నదని కొలతకాబోలు! శ్రీ రోణంకి అప్పలస్వామి గారు "రుధిరజ్యోతి" అనే నారాయణబాబుగారి కావ్యసంపుటిని గురించి, సెప్టెంబరు 1952 భారతిలో ప్రస్తావిస్తూ "శ్రీశ్రీ స్థూలదృష్టికికూడ దొరుకుతాడు. నారాయణబాబు కొన్ని తావులలో సూక్ష్మదృష్టికి వినా, స్పష్టంకాడు. నోటికిపట్టే ఛందస్సులలో శ్రీశ్రీ పరుగులు దీస్తాడు. తన లక్ష్యాన్ని ప్రత్యక్ష పద్ధతిని వ్యక్తం చేస్తాడు. నారాయణబాబు పరుగులో శ్రీశ్రీకి గల ఉద్వేగం లేదు. అతనిది పరోక్ష పద్ధతి... భావకవిత్వంపై తిరుగుబాటు, వస్తువ్యాకరణాలతో ఆగక, విప్లవపథాలను పడుతుంది. రీతిలోను, వస్తువులోను, సరిక్రొత్తదనం కనిపిస్తుంది. ఎవరూ చెప్పని పద్ధతిని చెప్పడం అతనికి సరదా. ఇమేజిస్టు కవితను ఇతడు ప్రాణంపోస్తాడు. శబ్దార్థాలతో ఘటించి, సొగసైన విగ్రహాలను నిర్మించే శిల్పి. క్లుప్తత ఇతని పద్ధతి... అవ్యక్త మధుర భావాలను వ్యక్తంచేస్తూ రసస్ఫూర్తి కలిగించడమే అతని లక్ష్యం......న్యాయానికి అతని కవిత్వమే 'నిశ్శబ్ద పురాణ సంపుటముల దొంతి'...ఇంద్రియాలు గ్రహించిన అనుభూతులను ఆ యా యింద్రియాలతో గాక, వానిని భిన్నభిన్న యింద్రియ సంపాదితములుగా పేర్కొనడం ఒక శిల్ప

రహస్యం. 'తెల్లని రుచి', 'రజత రావ సంగీతం' అనే యితని ప్రయోగాలు ఇలాంటివి" అని నారాయణబాబుగారి కవితలోని కొన్ని లక్షణాలను పేర్కొన్నారు. కాని వారు అవలక్షణాలను విడిచిపెట్టారు. నారాయణబాబు సృష్టించిన ప్రతిభావ విగ్రహం (Image)లోనూ, ప్రతి పంక్తిలోనూ, ఆలోచనలోనూ, పద్యచరణాలలోనూ అరాచకం కనుపిస్తుంది. కావాలని పదాలను వికృతపరచి ప్రయోగించడం సరదా కాబోలు, "మృతశరీర యాక్రమణ", "ఘుటాకాళీ యరుణారుణ" అంటూ కొన్నిటిని వాడాడు. తర్వాత, చాల అసహ్యాలైన వస్తువులను వర్ణించి తృప్తిచెందడం యితని మరొకసరదా. "ప్రేయసి కాలిన దేహం కమురు కంపు యీ లోకం", "తెల్లని మసూచి కుండలు గగనమ్మున తారలు," "ఒళ్ళు తెలియని పుళ్ళబాధతో వెక్కి వెక్కి ఏడ్చినది చుక్కల ఆకాశం", "విధవ కానుపు" వంటి వర్ణనలలో యిది స్ఫుటంగా కనుపిస్తుంది.

ఈ ధోరణి ననుసరించిన వారిలో శ్రీశ్రీ, నారాయణబాబుల తర్వాత పేర్కొనవలసినవారు దేశిరాజు కృష్ణశర్మ, పఠాభి, వీరి రచనలు తాత్కాలికంగా కొంత అలజడి కలిగించినప్పటికీ, పురిపండా అప్పలస్వామిగారి "సౌదామిని"కి పుపోద్ఘాతంలో శ్రీ శ్రీ, "అనేక ప్రపంచ రంగాలలో సర్రియలిజం (అధివాస్తవికత) నేడు తిరోగమించింది. అభ్యుదయ భావుకులు దానిపట్ల అపనమ్మకాన్ని ప్రదర్శించారు", అని నిజాన్ని గుర్తించాడు. కాని యీ రక్కసివిత్తులు అతని కవిత్వంలో పూర్తిగ గొడ్డుపోలేదు. అంతేకాదు – అవి ఆరుద్రవంటి యువకవుల మానసాలనుకూడ వ్యాపించాయి. ప్రత్యక్షంగా, బాహాటంగా కనుపించేందుకు భయమై, కొత్త అవతారాలు తాల్చాయి. తీవ్రంగా సంఘాన్ని పట్టి వేధిస్తున్న విషయాలను గురించి వ్రాసేటప్పుడుకూడ, కొన్నికొన్ని చోట్ల చాల తేలికగా నిర్లక్ష్యంగా చెప్పడమనేది వారిద్దరిలో ఒక గుణంగా నిలిచిపోయింది. శ్రీ శ్రీ యిటీవల వ్రాసిన "పే పే", "ప్రాసక్రీడలూ", ఆరుద్ర వ్రాసిన "జీర్ణమంగే సుభాషితం" యిందుకు సాక్షులు. ఇది కార్టూను కవిత్వమని నిర్వచించారు. హాస్యప్రధాన మన్నారు. కాని "శరచ్చంద్రిక" అనే కావ్యంలో, "రాబోయే యుగంలో" తనలోని "అరాజకం పోతుందనుకుంటూ"నని తనతప్పును గుర్తించి పశ్చాత్తప్తుడౌతాడు శ్రీ శ్రీ.

"శాఖా చంక్రమణంమాని
చెప్పేదేదో సూటిగా
బల్ల గుద్దినమాదిరిగా
కుండ బద్దలు కొట్టిన బాపతుగా
ఈ నీళ్లు నమలడం లేకుండా
ఈ కాళ్ళు తడబడడం లేకుండా
స్పష్టంగానే కాకుండా శ్రావ్యంగా
స్వచ్ఛంగానే కాకుండా సమగ్రంగా
రాబోయే యుగంలో
గుండెలు విప్పి మాట్లాడుకొందాం."

కనుక శ్రీశ్రీని అనుసరించబోయే ఆగామి కవులు అతని కవిత్వంలో నీరక్షీర విభాగాలను చేసే శక్తి నలవరచుకోవాలి. అతను ఎన్నో క్రొత్త పోకడలు పోతాడు. ఎన్నో ప్రయోగాలు చేస్తాడు. అన్నీ అనుసరణీయాలు కావు. అన్నీ మాన్యాలు కూడ కావు.

"కదలేదీ కదలించేదీ
మారేదీ మార్పించేదీ

పాడేదీ పాడించేదీ
పెనునిద్దుర వదలించేదీ
మునుముందుకు సాగించేదీ
పరిపూర్ణపు బ్రదుకిచ్చేదీ"

ఏది అతని కవితలో వుంటుందో, అదే స్వీకార్యమని, మిగతాది "ఒక మహాకవి పోకిళ్ళు" అనే పేరున చరిత్ర చెత్త కుప్పపాలు కాక తప్పదని నేననుకొంటాను.

## 4

### అభ్యుదయకవిత్వ ప్రగతి :

అభ్యుదయ రచనోద్యమమనేది 1943 లో ఆంధ్రావనిలో స్థిరపడిన తర్వాత, యువకు లనేకులు చేతనులై, సంఘ శ్రేయస్సునూ, జగత్కల్యాణాన్నీ, పీడితజనులపట్ల సానుభూతినీ, అన్యాయాల యెడల ఆగ్రహాన్నీ ప్రదర్శిస్తూ కవిత్వ మల్ల సాగినారు. నానాటికీ రాజకీయాలకు జాతీయజీవితంలో అత్యంత ప్రముఖస్థాన మేర్పడుతున్న రోజులలో, స్వాతంత్ర్య సంగ్రామగతి తీవ్రతరమయిన రోజులలో, జాతీయంగానూ, అంతర్జాతీయంగానూ, కష్టజీవులశక్తి నిర్నిరోధమని తేలిపోయిన రోజులలో, సంఘచేతనులూ, ప్రయోజనాయుత సాహిత్యవాదులూ నయిన యీ కవి కిశోరాలకు కావలసినంతకంటే అదనమైన కవితావస్తువు లభించింది. ఆనాటికే పరిణత మనస్కులై, సాహిత్యతపస్కులై యుండిన వారుతప్ప, తక్కినవారిలో హెచ్చుపాళ్లు సాధనచేసే ఓపికలేకనో, నిగ్రహించుకొనే శక్తిలేకనో, లేక అభ్యుదయ రచనాదర్శాలను సరిగా బోధపరచుకోనందుచేతనో, ఏకాగ్రతను పాటించనందుచేతనో, ధ్వావేశము చొరబారినదే తడవుగా రచన కుపక్రమించి నందుచేతనో, అనూరునివలె అసమగ్రాలైన, కళావిలసన దరిద్రాలయిన ప్రచారాధిక్యమే గలిగిన, భాషాసౌష్ఠవం నైదొలగిన గజిబిజి, అతివ్యాప్తి, అవ్యాప్తి, పునరుక్తిదోషాలు నిండిన రచనలు చేయసాగినారు. వీరి ఉత్సాహం మెచ్చుకోదగినదే కాని ప్రోత్సహించ దగినదికాదు. కాని యీ లోపాలన్నింటి తోటి గుణాలు లేక పోలేదు. సాహిత్యాసక్తి విస్తృతమయింది. పత్రికాలోకం పెరిగింది. రచనా వ్యాసంగం ఎక్కువయింది తర్వాత, అన్నింటి కంటె హెచ్చయిన మార్పు ఏమిటంటే, శ్రీ శ్రీ, సమస్తదేశాలకూ చెందగల సర్వసాధారణ సంఘటనలను, సకల మానవులు అనుభవించగల సర్వసాధారణ అనుభూతులను మట్టుకే వర్ణించి, ప్రత్యేక సంఘటనల జోలికి వెళ్ళకపోగా, యీ యువరచయితలు వాస్తవవాదదృష్టి సమగ్రమయ్యేలాగున, ప్రత్యేక విషయాలను కూడ కావ్యవస్తువులుగా స్వీకరించారు. శ్రీ శ్రీ సింహావలోకనంమట్టుకే చేశాడు. గగనాన పోయే కృష్ణపక్షి కంటికి దిగువ గల అరలు విడివిడిగా కనుపించనట్లే శ్రీ శ్రీ కంటికి ముఖ్యంగా "మహాప్రస్థాన" గీతాలలో ప్రత్యేక సంఘటనలు కనుపించలేదు. మరి యువకవులు శ్రీ శ్రీ అంతయెత్తున నిలిచి ప్రపంచాన్ని చూడలేదు. లోకవ్యవహారాలలో వారూ పాల్గొనసాగినారు; కష్టసుఖాలనుభవించ సాగినారు. లోకులతో మరింత సన్నిహిత బాంధవ్యం ఏర్పరచుకొన్నారు. అందుచేత శ్రీ శ్రీ దానికంటె వారి మేధస్సు మరింత సంపన్నమయింది; వారిదృష్టి మరింత సమగ్రమయింది; వారిచిత్రణ సత్వానికి మరింత

సన్నిహితమయింది; వాస్తవవాద కళా ధర్మాలకు మరింత న్యాయం జరిగింది. వీరు జనతా లోక సాక్షులయ్యారు; యుగ ఘోషను వినగలిగిన కర్ణేంద్రియాలయ్యారు; లోక వ్యవహారాలకు ప్రతిచలించ గలిగిన నాడీమండలాలయ్యారు; జనమాన సానుభూతులను వెలువరించగలిగిన ముఖ ద్వారాలయ్యారు. అందుచేత అభ్యుదయ రచనారథం శ్రీశ్రీని దాటి చాలదూరం నడచివచ్చిందని చెప్పవచ్చును.

"మహాప్రస్థాన గీతాలు" పత్రికలలో విడివిడిగా ప్రచురితాలయినవి. అభ్యుదయ కవిత్వ ప్రథమ సంపుటి నిజానికి "నయాగరా." కృతికర్తలు ముగ్గురు, బెల్లంకొండ రామదాసు; ఏల్చూరి సుబ్రహ్మణ్యం; కుందుర్తి ఆంజనేయులు. కృతిభర్త అనిశెట్టి సుబ్బారావుతో కలిసి, వీరందరూ నర్సారావుపేటలో "నవ్యకళాపరిషత్తు"ను నడిపారు. వీరిని నలుగురినీ కలిపే ఏక సూత్రమొకటి వున్నప్పటికీ, యెవరి శక్తి వారిది, ఎవరితీరు వారిది. రామదాసులో పితూరీదారు, ఏల్చూరిలో సాధువు, ఆంజనేయులులో ద్రష్ట, అనిశెట్టిలో ప్రవక్త ఎక్కువ కన్పిస్తారు.

వీరందరూ తలవొక చోటకూర్చి "నయాగరా" వెలువరించారు (1944). జలపాతానికి అడ్డుఆపులు లేవు. వీరి కవిత్వానికి ఛందోనియమాలు లేవు. జలపాతంలో అంతర్లయ కద్దు. వీరి కవిత్వాన కూడ అది కద్దు. పసిఫిక్ యుద్ధరంగంనుండి మన్యం విప్లవం వరకు వీరిదృష్టి ప్రసరించింది. బర్మా అడవులూ, పారిస్ వీథులు, మాస్కో గేట్లు, చైనా లోయలు వీరి కవితలో ప్రత్యక్షమౌతాయి. సోల్జర్లూ, పైలట్లూ, టాంక్ డ్రైవర్లూ, కళ్ళకు కట్టుతారు. కర్షకులూ, కార్మికులూ, వెన్నువిరిచి పని చేసికూడ ఆకలితో అలమటించేవారు, బిచ్చగాళ్లు, పసితనమందే పతి పోగా బిక్కమాలిన కన్యలు - అరుస్తారు, ఓరుస్తారు, ఆక్రోశిస్తారు, ఎగబడుతారు. తిరుగబడుతారు, ధిక్కరిస్తారు, ప్రవహిస్తారు, ఘూర్ణిల్లుతారు, "మెరుపులు మింగేస్తారు." క్లుప్తంగా చెప్పాలంటే, ఇది సూత్రప్రధానమైన కావ్యసంపుటి కాదు - కావ్యప్రధానమైనట్టిది. ఈ కావ్యసంపుటి "గత లోకం కాల్చిందట, నవలోకం చూపిందట, నడకండని చెప్పిందట, నరాలు వణికించిందట, కండలు కదిలించిందట, గుండెలు మండించిందట, మేధస్సుకు రెక్కలు కట్టిందట, జీవితాన్ని విహంగం చేసిందట." సామాన్య జనానికి "నందన వన వసంతమందారం" కుసుమింపజేసింది. "సంఘానికి వస్తు"న్న "కొత్త స్వరూపం" చూపింది. అది ఏదో కాదు - ఆత్మ విశ్వాసమూ, రాజకీయ చైతన్యమూ మైకొనగా సకలపీడిత హృదయులనుండి ఆవిర్భవించిన శక్తి - ప్రజాశక్తి. "చీకటిలోపడి మ్రగ్గిన లోకానికి దూరపుతీరాల్లో మండే కాగడాలు" చూపించిన, "సంకెళ్ళను బందాలను త్రెంచెయ్యను నిప్పుల కత్తెరలను సృష్టించిన" నయాగరా కవులు "నియమపు శైళ్ళకు పట్టాలను" పీకేశారు. నిర్నిరోధమైన అంతర్లయతో కూడిన గద్యం పద్యంకంటె రసభసగమనంతో నడుస్తుంది. "ఆంధ్రశిల్పి" ఫిబ్రవరి '47లో తన కవిత్వం గురించి వ్రాస్తూ, శ్రీశ్రీ "ఛందోగమనం రైలుబండి నడకయితే, వచనగమనం విమాన విహారం వంటిది," అన్న మాటలు "నయాగరా"లోని నిర్నిబంధకవిత్వానికి సరిగా అన్వయిస్తాయి.

కాని తత్కాలానికి ఎట్టి సద్యోఫలితాలను కలిగించినప్పటికీ, సకల నియమోల్లంఘన శాశ్వత శ్రేయోదాయకం మట్టుకు కాదు. ఛందస్సనేది త్యాజ్యంకాదు – మాన్యమని గుర్తించడం, స్వేచ్ఛను అరికట్టడంకాదు. నియమబద్ధమైన స్వేచ్ఛ నిర్నిబద్ధమైన స్వేచ్ఛకంటె వేయిరెట్లు గొప్పది. ఒకటి సుందరమానవ లోకము వంటిదయితే, వేరొకటి నిత్యము సంఘర్షించే మృగలోకం వంటిది. "నయాగరా" కవులందరిలోనూ ఈ ఆవేశపరత రామదాసును ఎక్కువగా లోగొన్నదని చెప్పవచ్చును. ఆవేశం హద్దుమీరిపోయినప్పుడు ఉన్మాదంగా పరిణమిస్తుంది. హేతుబద్ధమైన, క్రమానుసారమైన ఉద్రేకం సహజమైనది కాగా, ఫలాఫలాలను ముందు వెనుకలను గమనించక సాగే వుద్రేకం ప్రమాదకరమైనది. దీనిలో నిర్మాణంకంటె విధ్వంసం పాళ్ళెక్కువ. ఉచితోక్తి కంటె అతిశయోక్తి పాళ్ళెక్కువ కను కనే రామదాసుగారికి, ఆలోచించిన అలంకారాలు, రసౌచిత్యాలు, పదౌచిత్యాలు, ప్రయోజనాలు, శైలులు, బిగువులు, ఇత్యాదులన్నీ అర్థంలేని పిచ్చినమ్మకాలు; కవిత్వానికి శత్రువులు,"గా కనుపించాయి. రామదాసుగారు తెగడినవన్నీ మనపూర్వులు ఎంతో వివేకపరులై కల్పించి, మనకుగాను సంక్రమింపజేసి పోయిన నిస్తులమైన వారసత్వము. అవసరమైనదానిని గ్రహించి, అనవసరమైదానిని వర్జించడమే అభ్యుదయదృష్టిగల మేధావి కర్తవ్యంకాగా, రామదాసుగారు సమస్తాన్నీ నిరాకరించారు. అహంభావమనేది తప్పుకాదు. అది అత్యావసరమైనది. తనను సంఘంలోని యితరులనుండి వేరుచేసి, తనకూ, వ్యక్తిత్వమున్నదని తెలియజేసేదే అహంభావము. కాని యిది అతిశయించినప్పుడు, అహంకారంగా మారుతుంది. సంఘమూ, వ్యక్తీ పరస్పరాశ్రితాలు, పరస్పర పోషకాలు. వ్యష్టి సమష్టిని గౌరవించకతప్పదు. లేకుంటే వ్యక్తి సంఘశత్రువు కాగలడు. అట్లాగే వ్యక్తి ప్రత్యేకతను సమష్టి గౌరవించక తప్పదు. లేకుంటే సమష్టిపుష్టి కోల్పోతుంది. కనుక అభ్యుదయ కళాకారు డెల్లప్పుడూ వ్యష్టిని సమష్టిలో లీనపరుస్తాడు. ఈసమ్మేళనంలోనే మానవ జీవితానికి మహత్త్వమూ, సార్థక్యమూ, సంశ్రేయమూ ఫలించగలవు.

"నయాగరా" కవులు సాంఘిక వర్గ కలహ సాహిత్యసృష్టి కావించారు. శ్రీ శ్రీ యెంచుకొన్న రథచక్రాలవంటి సంజ్ఞలను విడచి, వాస్తవంగా జరిగిన పసిఫిక్ యుద్ధం, మన్యంలో తిరుగుబాటు, ఠాకూర్ చంద్రదాసు లేవదీసిన పితూరీ వంటి ప్రత్యక్ష, సమీప సంఘటనలను వస్తువుగా గ్రహించారు. అంటే, శ్రీ శ్రీ కల్పించింది వాతావరణం మట్టుకే కాగా, "నయాగరా" కల్పించింది ఆ వాతావరణంలోని స్థూలరేఖలు (outlines). వారిచేతులలో నిలిచాయి "దూరపు తీరాల్లో నుండే కాగడాలు."

అనిశెట్టి సుబ్బారావుగారిని యీ "నయాగరా" కవుల సరసనే నిలబెట్టాలి. కాని వారందరిలోనూ లేని ప్రత్యేకగుణం అనిశెట్టి కవితలోవుంది. నిజానికి అనిశెట్టి ప్రత్యేక కూటమికి చెందినకవి. అభ్యుదయ కవులందరూ ఒకటి, అనిశెట్టి ఒకటి. ఇతరులనుండి అతనిని ప్రత్యేకించే లక్షణం యితరులకు లేని, లేదా చాలని, అతనిలో నిండుగా అంతర్వాహినిగావున్న తాత్త్విక

దృష్టి. తాత్త్విక దృష్టి అన్నంతనే అతడు భావవాది (Idealist) అనిగాని, మర్మవాది (mystic) అనిగాని, పొరబాటు పడకూడదు. తానూ వర్తమాన సంఘటనలనే కావ్యవస్తువులుగా గ్రహించాడు; తానూ ఆవేశముతోటి నిలువెల్ల కంపించిపోయాడు. కాని ఈసంఘటనలన్నింటిలో చిరకాలానుగతమైన సూక్ష్మవిషయాలనుకూడ దర్శించగలిగినంతగా తన మనశ్చక్షువునకు పదును పెట్టుకొన్నాడు. ఆవేశ ప్రవాహంలో కొట్టుకొనిపోయి, శుష్క ప్రచారాన్ని చేపట్టలేదు; కావ్యసౌందర్యానికి వ్యాఘాతం కలిగించలేదు. అతని ఆవేశం క్రమానుబద్ధంగా నడుస్తుంది. సత్యాగ్రహమవుతుంది. తానూ ఏఛందోనియమాలను పాటించకపోయినా అతనిగీతాలుఒడిదుడుకులు ఎరుగవు. గొంతు ఒకసారి కీచుపోయి, మరొకసారి కొరుకుపడదు. భాష భావాన్ని, భావం భాషను అంటిపెట్టుకొని వుంటుంది. అనిశెట్టి నాడి మొద్దుబారనూలేదు, విలవిల కొట్టుకోనూలేదు. అందుచేత అతనిలో స్తిమితబుద్ధి (Calm thinking) విమర్శాశక్తి (Critical foculty), కళాదృష్టి, తత్వజిజ్ఞాస సమనిష్పత్తిలో వున్నాయని చెప్పవచ్చును. "ఆద్యంత రహితమైన ప్రాణవాహినికి మార్గాన్వేషులైన రెండు చైతన్య తరంగాలు: తత్వశాస్త్రం, కవిత్వం. ఇవి మానవుని విజ్ఞాన నేత్రాలు. ఈ సుందర నేత్రాల కాంతిలో లోక జీవిత రహస్యాలను శోధించాలి. నేను కాంతి ఒక్కటే చాలదు. ప్రచండమైన ఉష్ణోగ్రత కూడా కావాలి", అని తన కవిత్వానికి వ్యాఖ్య చెప్పుకొన్నాడు. కాని అనిశెట్టిలో పోనుపోను వేడి తక్కువై తత్త్వమెక్కువయింది. నిదర్శనంగా, కరుణ, జాలి, శాంతి, సత్యము, చైతన్యము వంటి పదప్రాబల్యం. నేటి సంఘటనలలో నిత్యధర్మాన్ని చూచిన అనిశెట్టి క్రమంగా నిత్యధర్మాది దూరవిషయాలకే ప్రాముఖ్యాధిక్యత యిచ్చినందుచేత, అతని కవిత్వం అవాస్తవికంగా కనుపిస్తుంది. వర్తమాన కాలావసరాలను నిర్లక్ష్యంచేయడు. కాని యితని చూపు అనాదినుండి అనంతకాలంవరకు సాగిపోతుంది. విజ్ఞానోదయవేళనుండికూడ మానవునికి లొంగక, విప్పుబాటుకాని మర్మాలు, సమస్యలు యితని నాకర్షిస్తాయి. తాను మనుటం తోడుగున్న మానవుడు నిర్గుణుడుకాడు; శక్తివంతుడు, వివేకి, ప్రకృతి మర్మవిచ్ఛేదన దీక్షాపరుడు; పురోగమనశీలి.

అనిశెట్టి కవిత్వంలో పైన పేర్కొనబడిన గుణాలు అతిశయించినందు చేతనే, లోపం కలుగుతున్నది. పదాలను చాల పొదుపుగా వాడినందుచేత, అవ్యాప్తి ఏర్పడుతున్నది. అతివ్యాప్తికంటె అవ్యాప్తి కవిత్వానికి ఎక్కువ అన్యాయం చేస్తుంది. తాను పాఠకులకు అందచేయ దలచుకొన్న అగాధ రహస్యం వంటి అర్థంసులువుగా అందదు. మరొక లోపమేమిటంటే, అతని పదజాలం చాలమట్టుకు భావకవిత్వయుగానికి చెందినది. అందుచేత తాను చెప్పదలచుకొన్న క్రొత్త విషయాలను పాత మాటలు సరిగా తెలియచేయ లేవు. మూడవది. అనిశెట్టి కావ్యవస్తువు చాలమట్టుకు సుదూరమయినది. అప్రస్తుతం అనవసరం కాకపోవచ్చు కాని వర్తమాన విషయాలపట్ల నిర్లక్ష్యాన్ని కలిగించి పెడత్రోవలకు పఠితలను మరలించ కలుగవచ్చును. అనిశెట్టి కవితలో మరొక లోపమని సాధారణంగా ఎత్తి చూప

బడుతున్న 'అహం' భావము నిజానికి స్వాతిశయంకాదు. "నేను"లో అతను మాటాడేది తనకేకాదు - కవులనందరినీ. కవి ధర్మాన్ని గురించి, సంఘ పురోగతిలో కవులకున్న ప్రశస్త పాత్రను గురించి, అనిశెట్టి యీ "నేను" ద్వారా వెల్లడి చేస్తాడు.

"వచ్చాను వచ్చాను వ్యాస సంతతివాణ్ణి
వెళ్ళిపోయే కోటి కోట్ల జీవుల విడచి
పొర్లివచ్చే కోటికోట్ల జీవులకొరకు...
ఈ జగతిలో నూత్నజగతి వెకలిస్తాను"

"పరుగెత్తుకొని గుండె నొత్తుకొని
ప్రజలలో
ఏకమై కదలి వచ్చాను"

"మీతోనెవుంటాను మీతోనె వస్తాను
అడుగడుగునా మీకు అండగ
నిలుస్తాను."

"జీవిత సత్యజ్వాలా కీలాంగుళి స్పృశించి
నా తనువు వీణ మీటిన
నిలువెల్ల ప్రకంపిస్తున్నా."

"సమర హృదయం నేను."

"భువన భవనమున చీకటి పునాది
పెకలిస్తాము."

వంటి చరణాలను బట్టి "నేను" "మేము"కు పర్యాయపదంగా సమూహ వాచకంగా, వాడినాడని తెలుస్తుంది.

అనిశెట్టి దృష్టికి సమస్త జనతాలోకం మహాయాత్ర చేస్తున్నట్లు, దారిలో ఆకలి, రోగం, పేదరికం వంటి అవాంతరాలు అడ్డువస్తున్నట్లు, కొందరు కూలిపోతున్నట్లు, జీవచైతన్యము విషాదాంతమా అనే భ్రమ కలుగుతున్నట్లు, కాని "రాత్రి మహాదంధకారము పల్చబడి" కాంతి ప్రవహించబోతున్నట్లు తోస్తుంది.

"ప్రాణముప్పొంగినది
పగలు దిగివచ్చినదిలే ప్రభలతోడ"

యావత్ప్రకృతి మానవునికి స్వాగత సంగీత మాలపిస్తుంది.

"ప్రళయంలో బ్రద్దలైన
భస్మశకలమైన శూన్య
క్షోణీతల మిపుడు మొలకెత్తె
క్షీణ క్షీరసాగరములు
రారా ఓ మానవుడా!...
హిమశృంగోత్తుంగ ఫాల
హేమదీప్తి నీరాజన
మింద్రధనుః కటకహస్త
మెత్తెనురా ధాత్రి నీకు
రారా ఓ మానవుడా...
కాడు లేని స్వర్గమిచట
కట్టితిమయ్యా నీకై!
అవతరించె శుభ్గావని!
యవనిక పైకెక్కెను రా!...
నవయుగ చైతన్యవాణి
నాంది పఠించెను నీకై
రారా ఓ మానవుడా!"

డమరుకమై భువి దద్దరిల్లుతూ వుంటే, బుసలిడుతూ విష ఝంఝులు పొర్లి తెళ్ళిపోతుంటే, ప్రతి ఒకడూ శివుడైన నవయుగాన, భూతకాలగళము మరిగి కాలకూట విషమూ విరులైపోయింది; వర్తమాన కాలము ప్రళయ రుద్రుని త్రేతాగ్ని శిఖల ప్రజ్వరిల్లుతూవుంది. భావిమరుట దీప్తులు కననౌతున్నవి. పతిత ప్రజలగుండె పసిఫుల్లమయింది. ఆకాశమూ, అవనీ పురాతలూగినవి. ఈ "కనులు పగులు పట్టపగలు" పూట, తాడిత భూవదనంపై నీడ నిష్క్రమించింది."

"సమధర్మం నిమ్నోన్నత
ములను కౌగలిస్తోంది!

సంగీతంగా కాలం
ప్రగతికి ప్రవహిస్తోంది"

అనిశెట్టి వ్రాసిన సమరకవిత్వం పటు కరమైనది. కూడూ, నీడా లేని "అధోజగ త్సహోదరుల" నుద్బోధించి, లోకపు సిరి సంపదలకు, సౌందర్యానికి వారికీ హక్కు వుందని,

"శ్రామికుల శిరస్సులతో
బంతులాడు పాలకులను
ప్రగతి చక్ర ఘట్టనతో
సంహరించ వలెనురా!
"వరుల కవని చెరసాలగ
పడతికిల్లు సమాధిగా
బంధించిన కిరాతకం
పటాపంచ లౌనురా!"

అంటాడు. భూమినీ, పురుషునీ విభజించి పాలించే క్రూరులకు వ్యతిరేకంగా శ్రీతుల నుద్బోధిస్తూ, "తొలికారు తొలిపోరు కలిశాయి రండి" అని పిలుస్తాడు. "నవ భారతి" అనే మహాగీతికలో, కాశ్మీరుప్రజా స్వేఛ్ఛాసంగ్రామాన్ని అభివర్ణించాడు. బెంగాలు కరువుకువిలపించాడు. మతకలహాలను తెగనాడినాడు. "అణువు బాంబు" అనే మహాగీతికలో అణుశక్తిని మానవాభ్యుదయానికి వినియోగించాలని చాటాడు. గురజాడ, దువ్వూరి, శ్రీశ్రీల సమర వ్యతిరేక గీతాలకు యీ గీతిక గర్వింపదగిన వారసత్వం పుచ్చుకొంది. "దుమికే మెరిసే మోగే, వివిధ రాక్షసాయుధాలు — మానవుడు సహించడింక."

"అణువులతో ప్రకృతి జీవప్రవాహాన్ని
నడుపుతోంది!
అణుసౌందర్యోద్భూతపు జీవనావ
నడుపుతోంది!...
............నవప్రాణధార:
వర్ణాల్ వర్షాల్ వలపుల ప్రకృతి
శోభానృత్యం
అనంతమానవకోటికి ఆదర్శం
చూపుతోంది."

ఈ ప్రకృతినుండి యీ పాఠాన్ని నేర్చుకొని, అణుశక్తిని "మానవ విజ్ఞాన గోపుర కలశంగా" ఎంచి మంగళగీతగా ప్రయోగించాలి.

"మానవుడా!
చరిత్ర పవిత్ర సంగీతంలో
అధిరోహణ దశలో
నీ అడుగుతో చెప్పు కుతాళం
వెయ్యాలు."

♦ ♦ ♦

# 5

ఆరుద్ర వ్రాసిన "త్వమేవాఽహమ్" ఆంధ్ర కవిత్వంలో అపూర్వమైన కావ్యం. ఆరుద్రగారిది "వింతైన గొంతుక" కవి సమయాలలోనూ, వస్తువులలోను, ఛందోనియమాలలోనూ సాంప్రదాయాల్ని కవి ఛిద్రం చేశాడు. ప్రాచీన అలంకారాల్ని వదిలి సమకాలీన నాగరకతను అపభ్రాతం చేసే పదచిత్రాల్ని (Figures of Speech) విశేషంగా వాడాడు. అంతేకాదు. తాను జీవిస్తున్న యుగంలో పూర్తిగా సజీవంగా వున్న వ్యక్తిగతానుభవాల రీతుల్నీ అనుభవ ప్రకారాల్నీ, నవీన స్వేచ్ఛాయుత జ్ఞానేంద్రియ వ్యాపారాల్నీ ఖచ్చితంగా వ్యంజించాడు. అభేదల్నీ (Associations) సంజ్ఞల్నీ (Allusiom) విశేషంగా వాడుతూ తన శిల్పాన్ని బలవత్తరం చేసుకొన్నాడు. చమత్కారంలో పాఠకుణ్ణి చెప్పున ఆకర్షిస్తాడు. అతనిచే అర్థాన్వేషణ

చేయిస్తాను" అంటున్నారు ప్రకాశకులు. తాను 'టెక్నిక్' లేని కవిత్వాన్ని వూహించలేడట ఆరుద్ర. తానీ వాక్యాలను నాటకరీతిలో వ్రాశాడట. "వివిధ వ్యక్తుల భావాలనీ, సందేశాలనీ ఆరుద్రీకరించి ఒక్కొక్క రీతిగా పాత్రోచిత ఛందస్సులో చెప్పించాను" అంటున్నాడు. ఆరుద్ర సంప్రదాయాల్ని ఛిద్రం చేయడమయితే సులువుగా చేశాడు కాని మరో సంప్రదాయాన్ని నిర్మించలేదు. తాను వాడిన "కవిత్వ హ్రస్వలిపి" బోధపరుచుకో గలిగితే, త్వమేవాఽహం" బోధపడగలదు. కాని ఈ హ్రస్వలిపిని బోధపరచుకోవడ మెట్లాగన్నదే చిక్కు. దీనికి పూర్వాపరాలు లేకపోయినందు చేత, యిది దురవగ్రాహ్య మవుతూంది. అదిన్నీ గాక యింగ్లీషు - తెలుగు పద సాంకర్య బాహుళ్యంవల్ల ఆరుద్ర కొని తెచ్చిన తిరుగుబాటు పఠితృలోకంలో ఆమోదం పొందలేక పోయింది, నన్నయ భట్టు సంస్కృత క్రియాధాతువులను తెచ్చి కొద్ది మార్పులతో వాటికి తెలుగుదనం ఆపాదించగా తప్పు గానిది, తాను యింగ్లీషు నుండి తెచ్చి కల్పిస్తే తప్పేమిటని ఆరుద్రగారు అడుగుతున్నారు. సంస్కృత మొకప్పుడెప్పుడో తెలుగుకు పరభాష అయవుండిందేమోగాని పోను పోను అది యావద్భారత కావ్యభాష అయింది. హిందూ మతంతోటి, మహాసామ్రాజ్యాలతోటి అది అల్లుకొని పెనవేసుకొని పోయింది. దేశభాషల ఆత్మ స్వరూపానికి అది ఎంత హాని చేసిందో, అంత సంపన్నమయమూ చేసింది. తెలుగు కన్నతల్లి అయితే సంస్కృతం సవతితల్లి అయింది. కాని ఇంగ్లీషుకూ తెలుగుకూ రాశికీ దాసికీ వున్న సంబంధమే ఎక్కువ కాని ఆత్మీయ భావ మెందునా లేదు. కాబట్టి ఆరుద్రగారి సమర్థన సమంజస మనిపించదు. "ఏంగ్జయిటీ", "కన్ ఫ్యూఝన్," "రాస్కెలుడు," "రనండి," "టూవేస్విచ్" వంటివి వర్తమాన నాగరకతా స్ఫోరకాలేమో కావచ్చు కాని అవి ఆంధ్ర జాతీయ సంస్కృతీ సంప్రదాయ విచ్ఛేదకాలైన ప్రయోగాలు మట్టుకు నిస్సందేహంగా అవును. వైచిత్రియే సౌందర్య మనుకొని చిత్రవిచిత్రగతు లన్వేషించితే ఫలితం వైచిత్రికాదు - భాషా సంప్రదాయ వికృతి. అంతే కాదు. అభివాస్తవిక కవితారంభరులలో ఒకరైన ఆరుద్రగారికి ఆవాసనలు పూర్తిగ పోలేదు. ఒకదానితో మరొకదానికి సంబంధంలేని ఆలోచనలు అరాచకంగా ఎగబడి కాగితాలమీదికి ఎక్కినవి.

"చెట్లు చిట్టెలుకలు
కాకిమెడ నుసిరంగు
స్నో తెలుపు ద్యూ తెలుపు
చెట్లు చిట్టెలుకలు
చిన్న చిన్న చీమలు..."

"చెయిర్సులేని మగాళ్ళముందు నిటారుగా నించొని తనబట్టలు నింపాదిగా తాపీగా ఒలచుకొని, నిస్సిగ్గుగానిలుచునే", నీతిమంతురాలివలెనే యీ ఆలోచనలు కూడ నీతినిపాటించవు.

ఆరుద్ర చాల శక్తివంతుడైనభావుకుడు విమర్శదృష్టి సంపాదించిన మేధావి, వక్రోక్తి పరతలో మహాసమర్థుడు. కాని యీగుణాలన్నీ పెడత్రోవలు పట్టాయి. రాజకీయ వైయాకరణివలన పరిష్కారం వైకల్పికమయినందుచేత, గణితం సమస్యాపరిష్కారానికి పనికిరాగలదంటూ, పైథాగొరాస్

త్రికంద్వారా మార్క్సువాదాన్ని నిరూపిస్తాడు. "బలవంతమైన సర్పము చలిచీమలచేతజిక్కి చావదె" అనేనీతినితీసుకొని, ఆశారేఖాగణితం ప్రకారం ఒక త్రికోణాకృతిని నిర్మించి, అడుగుభుజం చలిచీమల వంటి, సంఘానికి పునాది అయిన, సమస్తాన్నీ వుత్పత్తిచేసే, సాదా మనుషులని, ఈ వుత్పత్తిమీద ఆధారపడి సర్పాలవంటి దోపిడీవర్గాలు వున్నాయని, ఇది లంబమని, ఉత్పత్తిచేసేవారు, ఫలితాలు దోచేవారు అనే యీ రెండు భుజాల సంఘర్షణవలన యేర్పడే ఫలితం యీభుజాల కర్ణంమీది చతురస్రమవుతుందని అంటాడు. ఇక్కడ గతితార్కికవాదాన్ని చేబూని, Thesis, Antithesis ల సంఘర్షణ ఫలితంగా "నూతన అవస్థ", "పునీతవ్యవస్థ", Synthesis కాబోతుందని "సింథటిక్ చింతను ధరించిన" యీకవి అంటున్నాడు. ఈ విధంగా, ఆరుద్ర, శ్రీ శ్రీ అన్నట్లు, మన ఆలోచనా విధానాలను సామ్యవాదానికి అనుకూలంగా మారుస్తున్నాడు. కాని అతని బోధనామార్గం చాల బాధాకరమయినది. ఆరుద్రగారి ఆశయాల నిజాయితీని ఎవ్వరూ శంకించరు కాని అతను చెప్పేతీరు సామాన్యులకు బోధపడలేదు. ఆరుద్రకు హృదయానికంటె మేధస్సుతో ఎక్కువపని. కాని కవిత్వానికి హృదయంతోటె ఎక్కువపని. కవికోకిల రామిరెడ్డి అన్నట్లు, Heart (హృదయం) అంటే His Excellency Art. ఇది వేళాకోళంగా త్రోసిపారేయవలసిన కవిత్వం కాదన్నప్పుడు శ్రీశ్రీతో ఏకీభవించవచ్చును. కాని ... "రీతివాదులు (ఫార్మలిస్టులు) టెక్నిక్‌లేని కవిత్వాన్ని ఊహించలేమంటూ- టెక్నిక్‌నీ కవిత్వాన్నీ రెండుగా విడదీస్తూ - టెక్నిక్ పేర పాఠకుణ్ని దిగ్భ్రమలో ముంచే సాముగరిడీలు చేస్తూ-అభ్యుదయ కవిత్వంలో రామరాజ భూషణుణ్ణీ జేమ్సుజాయిస్‌నీ పునఃప్రతిష్ఠాపిస్తూ - అర్థప్రేరణ చేయనిమాటల కూర్పుతో కవిత్వాన్ని నింపడంవల్ల వీరుకూడా కవిత్వం సాధించే ఉత్తమ ప్రయోజనానికి దూరమయ్యారు," అన్న సోమసుందర్‌తోకూడ ఏకీభవించకుండ వుండలేము. నిష్ప్రయోజకాలు అనర్థదాయకాలు అయిన యీ విచిత్ర ధోరణులు ఎవ్వరి ఆమోదాన్ని పొందలేకపోయినా, ఆరుద్రగారు "జీర్ణమంగేసుభాషితమ్" కంటె సేయు సంపుటులలో వాటిని అంటిపెట్టుకొనే వున్నారు.

"అఇ ఉణ్ ఋ ఌక్
అందమే హత భుక్
క ఖ గ ఘ ఙ
కష్టాలకు సంజ్ఞ
చ ఛ జ ఝ ఞ
చావుకు అనుజ్ఞ ..."
"ఎన్నాళ్ళు?" వెంటతరమగా
"ఇంకా నా?" ఒళ్ళుతురుమగా
"ఎక్కడలు" వర్షించి
"ఎప్పుడులు" దట్టించి
"ఎందుకులు" రట్టించి..."

ఇటువంటివి తాను చెప్పదలచుకొన్నదానికి సహాయకాలు వాహకాలు కాకపోగా ప్రతిబంధాలౌతాయి. కాని వాటిమీదనే ఆయన మోజు. ముఖ్య విషయాలను తేలికదనం ఆసాదిస్తాయి. చమత్కారాలలో అసలు బోధ లోనగారిపోతుంది. వికటధోరణులే కళ్ళను, చెవులను కొట్టవస్తాయి కాని లోపల హృదయమార్దవం ఆవేశతీవ్రత బయల్పడవు.

ఆరుద్ర తర్వాత ఎన్నదగిన అభ్యుదయ కవి సోమసుందర్. ఆయన "వజ్రాయుధం", "కాహళి", "గోదావరిజల ప్రళయం" వంటి కావ్య సంపుటులు వ్రాశారు. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి సచ్ఛాత్రు డయినందుచేతనూ, పుట్టుకతోటి హృదయమార్దవం కలవా డయినందుచేతనూ, భావకవిత్వ పాఠశాలనుండి నేరుగా అభ్యుదయ కవిత్వలోకంలోకి దూకిపడినందుచేతనూ, యితని కవిత్వంలో రెండు ధోరణులు కౌగలించుకొని వుంటాయి. "హేతుబద్ధాలుకాని అరాచక పితూరీల నొల్లని సోమసుందర్ మన అనూన ప్రజాతంత్ర సాహిత్య సంప్రదాయాన్ని - ధూర్జటి, పోతన, భర్తృహరి, శ్రీనాథాదులు కొనసాగించిన దానిని - గౌరవిస్తాడు. పచ్చి రాజకీయ నినాదాలబోర్డులవంటి "ప్రజా" కవిత్వంపేర చలామణీ అయ్యే ప్రచార సాహిత్యాన్నిగాని, రాజకీయాలను ముట్టుకొంటేనే కావ్యకన్య మైలపడుతుందనే "నిరంజన కళావాదాన్ని" కాని ఆయన ఒప్పుకోరు. పోగా, ఈ రెండుకోణాలకు భిన్నమై, సమన్వయాన్నైన మధ్యేమార్గ మొకటున్నదని, అదే కవిత్వమని ఈ రెండు ధోరణులూ విస్మరిస్తున్నాయి. కనుకనే వీరి ధోరణులవల్ల అనుస్యూతమైన మన కవితా సంప్రదాయం ఆచరణలో భగ్నమవుతున్నది; హృదయ సంబంధిగా మానవ రసావేశ ప్రేరేపకంగా ఉండాల్సిన పరమ ప్రయోజనం భంగపడుతున్నది", అని తన దృష్టిని వివరించాడు. ఇవి కాగితంమీదికి ఎక్కాయికూడ. "అలంకారాలు, కవిసమయాలు, సాంకేతికాలు, రాయప్రోలు, బసవరాజుల ధోరణులు కన్పిస్తూ, ఇతని రచనలు భావకవిత్వానికీ, అభ్యుదయ ధోరణికీ వంతెన వేస్తున్నవా అనిపిస్తుంది", అని పిల్లలమర్రి హనుమంతరావుగారు వ్రాశారు. ఈ భావకవిత్వావశేషాలుచూచి, సోమసుందర్ "గతకాలపుబూర్జువాభావకవిత్వ ప్రభావాలనుంచి పూర్తిగా బైటపడలే"దని కొందరు విమర్శించారు. ఈ విమర్శ కవికి అన్యాయం చేస్తుంది. భావకవిత్వాన్ని అంతటినీ నిరాకరించడం ఆరోగ్యవంతమైన దృక్పథంకాదు. గోణంకి అప్పలస్వామిగారన్నట్లు, "ప్రకృతిలో గల రామణీయకతను, ప్రణయ మాధుర్యమును, ప్రేమ మహత్తును, భావకవిత్వం రసమయం చేస్తుంది." ఇవేవీ అభ్యుదయ కావ్యవస్తువులుగా వెలికావు. కాని సోమసుందర్ కూడ వీటికి అనుచితమైన ప్రాముఖ్యమేమీ యివ్వలేదు. వర్గసంగ్రామాన్ని, అంతర్జాతీయ కల్లోలాల్నీ, సంఘన్యాయాల్నీ సోమసుందర్ ఎంతో పటుత్వముతోటి చిత్రించాడు. అతని కావ్యాలు కొన్ని పోరాటాలనడుమ చనిపోతున్న ధర్మవీరుల పెదిమలమీద, పోరాటాలకు కదలిపోతున్నవారి జిహ్వాలమీద, తాండవించాయి. కొన్ని కొన్నిపట్ల యితను అసాధ్యమయిన భావాన్ని అతిసులువుతోటి సాధిస్తాడు, కాని మరికొన్నిపట్ల ఆయన ఏరుకొన్న పదాలు, భావభరాలయినప్పటికి, వెగటు పుట్టిస్తాయి. "నీ హృదయం నెత్తురుచిందిన గెడ్డ" వంటిది చెవులను బాధిస్తుంది. "ఒకమెలకువ ఒక్క వెలుగు" హాయిగొల్పుతుంది. "యుగధర్మం చైతన్యం, జనహృదయం పోరాటం;" "నిన్నానేటుల కృషియే రేపై జన్మించుతుంది;" "ఉన్న దొక్క జీవితమే; మానవునిగ, వీరునిగా బ్రతుకుము నరుడా;" "తెలుగుగడ్డకు దీక్ష హేమంతమంతమై, నవ

యుగోజ్జ్వల సౌఖ్యవాసంత మరుదెంచు;" "ఒక వీరుడు మరణిస్తే వేలకొలది ప్రభ వింటురు;" "జనగామలో జమ్మికొమ్మపై కెక్కాడు," అనే చరణాలలో భావ కవిత్వ యుగ ధోరణులను నిలుపుకొని అభ్యుదయ కవిత్వయుగాన్ని సోమసుందర్ ఎట్లా సంపన్నయుంచేశాడో కనుపిస్తుంది. కవులందరూ ఒకే ఒక్క తీరున ఆలోచించడం పడదు. ఎవరిదారి వాదిరి. అప్పుడే కవిత్వం సంపన్నం కాగలదు.

రమణారెడ్డిగారి "అడవి" అసమగ్ర ప్రయత్నం. నడకలో లేడివలె సెలయేటి వలె పరుగిడినా, అతిని గీతాలలో భావాని కంటె పదాలకు ఎక్కువ విలువనిచ్చాడు. కొన్నిచోట్ల యీ పదాల సముదాయం క్రింద భావం నలిగిపోతుంది. భావాలకు పరిస్ఫూర్తకూడ రాలేదు. విప్లవాత్మకమైన సూర్రియలిజాన్ని బౌద్ధమతంతో క్రిస్టియన్ మతంతోటి సమాధానపెట్టబోయినప్పుడు విఫలమనోరథుడయ్యాడు. ఈ లోపాలు ముఖ్యంగా "ధ్వని"అనే భాగంలో కనుపిస్తాయి. మొదట ఛందోనియమాలను పాటించకపోయినా, పోనుపోను వస్తువుకు అనుగుణమైన కొన్ని నియమాలను పెట్టుకొన ప్రయత్నించేశాడు. వర్తమానకాలమందు మానవజీవితం అరణ్యప్రాయంగా వుంటున్నందుచేతనే యీ కావ్యసంపుటికి పెట్టినపేరు సార్థకమయింది. "అడవి"అనే భాగంలో అతను వ్రాసినగేయాలు ఫరవాలేదు. మొత్తంమీద యీకావ్యసంపుటిలో రమణారెడ్డి శబ్దముగ్ధుడుగానూ, గాఢవర్ణ సమ్మోహితుడుగాను, గాంభీర్య దూరుడుగాను, దంభపదప్రియుడుగాను కనుపిస్తాడు. శబ్దమూ, వర్ణమూ, దంభమూ విడిచిపెట్టక, వాటికి జతగా లోపించినట్టి నిర్మాణ గాంభీర్యగుణాలకొరకు యిటీవల రచనలలో ప్రయత్నిస్తున్నాడు. ఏప్రయోజనాని కియినాగాని భావమను విశృతంచేయ కూడదంటాడు. కాని పాషాణపాక ప్రభువుకానిష్టంలేదు. నడిమిదారికలదని నమ్ముతాడు. దేశిచ్ఛందోరీతులలో సులభ గ్రాంథికశైలిని అనుసరించి కావ్యాలు వ్రాసేయెడల, పాండిత్య ప్రకర్షకుగాని, శబ్దాడంబరానికిగాని తావుండదంటాడు.

గంగినేని వెంకటేశ్వరరావుగారి "ఉదయిని" వీర విషాద రసోద్రిక్తమైన కావ్య ఖండికా సంపుటి. రమణారెడ్డిగారి "అడవి" భాగంలోను, సోమసుందర్ గారి "వానిసల దండయాత్ర" భాగంలోను, అరుద్రగారి "ప్రవాహదశ" భాగంలోను స్థూలరేఖా చిత్రంగా బయల్పడిన ఆంధ్ర జాతీయ మహాసంగ్రామ కవిత "ఉదయిని"లో ప్రస్ఫుటంగా సూక్ష్మాంశ చిత్రణతోసహా వెలువడుతుంది. రమణారెడ్డిగారు చిత్రించిన "పాశవికరాత్రి" సోమసుందర్ గారిలో "ఒక మెలకువ ఒక్క వెలుగు"గా వేగి, అరుద్రలో కాంతి ప్రవాహ మారంభమవుతుంది. కాని "ఉదయిని"లో రక్తపతాకవలె ఎగిరిన సంగ్రామ భానూదయం నుర్నిరీక్ష్య మధ్యాహ్న వేళామార్తాండమూర్తిగా పరిణమిస్తుంది. అందుచేత "ఉదయిని"ని యీ తరహా కవిత్వానికి శిఖరప్రాయంగా ఎంచవచ్చు. ఆ మహోద్యమంలో కవి స్వయంగా బాధలనుభవించాడు. అదే చాలదు. ఆయన చైతన్యం నిరుపమానమైనది. చిత్రణాశక్తి అపారమైనది. గుండెలు ఘూర్ణిల్లేటట్లుగా, నయనాలు జలపాతాలయ్యేటట్లుగా, ప్రతీకారదీక్ష గర్జించేటట్లుగా పాఠకులను చలింపజేయగల శక్తివుంది. ఈ ఫలితం సాధించేందుకు

కవి వుపయోగించిన సాధనాలు ఆంధ్ర కవిత్వంలో అపూర్వాలని చెప్పవచ్చును. గంగినేని చేసిన నూత్న ప్రయోగాలు ప్రయోగస్థాయి దాటి సఫలాలైనవి. "ప్రియుడు ప్రియురాలికి," "తల్లి తనయునికి, బహిరంగలేఖలు", వంటిచోట్ల యీ క్రొత్త తెన్నులు కనపిస్తాయి. అంతే కాదు. గంగినేని వాడుకచేసిన అలంకారాలు కూడ అపూర్వమనోహరాలని చెప్పవచ్చు. "హత్యలు అబద్ధాల మధ్య జూలు విప్పే తూరుపుకొండ;" "పగవంటి పులి పంజావంటి ఎండ," "కొరివివంటి ఎర్రని పిడికిలి", "నాకు స్వాగతం చెప్పడానికి పద్నాలుగు ప్రపంచాల్ని పిలిపించు;" "ఎర్రని ఆకలి కడుపులు కప్పుకొని పాడుకొన్నాం;" "చిరిగిన సహోదరీ, చితికిన సహోదరా! సకిలించిన సంగ్రామం, గర్జించిన తుదిసమరం," "పారి పారి కళ్ళు ఎడారులైన చెల్లీ;" "మీ ఆశలు అల్లుకొను మీ గుండెలు నాటండీ! మీ ఆదర్శాలలుముకొను మీ కండలు చల్లండీ;" "ఖడ్గం చొద్దమ్మా ఇవాళ పళ్ళెంలో కిష్టాలు! గ్లాసుతో కన్నీళ్లు," వంటి పదసముచ్చయాలు ఉత్తమ కవితకు ఆలయాలు. కాని గంగినేనిగారు భాషా విషయం ఎక్కువశ్రద్ధ పుచ్చుకొనలేదు. దుష్టసమాసాలు కావ్యంనిండా కనుపిస్తున్నాయి. "హృదంతర గాయాలు," "నిర్మల కన్నీటిధార," "విపరీత తుపాకికాల్పులు," "పాలక ఏలిక," "వాంఛా వరదలు," "పాడి గోమంద," "జీవన వెన్నెల" వంటివి. విసంధులు కూడ చేశారు. "మహాదాదర్శ ఆనతి" వంటివి. కనుక భాష విషయాన తప్ప తక్కిన అన్ని అంగాలలోను పరిపుష్టతవున్న కావ్యాలను గంగినేని సృష్టించాడు.

రెంటాల గోపాలకృష్ణగారి "సంఘర్షణ" లోని భాషాప్రయోగం, ఛందస్సుల పోకడ-వీటిలో ఒకవింత గమనం, ఉద్వేగం, భావౌన్నత్యం కనబడతాయని నారాయణబాబు సరిగా గమనించి చెప్పారు. కొన్ని కొన్నిచోట్ల గోపాలకృష్ణ నియమాలను పాటించి వ్రాసినప్పుడు, కవిత్వం సాఫీగా, సుందరంగా వుంటుంది. ఇతనిలో రాయప్రోలూ, అనిసెట్టీ ప్రభావాలు కనిపిస్తాయి. కాని పోనుపోను సొంతదారిని ఏర్పరచుకొన్నాడు. తన కావ్యమే ఒక కల్చర్; తనగేయం "జడత" మీద పగబట్టిన పెనుసర్పం, "లోకంలో శోకించే పతితుల ప్రాణాలన్నీ నాపాటల వృక్షంపై పక్షులుగా విశ్రమించు" నంటున్నాడు. సత్యాసత్యాలమధ్య అనునిత్యమూ జరుగుతున్న సంఘర్షణలో యీకవికి "సత్యంపతాక" వైపు ఎగబ్రాకుతున్నవి ఇటీవల అతను వ్రాసిన "పల్లకీ బోయీలు", "సర్పయాగం" కావ్యాలు కళాశిఖరాలు.

రాంపా వ్రాసిన "అనంతం" మరొక అభ్యుదయ కావ్యసంపుటి. అనంత చైతన్య స్రవంతికి బద్ధుడై, పూర్వకవి ప్రతిభావిశేషాలకు ముగ్ధుడై తనలో అందుచేతనే దర్పంపెరిగి, అహంకారంతో వ్రాశానని చెప్పుకొన్నాడు. సోమసుందర్ వలే రాంపాకూడ భావకవిత్వయుగప్రభావాలకు లోనైనవాడేకాబట్టి పదాలేమి, బాణీలేమి వాటిని మరపుకుతెస్తాయి. కాని తాను తాడిత, పీడితులకు, కర్షక కార్మికులకు, బానిసలకు 'పాపాత్ము'లకు కవి నంటాడు. "దుర్భర వర్తమానంగల మనకు ఉజ్జ్వల భవిష్యత్తు" వుందంటాడు.

నారపరెడ్డి రామిరెడ్డిగారి "అశ్రుమాల", "నవీన" వంటి కావ్యసంపుటులు స్వయం శక్తితో తొణికిసలాడుతుంటాయి. నాగలిపట్టేవానినుండి సెంట్రల్ స్టేషన్ గడియారాన్ని సరిదిద్దేవానివరకుగల బిచ్చగాళ్ళు, కుష్ఠురోగులు, వంచితులు, అయిన సాదాజనులు యీ కవిద్వారా తమకష్ట నిష్ఠురాలను ఎంతో తేటగాను, సూటిగాను వెలువరిస్తారు. కవి మానసోద్రేకం తెచ్చిపెట్టుకొన్నది కాక సామాన్యులుకూడ అనుభవించగలిగినట్టిది. స్వీకరించిన కావ్యవస్తువూ, చెప్పేతీరూ, జంట నాగుబాములవలె పెనవేసికొని వుంటాయి. రామిరెడ్డి ఎంతటి సున్నితమైన భావాన్ని కూడ తేటతెలుగు మాటలలో సులువుగా వ్యక్తంచేయగల శక్తివంతుడు యీయన సవ్యసాచి. కాని గేయాలకంటె యితనివి ఛందోబద్ధమైన పద్యాలే మరింత హృదయంగమాలు. దైవనిరసనతో మొదలయిన యితని అభ్యుదయ కవిత, దోపిడిగాండ్రను దొరలుగా చిత్రించిన కుకవి నిందకుదిగి, క్రమంగా దేశీయ అంతర్జాతీయ సంఘటనలవైపు మరలుతుంది. రామిరెడ్డి మహా చైతన్యవంతుడు. "ఒంటరిగాను నేను నావెంట నేడు, క్రుద్ధకంకాళములు లేచి కొట్లకొలది, నవ్యజీవన కాంతితో నడచుచుండె, ఏ మహాశక్తి మమ్మెదిరింపగలదు?" అని ధీమాగా నిలచి, "సాగిపోవు జీవధార నానకట్టు లాపలేవు," అనుకొంటాడు. కాని పోనుపోను ఆయనలో అభ్యుదయోద్యమాలపట్ల అపనమ్మకాలు ప్రబలి, కష్టమయమయిన బ్రదుకు వలన నిరాశావాదం హెచ్చి యిటీవల పెడత్రోవలు పట్టడం విచారించదగిన విషయం. "బ్రతుకు వీణనుపట్టి లాగే బాధ పనులకు లొంగకుండా ప్రజలకోసమే పాటుబాడే కవికుమారుల కంజలుల్" ఘటించిన రామిరెడ్డి, "జీవిత పోరాటంలో అలసిపోయాను. ఓడిపోయాను. నా చేతుల్లో ఏమీలేదు. అదెలా లాగితే అలా పోతున్నాను. ముందు తీరమే వుందో సుడిగుండమే వుందో," నని వ్రాశాడు. ఈ నిరాశాంధకారంలో ఆయనకు పూర్వమిత్రులు శత్రువులుగాను, పూర్వశత్రువులు మిత్రులుగాను, జీవితమే మోసపు చదరంగంగాను, రాజకీయాలు పదవుల కొట్లాటలు కులాభిమాన రణరంగాలు గాను, ఉద్యమాలు నాయకత్వపు ప్రాకులాటలు గానూ కనుపిస్తున్నందుకు ఆశ్చర్యపడనక్కరలేదు. తన పాతనీడను చూచి తానే భయపడే అవస్థపట్టింది.

"ఆదర్శపు టాశయాల
ఆవేశపు గమనంలో
నను నేనే మరచిపోయి
సర్వస్వము గోల్పోతిని.

మిగిలిన నా యభిమానము
పలుసంతల పెట్టినాను
కనులెత్తియు చూడరెవరు
కడ కదియును కరగిపోయె.

ఈరాతిరి ఈమబ్బులు
ఈచీకటి చీల్చుకొంచు
వేగుచుక్క వెడలునంచు
నాకెప్పుడు భ్రాంతిలేదు..."

"హసియింపకు మోసి ఉషా
ఉదయింపకుమోయి రవీ!
చీకటిలో శోకంవలె
పడిమూల్గే నా బ్రదుకున
కాంతిజ్వాల విరజిమ్మిన
భరియించే శక్తిలేదు...

జీవన సంగ్రామంలో
అలసిపోయి నిలువలేక
పరాజయము నొప్పలేక
బాధపడే మానవుణ్ణి..."

బాధాకరమయిన యీ నిరాశా లోకం నుండి రామిరెడ్డిగారి కవితా రవి తిరిగి వుదయించే వేళ వస్తుంది. ఎప్పటికీ ఆయనను ఆహ్వానించే సోదరకవుల చేతులు చాపబడే వున్నాయి.

తర్వాత పేర్కొనదగిన అభ్యుదయ కవి 'శశాంక'. ఓలేటి పార్వతీశ్వరంగారి సరసమంజుల కవిత్వ ధోరణులకు పుత్రుడై, సోమసుందర్ రాంపాల అభ్యుదయ కవిత్వ ధోరణులకు మిత్రుడైన శశాంక "నయా జమానా", సంగీతాత్మకమైన గేయాల సంపుటి. తెనుగుల ప్రొద్దుపొడుపును మనోహరంగా వర్ణించాడు. మలయామారుతం యితనిదృష్టి సాగింది. శాంతి కపోతాన్ని చేరబిలిచింది.

"బాధాపరిసర్పిత దేశం
వర్ధమాన కవితావేశం
నవమానవ స్మితసౌందర్యం
కవిశశాంక జీవనగానం"

రంగ కవిగారి "కంకేర గీతాలు" తాజాగా వెలువడిన అభ్యుదయ గేయ సముచ్చయం. భువిలో వెన్నెల నిండుతుందని, ప్రజావాంఛ జయిస్తుందని రంగ కవిగారి నమ్మిక. కవుల కడగండ్లను, ప్రచురణ కర్తలు పెట్టే యిక్కట్టులను చిత్రిస్తాడు. "భోగంలో రాగరసం రగుల్కొల్పు రసరాజు"లైన కవులను హెచ్చరించి, "కనకయుగం అంతరించి కాటకయుగ మొచ్చిందని" తెలియచెప్పి, అవి వేణువుల వేణువులను, కేతకీ సుమసౌరభాన్ని, నులివెచ్చని కౌగిళ్ళను, చిత్రించడం మాని, డ్రైవర్లనూ, ఫోర్మన్లనూ, ట్రెడిల్ మన్లనూ, స్వీపర్లనూ, కండక్టర్లనూ, చెట్టుకింది ప్లీడర్లనూ వంటివారి యథార్థ జీవితాన్ని చిత్రించమంటాడు. భాష విషయం, ఛందస్సు విషయం మరింత శ్రద్ధతీసుకుంటే రంగ కవిగారు అభ్యుదయ కవి ప్రముఖులలో ఒకరయ్యే సూచనలున్నవి.

"శార్వరి" రచించిన "రోదసి"లో కవిత్వముతోటి తత్వమూ, యదార్థ జీవిత చిత్రణతోటి కల్పనాశక్తి పెనవేసికొనిపోయి వున్నవి. శ్రీ శ్రీ ప్రక్క ప్రక్కలనే చలం, మార్క్స్ ప్రక్కన ఫ్రాయిడ్ వలె నిలుస్తాడు. శ్రీ శ్రీలోని ఆరోగ్య అనారోగ్య ధోరణులను రెంటిని శార్వరిగారు స్వీకరించారు. అక్కడక్కడ ఆరుద్రగారి గారడిపనులు రావూరి భరద్వాజగారి కామకళావిలసనాలు. ఎజ్రాపౌండ్ వంటివారిలో శ్రుతిమించిపోయిన వికటధోరణులు కూడ కనుపించక మానవు. ఉదాహరణకు, "అపాయం 3 తుంది", "6 హైట" "7 స్తుంది", "రవ రాంద్రుడు"వంటి ప్రయోగాలలో కవి సాధించినది వైచిత్రి కావచ్చుకాని వికృతి కూడ కాకపోదు. శార్వరిగారు మహా సమాస ప్రియులున్నూ; శబ్దవ్యామోహితులున్నూ: "భూభృద్వ్యధంబుల రోదన, బభ్రుద్ధ్రిధిత్రీ విషాదన, ఘనాఘన ఘుంభిత వియత్తు" వంటివి భాషమీద ప్రభుతను చూపేందుకు మాత్రు, దాని లోపాన్ని చూపుతాయి. "క్షితిలో సంరక్షణశూన్యం, భక్షణలూ శిక్షణలే గతి," "ఆటమ్మిని ధరిత్రీల శామ బూడిదపంట పండిస్తుంది", అని ఒక్కొక్కప్పుడు జెరిమియా ప్రవక్తవలె నిస్పృహతో ఆగామికాలాన్ని చీకటి

పుంతగా చూచినా, శార్వరిగారు సోల్జరుకు యుద్ధాలకు గుడ్‌బై చెప్పమంటారు.

"వేసవిని సైతం కాల్చివేయగల
మంటలు మాలో మండుతోంటె
అయినా మా జీవితాలు
కొత్త చిగుళ్ళు వేస్తాయి తప్పకుండ."

"ఉదయ కిరణాలు" అనే పేరుతో యిటీవల కళా రవిగారు తమ ఖండకావ్యాలను అచ్చువేశారు. అన్నిటికంటె యితనిలో గణనీయమైన విషయ మేమిటంటే, యితడు ఎవరినీ ఎక్కువగా ప్రతిధ్వనింపడు. తనబాట వేసికొన్నాడు. పూర్వ సాహిత్య పరిచయం వున్నదని ఉపోద్ఘాతం చెప్తున్నది. కాని పదప్రయోగాది విషయాలలో రచయిత యిప్పటికంటె ఎక్కువ శ్రద్ధ తీసుకొనవలసివస్తుంది.

అభ్యుదయ కావ్యాలను ప్రచురించిన వారిలో కొందరి ధోరణులను పరిశీలించాను. ఇంకా పుస్తకరూపంగా కవిత్వాన్ని ప్రచురింపకున్నవారిలో నారపరెడ్డి చంద్రారెడ్డి, వజీర్ రహమాన్, జడ్. వి. సుబ్బారావు, సుభాన్, పూర్ణచంద్రరావు, బాధర్ వంటివా రున్నారు. వారి రచనలు చాలకాలంనుండి పత్రికలలో అచ్చు అవుతున్నాయి. చంద్రారెడ్డి, వజీర్ రహమాన్ బహుభాషా పరిచయ మున్నందుచేత, తమ కావ్యధోరణులను సంపన్నం కావించుకొంటున్నారు.

ఒకటి రెండు పాటలుమట్టుకే ప్రచురించి వాటితోనే స్థిరపడిపోయిన ప్రఖ్యాతి గలవారిలో పి. వి. శివయ్యగారిని, వేములపల్లి శ్రీకృష్ణగారిని, కొండేపూడిని పేర్కొనాలి. "శాతవాహన తెలుగు చక్రవర్తుల శౌర్య ధైర్య" ప్రశస్తితో మొదలై, కన్నెగంటి హనుమంతు ప్రాణార్పణ వరకు, చంద్రవంక ఎత్తిపోతలతో సంబంధించిన వీరయుద్ధ చిత్రణమీదుగా కొనసాగిన పలనాటి గీతాన్ని ప్రసాదించినందుకు పండిత పామరులందరూ ఉద్రిక్తులు కాగలిగిన పాండిత్యప్రకర్షతో వీరకథాకథన ధోరణిని జతచేర్చినందుకు శివయ్యగారికి దేశం ఋణపడివుంది. యుద్ధరంగంనుండి తిరిగి తల్లి ఒడిలోకి వస్తున్న భారతీయ సైనికుడి ఎదలోతులను తడిమిచూచే మరొక గీతంకూడ వ్రాశాడు. ఇదే విధంగా వేములపల్లి శ్రీకృష్ణగారి "తెలుగోడా" జాతికి ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించి వుత్తేజిత మొనర్చిన ఉత్తమకావ్యం.

చదలవాడ పిచ్చయగారి "ఆకలిగీతాలు", వట్టికొండ రంగయ్యగారి "విప్లవ గీతాలు" మరికొన్ని ప్రచురిత అభ్యుదయకావ్య సంపుటాలు కథకులుగా ప్రఖ్యాతులైన అవసరాల సూర్యారావుగారు వ్రాసిన పాటలలో ఉద్రేకమూ, ఆవేదనా అడుగడుగున ద్యోతకమౌతాయి. తుమ్మల వెంకటరామయ్యగారు ఏన్నో ఏళ్ళనుండి సాహిత్యవ్యవసాయం చేస్తున్నారు. చిన్ననాడే యిందులో ప్రవేశించారు. ఇటీవల ఆయన వ్రాసిన ఒకగీతం "తల్లి కన్నీరదేల?" అనేది బహుళ ప్రచారాన్ని పొంది, విదేశాలకుకూడ వ్యాపించింది: అవసరాల, తుమ్మల మొదలైనవారి గీతాలు సంపుటీకరించి ప్రకటిస్తే అభ్యుదయకవిత్వ గ్రంథంలో మరొక మెరుగు పుట ఆవిష్కరింప బడుతుంది.

నాళ్ల చిరంజీవిగారి "విప్లవాత్మ" నయాగరా కావ్యసంపుటి మడిమలు త్రొక్కుకుంటూ వచ్చినది. ఇప్పుడాయనలో ప్రస్ఫుటంగా కనుపించే సారళ్య సౌందర్య చిత్రణాశక్తికి నాడే బీజం పడింది. కొన్ని

గీతాలీయనవి గ్రామీణ జీవితాన్ని చిత్రం చేవి అన్నీ యింకా వెలుగు చూడలేదు. "మా వూరు" అనే పెద్దగేయం కూడ వెలుం వడలేదు చిరంజీవిగారు యిటీవల కాలంలో తమ శక్తులనన్నిటినీ బాలసాహిత్య సృష్టి మీద కేంద్రీకరించారు.

తెన్నేటి సూరిగారి "అరుణరేఖలు" కొంతకాలం క్రితమే వెలువడిన మరొక అభ్యుదయ కావ్యసంపుటి. పాండితీ ప్రకర్షతోపాటు సూరిగారు మనస్సులను కల్లోలపరచగల విప్లవ కవిత్వ ధోరణులను కూడ ఆయన తనలో లీన పరచుకొన్నాడు. సుంకర సత్యనారాయణ గారు కూడ కొన్ని చాల పటుతరాలైన గేయాలను వ్రాశారు. ఇటీవల కాటమంచి వెంకటేశ్వరరావుగారు రెండు మూడు కావ్యసంపుటులు ప్రకటించారు. వాటిలో ఆత్మపరత, ఆవేశపరత, వితండతర్కమో అతిశయించి, గుణాలు ముదిరితే అవగుణా లయ్యేటట్లుగా, కావ్యోత్కృష్ట గుణాలు కాస్త దెబ్బతిన్నాయి. కుండ బద్దలుకొట్టి నట్లు చెప్పడం కావ్యాలలో వీలుపడదు. వ్యంగోక్తి, వక్రోక్తి అవసరాలని గ్రహిం చాలి. లేకుంటే కావ్యాలలో కళ క్షీణించి, ప్రచారం అతిశయిస్తుంది. రాంభొట్ల కృష్ణ మూర్తిగారి "శశవిషాణం"లో వ్యంగ్య కవిత్వం ప్రప్రథమంగా గ్రంథస్థమైంది.

ఈ విధంగా అభ్యుదయ కవిత్వం దిన దిన ప్రవర్ధమవుతూవున్నది. యువకవులు కళాశిఖరాలకు యింకా చాల దూరంలోనే వున్నారు. విచ్ఛిన్నకరాలైన ధోరణులు యింకా పూర్తిగా చనిపోలేదు. ఈ లోపా లను దృష్టిలో పెట్టుకొని, అభ్యుదయ కవులు నిరంతరకృషి చేసి, అభ్యుదయ కవి త్వానికి దేశంలో ఆదరణతోపాటు మాన్య తను లభింపచేస్తారని నమ్ముతున్నాను.

## వ్యాసకర్తమనవి :

ఈ వ్యాసంలో తెలంగాణంలో వెల్లి విరిసిన అభ్యుదయ కవిత్వాన్ని సమీక్ష చేయలేను. కారణం, ఆ గ్రంథాలు నాకు లభించలేదు. మరొకసారి సమగ్రంగా దానిని గురించి వ్రాస్తాను.

—రమణారెడ్డి.



# అభ్యుదయ సాహిత్యమూ - - జానపద సాహిత్య రీతులు

సోమసుందర్

తెలుగునాట సుమారు పది శతాబ్దాలనుంచి మార్గకవితారీతి సింహాసనస్థితి ననుభవిస్తున్నప్పటికీ - ప్రజల జీవనలహరిలో నవనవోన్మిషితమై రససిద్ధి పొందుతున్న దేశి కవితారీతిమాత్రం అవిరామంగా - అనుస్యూతంగా - అజరామరంగా పరిఢవిల్లుతూనేవున్నది. ముఖ్యంగా జానపదులు, నిరక్షరాస్యులైనప్పటికీ నీరసులుకాక-సజీవోల్లాసంతో తులతూగే జానపదుల మానస సరోవరాలలో ఈ దేశి కవితా పద్మం - శతపత్రశోభతో విరాజిల్లుతూ మనయుగం వరకూ వర్థిల్లినది.

చరిత్రలో మానవజాతికిఆసన్నమైన ప్రతివిపత్కర సన్నివేశాన్నీ, ప్రతి ఆనందతరంగాన్నీ, ప్రతి ప్రేమానుభూతినీ, ప్రతి ద్వేషానల జ్వాలనీ-తనలో సమైక్య మొనర్చుకొని, అవిభాజ్యంగా మన కాలం వరకూ ఈ దేశి కవితాఫణితి మోసుకు వస్తూనేవున్నది.

పరదాస్య భారంతో కృంగిన మనజాతి తన విశీర్ణహృదయంలో నవచేతనాశక్తుల పుంజుకొని పునరుజ్జీవన శోభల నందుకొంటున్న తొలివేకువలో మన తెలుగుల దేశి సంపదపై మేధోజీవుల ప్రసన్నదృష్టి లగ్నమైంది. తత్పూర్వ యుగంలో కేవలం ప్రబంధపరమేశ్వరుల రాజరికంలో - తప్పిజారి ఒకరో యిద్దరో దేశికవితా ఫణితులను తమ కవితా సృజనలో స్వీకరించినప్పటికీ - విశేషించిన దేశికవితా ఫణితులను, దేశి సారస్వతానికి కేవలగ్రామీణుల రసనాలే నివాస క్షేత్రాలయ్యాయి. ముఖ్యంగా తెలుగుల పూర్వపుణ్యాంవల్ల లభించిన పాల్కురికి సోమకవీంద్రుని వల్లనో, శ్రీనాథ కవితాసనాథుల వల్లనో, జానపద కవితాకృతికి

ఉన్నతాసన ప్రాప్తి కలిగినా - తదుపరి వచ్చిన తెలుగు ప్రబంధ యుగం - దేశిసారస్వతానికి ఉచితాసనాన్ని సమకూర్చలేదు. దానితో శిష్టజనుల-పండిత ప్రకాండుల మార్గ కావ్య రీతులకు భిన్నమైన నిసర్గసుందరిగా - కేవల గ్రామీణమైన భూగంధ సంభరితమైన కొండొక ప్రత్యేక స్రవంతిగా ప్రవహించ జొచ్చింది. మధ్య యుగాలనాటి సర్వకళలకూ మతమే సర్వాశ్రయం కనుక - దేశికవితా స్రవంతికూడా తదావలంబనంతోనే బ్రతకవలసి వచ్చింది. ముఖ్యంగా దేశికవితారీతులకే అగ్రతాంబూలమిచ్చిన తాళ్ళపాకం అన్నమాచార్యులవంటి భక్తకవులు లక్షలాదిగా గేయములను రచించారు. ఈ జానపద గీతాలలోగల జోల పాటలు, గొబ్బి పదాలు, కోలాట కీర్తనల వంటి వెన్నో రూపాలు సజీవంగా పోషింపబడినవి. అన్నమాచార్యుల తదుపరివచ్చిన క్షేత్రయ్య కాని, దాక్షిణాత్యసారంగపాణి కాని దాక్షిణాత్య భారత హృదయాన్ని కలకాలంగా పరిపాలించుచున్న త్యాగబ్రహ్మగాని స్వీకరించిన కవితారూపం జానపద కవితా ఫణితి యే! తదనుయాయులైన కంచర్ల గోపన్ననుంచి, ఎడ్ల రామదాసు వరకూ గల భక్తకవులు గాని, పోతులూరి వీరబ్రహ్మం నుంచి - 'ఏకులమని నన్నెవ్వరడిగితే యేమని చెప్పుదు లోకులకూ పలుగాకులకూ, అని గొంతెత్తి పలవించి దుర్భరమైన కులమాధ్యాలపై తిరుగుబాటు ప్రకటించిన దూదేకుల సిద్ధయ్యావరకూ గల జానపదతత్వ కవులు గాని స్వీకరించిన కవితాఫణితులు జానపద సారస్వతానికి మకుటాయమానములు కానటంలో సందేహమేముంది?

కరుణాప్లుతమైన గాథలతోనూ, కేవల స్త్రీ సంబంధమైన తాత్విక జిజ్ఞాసలతోనూ, ధర్మప్రబోధాలతోనూ నిండి అభ్యుదయ పరంపరాభివృద్ధిపొంది నేటివరకూ తెలుగు పడతుల కెందమ్మి హృదయాలలో మురిపాలు పొందే పాటలు ఎన్నోకదా! శృంగార కరుణరస సంపన్నమైన ఈ పాటకతలేగాక - కేవల వీర, అద్భుత రసనిష్యందాలైన అమరకావ్యాలు జానపదుల నోట ఉద్భూతమై వర్థిల్లిన వెన్ని? శ్రీనాథ మహాకవి

విరచితమై - తెలుగుల మహాభారత మనదగిన పలనాటి వీరచరిత్రతో ప్రారంభమై, కాటమరాజు కథతో పరిణతినంది, పెద బొబ్బిలిరాజు కథతో మహావృక్షమై - పెద్దాపురం కోడిపుంజుల కథతో ఫలోన్ముఖమైన వీరగాథల సాహిత్య సంపద తెలుగుజాతి కెంతటి జీవనోత్సాహాన్ని, రసోల్లాసాన్ని కలిగించలేదు ?

ఈవిధంగా అనంతమై - అజరామరంగా వర్థిల్లిన తెలుగుజాతి అమూల్యసంపద, జానపదుల దేశి సారస్వత విభవం - ఆధునిక యుగంలో సత్ఫలితాల నందించక నిర్జీవమవటం ఎలా సంభవిస్తుంది ? కనుకనే - గత శతాబ్దపు ద్వితీయ భరణంలోనే - భారతజాతి పునరుజ్జీవన కాంతికళిక లాకట్టుకొంటున్న తొలివేకువలోనే - దేశి సారస్వత ఫణితుల కొత్తవెల్లువలో జాతి జనుల హృత్ క్షేత్రలో నవ చైతన్యానికి అంకురార్పణ జరిగింది. నవ్యాంధ్ర సారస్వత పితృపాదులు శ్రీ గురజాడ అప్పారాయ కవీంద్రులు - కేవల ఛందోబద్ధ కవితా వార్థిలోనే బొడ్డుమునకవేసే కవి వృషభుల వ్యర్థప్రయత్నాల నీసడించి - ప్రజల ఉద్యమానికి తెలుగు బావుటానెత్తి - గొంతెత్తి ఆలపించారు; "కొయ్యబొమ్మలమెచ్చు కళ్ళకు కోమలుల సౌరెక్కునా?" అని. తత్పూర్వమే తెలుగుభాషను నాటకోచితభాషగా తయారించే కృషిలో ముందుకుపోతున్న ధర్మవరం కృష్ణమాచార్య కవివరేణ్యులు తమ నాటకాలలో ముఖ్యంగా చిత్రనళీయంవంటి వాసిలో జానుతెనుగురీతులైన షట్పదీవృత్తాలను నిరభ్యంతరంగా వాడి కొత్తగొంతుక నాలపించారు. దేశికవితా సత్సాంప్రదాయానికి వారసురాలుగా ముత్యాలసరం ఉద్భవించింది. కొత్త కవితారీతికి గురజాడ వాల్మీకి నాందిపలికారు. తదాదిగా దేశీయ విముక్తికి సాగిన మహోద్యమావలంబకంగా - దేశి రీతులలో కవితాగానము - ప్రజల వూపిరిని అనుసంధించింది. స్వర్గీయ శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణ, కొండపల్లి జగన్నాథదాసుగార్ల వంటి నిస్వార్థ దేశభక్తులు బద్ధాంజలితో తమకవితా సుమాల నర్పించారు. "మాకొద్దీ తెల్లదొరాతనమూ"వంటి అసంఖ్యాక గీతాలతో గరిమెళ్ళవారు ఎక్కడెక్కడి

తెలుగు హృదయంలోనూ దీపకళి కలు వెలిగించి, దేశమంతటా మహా జ్వాలను లేపేరు. స్వరాజ్య జొబ్బిలి పదంవటి అసంఖ్యాక గేయ సముచ్చయంతో శ్రీ కొండపల్లి దాసుగారు స్వరాజ్యలాల సత్వాన్ని ఉద్దీపింపచేశారు. ఈ విధంగా యెంతమందో ప్రజాకవులకు వీరిరువురూ అగ్రగాములై - మార్గదర్శకులైనారు.

ప్రజా సామాన్యపు స్వాధీన హక్కు భుక్తమైవున్న దేశికవితా ఫణితికి గురజాడతో పునరుజ్జీవనం కలిగి - గరిమెళ్ళాదులతో పెంపు కలిగి విస్మృతినలవర్చుకొన్నప్పటికీ- జానపద కవితారీతిలో ప్రత్యేక సౌకుమార్యంతో విలసిల్లినశృంగార రసప్రధాన ధాతువులను యేర్చి కూర్చుకొని, తదుత్తమ సంప్రదాయావలంబకంగా 'ఎంకి నాయుడు బావల కరుణామయ శృంగార రస కావ్యంగా 'ఎంకిపాట'లను శ్రీ. నండూరి సుబ్బారావుగారు తెలుగు జాతికి ప్రసాదించారు.—

జాతి జీవితంలో కేవల జాతీయ వాంఛతోనే కాలం వెళ్ళబుచ్చితే సర్వసమస్యలూ పరిష్కృతమయ్యే టట్లు కన్పించలేదు. పరదాస్య శృంఖలాలతో జాతిజనుల జీవనాధారాలను కొల్లగొట్టే స్వజాతీయ శనిగ్రహాల ఉనికిపట్లుసైతం పసిగట్టబడుతూ వచ్చినవి. దానితో జాతీయ చైతన్యానికి పరిపుష్టి కూర్చే సాంఘికమైన వర్గచైతన్యమావిర్భవించింది. చైతన్యమంటూ కలగకపోవాలికాని కలిగినదాజీవుణ్ణి నిదురపోనీయదు. అహరహమూ ఎదలో యిల్లు కట్టుకొని హెచ్చరికలరొదతో వేపుకుతింటుంది. కనుకనే తెలుగుజాతి విశ్వమానవ హృద్విపంచికా నిక్వాణానికి తన క్రొంగ్రొత్త శ్రుతుల మేళవించ నారంభించింది. విశ్వం సమరాంగణమై - భూతభుక్తమైపోతున్న సమయంలో సమర ప్రతికూల రుతుపవనంగా ఆంధ్ర దేశంలో కవితావాతూలం వీచ నారంభించింది. తదనుకూలంగానే - భారత దేశంలో ఐక్యభావమే వృద్ధిపొందుతూ వచ్చిన అభ్యుదయకవితోద్యమ శాఖలు తెలుగునాట విస్తరింప చొచ్చినవి...జాతి జనుల జీవన గానలహరులకు క్రొత్తతెరువులేర్పరచబడ్డాయి. ఆ దశలోనే జపాను వ్యతిరేకమైన బుర్రకథలూ, హిట్లరు భాగోతమనేవీధినాటకమూ

వంటి పాత కొత్తల మేళ్కలయిక లుద్భవిల్లినవి. నాటివరకూ తందాన పదాలుగానో, బొబ్బిలి పదాలుగానో చెలామణీ అవుతున్న కవితాఫణతులు, వాద్య విశేష నామాంకములుగా 'బుర్రకథ'లనే క్రొత్త నామాన్ని ధరించాయి. వీథిభాగవతమనే రూపం జనజీవిత జన్యమై పురోపదాశ్రితమై అనంత కాలంనుంచీ అనుస్రుతమవు తున్నదే.

ఈ దశలో శ్రీయుత సుంకర సత్యనారాయణకవి పురోగామి. ఈ జానపద కళాస్వరూప పునః స్వీకార మహోద్యమానికి ఆయన ఆచార్యుడు. వీరు రచించిన 'కష్ట జీవి' అనే బుర్రకథ ముక్కోటి ఆంధ్రులకూ చెవిలో యిల్లు కట్టు కొని జాతి జీవనపరిస్థితులను ప్రబో ధించింది. వీర, కరుణ రససమ్మి శ్రితమైన ఈకథ ఉత్తమకావ్యంగా రూపొందుటవల్లనే తదనుసరణీయ ములైన ఎన్నో బుర్రకథలకు మాతృత్వం నహించి - మన సంస్కృతీ జీవనంలో బుర్రకథల రూపానికి శాశ్వతస్థితిని కల్గించిఁది. కేవల గ్రామీణులకే గాక, నాగరి కులను సైతం ఆనందావేశాలలో ముంచెత్తినది. నిరక్షరాస్యుల నీ కథ రంజింపజేయుడంలో - మన దేశాన సంఘసంస్కరణా పతాక నెత్తిన యుగపురుషులు శ్రీ వీరేశ లింగ మనీషుల దివ్యచరిత్రాన్ని స్వీకరించిన ఈ కవి రెండవకృతి 'వీరేశలింగం' (బుర్రకథ) సర్వే సర్వత్రా ప్రజలందరినీ రంజింప చేసింది. అభిప్రాయ వైరుధ్యాని కెంతటితావు గలిగినవారైనప్పటికీ కూడ, వీరేశలింగం బుర్రకథ విన్న ప్రతివారూ పారవశ్యంలో ఆనంద బాష్పాల నర్పించినవారే! ఈగాథ తరువాత - భారతదేశంలో సాగిన ఖిలాఫత్ ఉద్యమం, గదర్ ఉద్య మము, ఉగ్రవాదుల ఉద్యమంలాంటి అతివాద ఉద్యమాలకు ఆంధ్రుల పవిత్ర సమర్పణగా రూపొందిన అల్లూరి సీతారామరాజు వీరగాథను స్వీకరించి శ్రీ సుంకర రచించిన బుర్రకథ వీరరసోద్దీపకమై - ఉత్సాహజనకమై - కర్తవ్యావేశ భరితమై ప్రజలలో నూతనాను భూతులను కలిగించింది.

తరువాత 'తెలంగాణా' అన్న వారి బుర్రకథకూడా తత్పూర్వ కథల కీడుజోడై రససంపుల్లమై నదే! అయితే దానిలో ఒక దశ

చరమాంకంలో పడింది. జాతి యావత్తూ కర్కశమైన నిర్బంధానికి గురైంది. ఆంధ్రుల నవ సంస్కృతీరూపాలు వికారమేఘాచ్ఛాదితములయ్యాయి...(శ్రీ సుంకర సత్యనారాయణ రచించిన యీ 'బుర్రకథల'నే పునరుద్ధరింపబడిన ప్రజలదైన పాత దేశిసారస్వతరూపం జయప్రదం కావడంతోనే ఆంధ్ర దేశంలో సర్వే సర్వత్రా ఎన్నెన్ని బుర్రకథలు-జనించాయి. ఎందరో కవులు కొత్త వుత్సాహంతో కలాలు సారించారు. ఆఖరికి ఆంగ్లేయ ప్రభుత్వ మేర్పరచిన యుద్ధ ప్రచారశాఖ (War propaganda dep) సైతం - (శ్రీ జాషువా కవివంటివారి యాజమాన్యాన బుర్రకథలవంటి ప్రజా కళారూపాలను స్వీకరించి తమ ప్రచార సాధనాలుగా మార్చుకో నారంభిచారు. అంతేగాక - యీ బుర్రకథరూపం కలిగించే అనల్ప ప్రభావానికి చకితులైన ఆలిండియా రేడియో శాఖవారుసైతం తమకు గల పరిధిలో అభ్యంతరంలేని బుర్రకథలను ప్రసారంచేయ నారంభించారు. అంతకు పూర్వమే ఎందరో యువకులు - కేవలం భూదేవి బిడ్డలు - ఉత్తమ కళాకారులుగా ప్రకాశించ నారంభించారు. అట్టివారిలో అగ్రగామిగా విఖ్యాతి నందిన వర్ధమానుడు నాజర్ ! మూడక్షరాల బుడత నామధేయుడైన యీ నాజర్ - యావదాంధ్ర ప్రజా హృదయాన్నే గాక, భారత మేధావుల హృదయాన్నీ-తదాది ప్రపంచప్రజాకళాభిమానుల అసంఖ్యాక హృదయాలను సైతం అచిరకాలంలో చూరగొన్నారు. అంతేగాక - కేవలం బుర్రకథలో ముఖ్య గాయకునిగా జీవితం ప్రారంభించిన యీతడు, అనతికాలంలో తానే ఒక కొంగ్రొత్త బుర్రకథకు సృష్టికర్తయై విజయంపొందారు. ముఖ్యంగా అతను రచించిన 'బెంగాల్ కరవు' గత శతాబ్దపు వైజ్ఞానిక చరిత్రలో ఆణిముత్యంగా అలరారినది. ఆ కథలో ఆతడు గొంతెత్తి గానంచేస్తే "వెళ్ళిపోదామా-మామా !" అనే గీతం శోకరసానికి పరాకాష్ఠ! ఈ గీతాన్ని రచించినవారు శ్రీ కొనకళ్ళ వెంకటరత్నంగారు.

శ్రీ కొనకళ్ళ - పునరుజ్జీవిత జానపద కవితా స్రష్టలలో విశిష్టమైనవారు. స్వతహాగా వీరు (శ్రీ

నండూరి సుబ్బారావుగారు నిర్మించిన కరుణామయమైన అమలిన శృంగార కవితా సాంప్రదాయానికి చెందినవారే అయినప్పటికి - ప్రజా వాంఛితాలయెడల భక్తిశ్రద్ధలు కలకొత్తభావాల అలజడితో కొంత కొత్తశక్తిని పుంజుకున్నవారే! కనుకనే వీరు - ప్రజా జీవితమందలి ప్రేమేతివృత్తాన్నిమాత్రమే కాక, జీవితాంతర్వాహినిగా వున్న ఆశాభావాన్నీ - శ్రమైక జీవనుల ఊర్పుల సంబాళింపులో గల శ్రమోపశమన లక్షణాన్నీ తమ కవితా వస్తువులుగా స్వీకరించి, మహాకావ్యా లనదగిన గీతాలను రచించారు. ముఖ్యంగా వీరి;

"హైలస్సో - లాగరా...
హైలస్సో లాగరా!
రోడ్డురోలరు ముందడుగై
సాగరా!"

వంటి గేయాలు గణనీయాలు. వీరి గేయాలు కొన్ని 'ప్రవోళి' అనే చిన్న పుస్తకంగా ప్రచురితమైనప్పటికీ గ్రంథస్థ గౌరవమందవలసిన సుందరగీతా లెన్నో వున్నాయి.

ఒకసారి - వికారంగా నల్లగా వ్యాపించిన మేఘం భూమిని ఆచ్ఛాదించినదంటే - ఫలితాలను వికృతంగా విడువక తప్పుతుందా? కనుకనే ఏతత్ వికృత ఫలితాల ప్రతిబింబంగానే శ్రీ సుంకర రచితమైన 'అమరజీవి' వెలువడింది. ఈసందర్భంలో యించుమించుగా అమరజీవి బుర్రకథకు సమకాలీనములైన - 'కూలీ' - కన్న కూతురు అన్న శ్రీ పి. లక్ష్మీకాంత మోహన్‌గారి బుర్రకథలూ, శ్రీ నార్ల చిరంజీవిగారి కోటిరెడ్డి కథ సైతం గణనీయములే! ఇక పోతే గత సంవత్సరంలో ప్రచురింపబడిన శ్రీ సుంకర రచితమైన రుద్రమదేవికథ ఉత్తమ శ్రేణిలోకి చెందినది. ఇందులో అందందు సుందరమైన కీర్తనలు, దరువులు, తందాన వరుసలూ వున్నప్పటికీ - ఇందలి కథనంలో నాటకీయత కల్గిన గద్యమే యెక్కువగా వాడబడ్డం విశేషం!

ఉత్తమ ప్రజాకళా స్వరూపంగా రూపొందిన యీ 'బుర్రకథ' సవిధానంలో ఎందరో రచయితలు ఉత్తమ కథలను రచించారు. అట్టి వారిలో ముఖ్యులు శ్రీయుతులు జంపన చంద్రశేఖరరావు, సూరిశెట్టి సాంబశివరావు శాస్త్రి ముఖ్యగు

వారు గణనీయులు. ముఖ్యంగా బోసు జీవితం- గాంధీ జీవితచరిత్ర, ఆంధ్రకేసరి, మున్నగునవి ఖ్యాతి పొందాయి. అంతేగాక 1951, 52 సం॥రాలలో మన ఆంధ్రశ్రీశరీరంలో ప్రముఖభాగమైన రాయల సీమగడ్డలో క్షామం స్వైరవిహారం చేసి భయంకరంగా తిని వేయ నారంభించిన దశలో - ఒకప్పుడు బెంగాల్ కరువుకే హృదయ మర్పించిన నాజర్‌వంటి కళాశీలురు చేతులు ముడుచుకొని కూర్చోగలరని నమ్మడం ఎలాగ? కనుకనే-నాజర్ 'నేటి రాయల సీమ'-అనే చక్కని బుర్రకథ రచించారు. ఈ కథ ఎంతో కరుణార్ద్రంగా-అచ్చటి భీకర సన్నివేశాలను కన్నులకు హత్తునట్లుగా చిత్రించబడి ఉత్తమశ్రేణిక చెందుతుంది.

జాతీయ చైతన్యంలో ఒక భాగంగా అభివృద్ధి పొందుతూ వచ్చిన ఆంధ్రుల ప్రత్యేక రాష్ట్ర వాంఛ నలభైసంవత్సరాల ఆందోళనా చరిత్ర కలిగినదైనప్పటికీ నీరుకారిపో నారంభించింది. అట్టి అవసరాన ఆంధ్రజాతి నోముల పంటగా ఆవిర్భవించిన త్యాగమూర్తి, శ్రీ పొట్టి శ్రీరాములు తన ప్రాణత్యాగనిరతితో-తత్ఫలితమైన ఆంధ్రయువలోకపు అచంచల కార్యదీక్షతో వచ్చిన నవచైతన్య ఫలితమై ఆంధ్రుల కోర్కె ఈడేరినది. అయితే చరిత్రలో తన నామాక్షరాల వజ్రకాంతు లాపాదించుకొన్న ఆ మహావీరుని త్యాగం కవితావస్తువు కావటంలో ఆశ్చర్యంలేదు. ఎందరో కవులు కావ్యాలు రాశారు. ప్రబంధాలు చెప్పారు. చాటువు లల్లారు. ఎన్ని చేసినా శిష్టకవితాస్వరూపాలే కదా! జానపద కవితారీతులు రావద్దా? వచ్చినవో-సత్కృత్తు! ఒక ప్రబల హస్తం అలాంటి కవితాఫణితిని ప్రసాదించవద్దా?— కనుకనే - ఈ చారిత్రక ప్రేరణవల్లనే పదుగురు కవులు - కొందరు అతి నవ్యకవులుకూడ పొట్టి శ్రీరాములు జీవితానుసరణంగా బుర్రకథలు రచించారు. అన్ని ప్రాంతాలలోను ఏదో ఒక కథ ప్రచారమవుతూనే వున్నది. ఆ మహాత్యాగి - అమరజీవి - త్యాగనిరతికి ప్రతిమారూ, ఆంధ్రజనత వేడికన్నీటితో శ్రద్ధాంజలిని ఘటియిస్తూనే వున్నది.

జానపద కళారూపాలతో వెలువడినవి కేవలము బుర్రకథలు, వీధి భాగవతములు మాత్రమేకాక - తెలుగునాట ప్రసిద్ధమై వున్న కన్యకాపరమేశ్వరి కథను స్వీకరించి శ్రీ పీసా లక్ష్మణరావుగారు జముకుల కథగా రచించారు. ఇంతేగాక పిచ్చిగుంటల కథలు - కోలాట పాటలు, భజన దరువులవంటి రూపాలను నూత్న కాంతులతో, కొత్త అనుభూతులతో - ఆలోచనలతో పునరుద్ధరించిన యువకవులెందరో వున్నారు. ఈ సాహిత్యమంతా నైమర్శిక దృష్టితో సమగ్రంగా పరిశీలింప బడవలసి వున్నది. అంతేగాక, జానపద సాహిత్యంలో మేల్బంతు లనదగిన 'సైసై చెన్నాపరెడ్డీ', 'ఓ గుజ్జాల గోపిరెడ్డి' వంటి అనేక ఫణితులతో కొత్తపాటలు రచించిన యువ రచయిత లెందరో ఉన్నారు. అట్టి వారిలో ముఖ్యులు శ్రీ కోగంటి గోపాలకృష్ణయ్య, కొత్తపల్లి రంగారావు, పూలకుంట్ల సంజీవులు, గోపాలం ప్రభృతులు ఎన్నదగిన వారు. ముఖ్యంగా '54 లో ప్రచురింపబడిన శశవిషాణ గీతాలసంపుటి అనన్యమైనది. ఈ గీతాలు శ్రీ రాంభట్ల కృష్ణమూర్తిగారు తమకు గల సాహిత్యప్రౌఢిమతో చిత్రలేఖనా నైపుణి మేళవించి పదాలతో చక్కని వ్యంగ్యచిత్రాలను రచించారు. ముఖ్యంగా యీ గేయాలు దేశిఫణితుల నెన్నింటినో ఆకళించుకొన్నవి. ముఖ్యంగా - "వచ్చారయ్యావచ్చారూ, ముగ్గురు మరాఠీ లొచ్చారు; తెలుగునాడు విరిసింది - సిరిసిరిమువ్వా మనకు తొలిదసరా వచ్చింది సిరిసిరి మువ్వా ! - పాండవులు పాండవులు తుమ్మెదా; బతకమ్మ బతకమ్మ ఉయ్యాలో, - అనగా అనగా ముగ్గురు రాజులు - ఒకరికి ఊరూ లేదు !, చిట్టీత పండెరుపు చిలక ముక్కెరుపు -" వంటి చక్కని పాటలు జానపదగేయాల వలెనే లయాన్వితాలే కాక హృదయంగమాలు కూడ !

ఈ విధంగా - జానపద సాహితీ శాఖ అనుస్యూతమైన సత్సాంప్రదాయపు మహాస్రవంతిగా ప్రవహించుతున్నప్పటికీ - యిటీవల కొత్త కాంతి కెరటాల తీపుల్ని స్వాయత్తం చేసుకొని తెలుగునాట వరవళ్ళు త్రొక్కుతున్నది. అయితే ఆంధ్రజాతి దురదృష్టవశాత్తు

ముక్కలై వుండుటవల్ల సర్కారు ప్రాంతపు సాహితీ విభవాన్ని అవలోకించినంతమాత్రాన సంపూర్ణం కానేరదు, ఆంధ్రులలో మూడవ వంతుగావున్న తెలంగాణాంధ్రుల సాహిత్య సంస్కృతీ శాఖలలో ఆంధ్రమాతకు ఎన్నెన్నో అపురూపాలంకారాలు కైసేయబడుతునే వున్నవి. ముఖ్యంగా శ్రీ టి. రామానుజులుగారు రచించిన 'అనాథ' అనే బుర్రకథవంటి దేశి సృజనలు బహుధారామణీయకము లేగాక సంఘ సంస్కరణాభిలాషా సహితములు కూడ. యవ్వనపు మిసిమి విలాసాలలో – నెనరు చూపిన దొంగప్రియుని మాటలు నమ్మి – అతని కోర్కెతీర్చడంతో గర్భవతైె నానాయిక్కట్లకు గురైన ఒక అనాథ జీవితవృత్తాన్ని యిందులో చక్కగా వర్ణించాడు రచయిత.

తెలంగాణమునకు చెందిన ప్రముఖ కవులలో పేరెన్నికగన్న శ్రీ కాళోజీ నారాయణరావుగారు ప్రజాగళస్మరంధ్రస్రోతస్వినులైన జానపదరీతులలో ఎన్నో గీతాలు రచించి జాతి జాగృతికి అపారమైన కృషిసల్పారు. ముఖ్యంగా వారి 'నా గొడవ' అనే గేయసంపుటిలో 'ప్రపంచం, 'లోకం, ఇంకెన్నాళ్లు ?' తీర్పు, మంచిచెడ్డల అడ్డ, దేవత తెలుగని దివ్యానుభవం"వంటి ఎన్నో గేయాలు మంజులమై, లసన్మధురమై, పుడమి పొత్తిళ్ళలో లాలింపబడిన గీతికానిస్వనములై మెరుపు తీగలవలె నవ్యాంధ్ర కవితా విహాయసంలో ఉత్తమ కాంతులందుకొంటున్నవి. ఈ కవి అనవసరపు బెడగులకు పోక, సోకుల పట్టు కుచ్చుల టోపీలు ధరించక, నిష్కల్మష హృదయంతో, నిరంజన కవితావేశంతో, నిస్తుల సారస్వత తేజంతో యెన్నెన్నో గేయాలను రచించిన జానపద కవితాపణితులలో హృద్యంగా సర్వాంగ సుందరంగా ఆధునిక కవితవెలార్చిన వారిలో ఉత్తముడనుటకు సందేహం లేదు. వేయి మాటలకంటె అతని కవితాహృదయాన్ని తనకు తానై చాటగలిగిన దొకే ఒక్క గీతికాశకాలం చాలదా ?

"హద్దుమీరి అంగకారవర్గమూ
ఆడిన ఆటలు చాలింక
రాజుపేరట అరాజకమునకు
జరిగిన పూజలు చాలింక...

రక్కసితనముకు పిశాచవృత్తికి
దొరికిన రక్షణ చాలింక
పాలనపేరిట పల్లెపల్లెలో
జరిగే పాపము చాలింక.
బీదల సర్వస్వముతో ధనికులు
చేసే బేరము చాలింక
దొంగలంత దొరతనముపేరిట
చేసిన దోపిడి చాలింక.

['చాలింక' నుంచి. పుట 26 నాగొడవ.]



# చైనా రచయితల సంఘాధ్యక్షుడు, మావ్ టున్ సందేశం

ప్రియమిత్రులారా !

"ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘపు ఐదవ మహాసభా ప్రారంభ సందర్భంలో, చైనీస్ రచయితలందరు అందచేస్తున్న మనః పూర్వకాభినందనలను దయతో స్వీకరించండి. మీ ప్రజాజీవితంనుండి, ప్రజా పోరాటంనుండి మీరు పుష్టినీ, పోడిమినీ పొంది, సాహిత్యమందు యింకోధిక ప్రముఖ విజయాలను సాధింతురుగాక ! చైనా - భారత స్నేహాన్ని దృఢపరచి అభివృద్ధి పరచుటలో మీ లేఖనులను ఉపయోగిస్తారని దృఢంగా విశ్వసిస్తున్నాం."



# అనంతం ..................

## గంగినేని

రావేల! రావేల!
రావేల చెలికాడ!
రాత్రి వచ్చెనురా!
ఏకాంత కాంతనురా!

రారా! వేవేగ!!
రాగమాలికగా!
అనురాగ వేదికగా!
అపురూప ప్రియా!

ఆనందంరా, అది
జీవిత పర్యాయపదం!
స్వర్గంరా, అది –
మన కలయిక సంకేతం!

రావేల ఈవేళ!!
రాతిగుండెలవాడ!
విరహవేదన నిండి
మండుటెండయ్యాను!
హేమంతఋతువు కప్పరా!
వసంతసంగీతం నింపరా!

రావోయి, రావోయి!
నా హృదయాధి నాథుడా!

విధికత్తుల బావిలో
బందీనయ్యాను! రారా!
వేవేగ నను రక్షింపరా!

గుండెమీది కొండ
దించరావా నేడు!
మనసులోని ముల్లు
తీయరావా నీవు!

రావేల చెలికాడ!
రాత్రి వచ్చెనురా!
హృదయ మాకాశమాయె!
మనసు మల్లెపందిరె! రే
కాంక్ష కడలియై వెన్నుదాకె!
రారా! నక్షత్రమాల తెచ్చా!
రారా! అమృతం వర్షించరా!

రావేమి! రావేమి!
రామచంద్రా నీవు!
కన్నీరు పొంగెత్త మీద
కొరిగె అశోకవృక్షం!
ఆజానుబాహుడా! ఆదుకోరా!

రావేల, రావేల ఈ రాత్రి!
రాక్షసులు మైమరచి
నిద్రపోతున్నారు !!
నిశ్శబ్దదేవతగా
నన్ను చేరరావోయి !

తొలిప్రాణి నీవురా!
తొలినవ్వు నేనురా!
నీవు ప్రాణదాతవురా!
నేను స్వప్నరూపంరా!

నా నవ్వు వెన్నెలై
లోకాన్ని వెలిగించె!
నీవాక్కు కోర్కై
లోకాన్ని స్పందించె

వూహనీవు, ఆశ నేనురా!
మనం జగతి చైతన్యం!
రావేల, రావేల ఈవేళ!
నావళ్ళో పవళింప!

రావోయి! కృష్ణా!
రాసలీల వేళాయె!
రావోయి, రాధను!
నే నీ తీయనిబాధను!

రావేల, రావేల ఆడం!
రావేల ఆదిపురుషుడా!
ఆద్యంతాలావహించిన
చైతన్యవాహిని పలికించు!
నా ఎడద మోడు పులకించ!

హేం క్రిష్ణా! శ్రీకృష్ణా!!
అబ్బా! దుర్యోధనులు!
అయ్యో! దుశ్శాసనులు!
పరాభవం కాటందుతోంది!
తక్షణం ముక్తిప్రసాదించు ప్రభూ!

ఔనురా, నే నీ అర్ధాంగిని!
ఔనౌను నేను 'అవని'ని!
వినరా, ఇహనైనా నామొర!
విని నన్బ్రోవ రారా వేవేగ!



# ఆంధ్ర నాటక సాహిత్య సమీక్ష

## శ్రీనివాస చక్రవర్తి

సంస్కృతాలంకారికులు సాహిత్యరంగంలో నాటకానికి అగ్రతాంబూల మిచ్చినా, వారి ననుసరించిన మన పూర్వాంధ్ర కవులు దానిజోలికి పోలేదు. సంస్కృతలక్షణ గ్రంథాలను అనువదించిన తెలుగు లాక్షణికులు నాటక పరిచ్ఛేదం వదలివేస్తూ వచ్చారు. "ఉదాత్త రసాన్విత కావ్యనాటకక్రమములు పెక్కు- చూచితి -" అనే భారతపద్యాన్ని బట్టి నన్నయ కాలంనాటికే నాటకాలు ప్రదర్శిస్తూండేవారని అనుమా-నించవలసివస్తోంది. కాని అవి నాటకాలో, యక్షగానాలో నిర్ధారణగా చెప్పలేం. తిక్కనగారి కీచక వధ ఘట్టం చదివినా, పింగళి సూరన ప్రభావతీ ప్రద్యుమ్నం చదివినా వారికి నాటక రచనలో విశేషప్రజ్ఞ గలదని పొడగట్టుతుంది. కాని ఆ మహానుభావులకూ తెలుగులో నాటకం రాయాలని బుద్ధిపుట్టలేదు. పిల్లలమర్రి పిన వీరభద్రుడు, నంది మల్లయ్య' ఘంట సింగయ్య సంస్కృత శాకుంతలం, ప్రబోధ చంద్రోదయాలను ప్రబంధాలుగా రూపొందించారే గాని నాటకాలుగా అనువదించలేదు. ఆనాటి సాహిత్యం రాజుల ఆదరాభిమానాలమీద, ఇష్టానిష్టాలమీద ఆధారపడి ఉండటం, వారికి నాటకాలమీద మోజు లేక పోవటం తెలుగులో నాటకాలు అవతరించకపోవడానికి కారణాలై వుండవచ్చు.

పూర్వకవులు నాటక సరస్వతి మీద యెంత శీతకన్ను వేసినా ఎలానో ఒకే ఒకరూపకం 14 వ శతాబ్దంలో తెలుగులో వెలువడింది. అదే క్రీడాభిరామం. దీనిని రచించింది వినుకొండ వల్లభ రాయుడు. ఇందులో శ్రీనాథుని పోకడలు అనేకం కనిపించటం వల్ల దీనిని శ్రీనాథుడే రచించి వల్లభరాయని పేరు పెట్టాడని స్వర్గీయ వేటూరి ప్రభాకరశాస్త్రి

వాదించారు. గ్రంథకర్త ఎవరైనా యిది తెలుగు భాషలోని ప్రప్రథమ రూపకమని అంగీకరించక తప్పదు. అయితే యిది పూర్తిగా స్వతంత్ర గ్రంథం కాదు. సంస్కృతంలోని ప్రేమాభిరామాన్ని అనుసరించి రచించబడింది. ఇది సంస్కృత దశ విధరూపకాలలోని వీధిజాతికి చెందింది. "నటులది దోరసముద్రము, విటులది యొర్గల్లు, కవిది వినుకొండ..." అని నాందీ ప్రస్తావనలో చెప్పడంవల్ల దీనిని మోపూరి భైరవుని తిరునాళ్ళలో ప్రదర్శించేవారని తెలుస్తుంది. ఇందులో శృంగారం పచ్చిగా నడిచినా, ఆనాటి ఆంధ్రప్రజల సాంఘికాచారాలు, వివిధ కళారూపాలు ప్రస్ఫుటంగా ప్రతిబింబిస్తున్నాయి. ఆరోజులలో తెలుగువారు ఎక్కువగా యక్షగానాలు, వీధినాటకాలు, పగటి వేషాలు మొదలైన కళారూపాలతోనే తృప్తిపడుతూండేవారు.

1880 వ సంవత్సరంలో ఆంధ్ర సాహిత్య చరిత్రలో నూతనయుగం ప్రారంభమైంది. ఆ సంవత్సరమే ధార్వాడ కంపెనీవారు ఆంధ్రదేశమంతా పర్యటించి నాటకాలాడి వెళ్ళారు. ఆ ప్రదర్శనాలు చూచిన తెలుగువారికి తామూ నాటకాలాడాలనే కుతూహలం కలిగింది. నాటక సమాజాలు ప్రతి పట్టణాన స్థాపించారు. కాని ఆడడానికి నాటకాలేవీ? అందుకని ప్రతి సమాజం ఒక్కొక్క కవిని ఆశ్రయించింది. ఆ కవులు తాము చదివిన సంస్కృత నాటకాలను చూచిన ధార్వాడ నాటకాలను, ఆంధ్రలో చిరకాలంగా ప్రచారంలో ఉన్న పగటి వేషాలను ఆధారంచేసుకుని తెలుగులో నాటకాలు రాయసాగారు. వారికి ఎక్కువగా పగటివేషాలు, ధార్వాడ నాటకాలు ఉపయోగించి ఉంటాయి. పగటివేషాలలో చాలా వేషాలు ఉత్తమ ప్రహసన లక్షణాలతో విరాజిల్లుతూ నాటి నాటకాలకు ప్రాతిపదికలైనాయి. ఆనాటి కవులు పూర్తిగా వచనంలోనే నాటకాలు రాశారు. ఒకటి రెండు శ్లోకాలు, ఒకటి రెండు కీర్తనలు మాత్రముండేవట. అయితే ఆనాటి వచన నాటకాలు మనకిపుడు లభ్యం కాకపోవడంవల్ల వాటిని సమీక్షించే అవకాశం లేకుండా పోయింది. వీరేశలింగం

గారి ప్రహ్లాదలో 8 పద్యాలు మాత్రమే వున్నాయి. ఆ వచన నాటక ఛాయలు ఇందులో వున్నాయేమోనని సందేహించవలసి వస్తోంది.

సర్కారు జిల్లాలలో యిలా వచన-నాటకాలు వెలువడుతూంటే బళ్ళారినించి యింకోరకం నాటకాలు బయలుదేరాయి. అక్కడి వారికీ నాటకాలాడాలని ఉత్సుకత కలిగి సరస వినోదసభ అని నాటకసమాజం స్థాపించారు. దానికి కవి, నటుడు, దర్శకుడు ధర్మవరం రామకృష్ణమాచార్యులు. ఈయనకి సంస్కృతాంధ్ర ఆంగ్లభాషలలో మంచి పాండిత్యముంది. వీరి నాటక రచనలతో నాటక సాహిత్యం యింకో దశ అందుకుంది. వీరు గద్య పద్య గేయాత్మకంగా 28 నాటకాలు రచించారు. కాని అందులో 14 మాత్రమే అచ్చులోకి వచ్చాయి. ఒక్క రోషనార తప్ప తక్కినవన్నీ పౌరాణికాలే. ఈ నాటకాలలోని పద్యాలు ప్రబంధ ఫక్కీలో నడుస్తాయి. స్వయంగా రకరకాల చందస్సులూ ప్రస్తారించుకుని కొత్త కొత్త పద్యాలు, గేయాలు, రాగమాలికలు, ద్విపదలు, ద్యూయెట్లు రచించారు. గద్యంలోని భావమే పద్యంలో, అదేభావం కీర్తనలో రాయడం, ప్రతి చిన్న విషయాన్నీ ప్రత్యేకరంగంగా చిత్రించడం మూలంగా వీరి నాటకాలు కొంచెం పెద్దవిగా ఉంటాయి; సంస్కృత నాటకాలనుంచి పద్యాలు, ఘార్వాడవారిలాగా కీర్తనలు, ఆంగ్ల నాటకాలు చూచి రంగాలుగా అంకవిభజనా చేసి నాటకాలు రాసి ఆడించారు. పాత్రల మానసికావస్థలను, ఆంతర జీవితాన్ని చిత్రించడంలో వీరు పేజీలకు పేజీల దీర్ఘ స్వగతాలు ఉపయోగించారు. కథా సంవిధానంలోను, పాత్ర చిత్రణలోను వీరికి మంచి నేర్పుఉంది. చిత్రాంగి, హిరణ్యకశ్యప పాత్రలను, వారి మానసిక జీవితం చిత్రించడంలో వీరు కొత్తదోవలు తొక్కి, ఆ రెండు పాత్రలకు కొత్త వ్యాఖ్యానంచేసి, ఆ పాత్రలయందు పాఠకులకు సానుభూతి కలిగేలాగా చేశారు. వీరి నాటకాలు పౌరాణికములైననైనా వర్తమానకాల సాంఘిక, రాజకీయ సమస్యలపై తమ భావాలను నాటకాలద్వారా ప్రకటించారు.

చంద్రహాసలో ఉప్పుపన్ను, ప్రమీలలో స్త్రీ స్వాతంత్ర్యం, పాంచాలీ స్వయంవరంలో విదేశీవస్త్ర బహిష్కరణ ఇమడు తార్కాణాలు. వీరు కరుణారసంలో సిద్ధహస్తులు. తొలి రచన చిత్రనళీయం, 1886. ఇదిగాక చంద్రహాస, సారంగధర, ప్రహ్లాద బహుళ ప్రచారంలోకి వచ్చాయి. సంస్కృత లాక్షణికులు నాటకం సుఖాంతంగా ఉండాలని శాసించినా విషాదాంత నాటకాలలోని గొప్పదనాన్ని గుర్తించి ఆచార్యులుగారు ధైర్యంగా సారంగధర విషాదాంతంగా రచించి తర్వాతి కవులకు మార్గదర్శకులయారు.

వీరికి పోటీగా కోలాచలం శ్రీనివాసరావు బళ్ళారిలోనే ఇంకో నాటకసమాజం స్థాపించి ఆడించారు. వీరూ గద్యపద్య గేయాత్మకంగానే నాటకాలు రాశారు. వీరికి ఆంగ్లనాటకాలమీద మోజు ఎక్కువ. అందుకే వీరి నాటకాలలో ఆంగ్ల నాటక ఛాయలు యెక్కువగా గోచరిస్తాయి. వీరి విజయనగర రాజ్య పతనం వీరికేగాక, రాఘవకు కూడా ఎక్కువపేరు తెచ్చిపెట్టింది. ఇలాంటి గద్య పద్యాత్మక నాటకాలు ప్రజల ఆదరాభిమానాలను చూరగొనడంలో అంతవరకు వచన నాటకాలను రాయడానికి పూనుకున్న నాటక కర్తలంతా ఫక్కీ మార్చి, గద్యపద్యాత్మక నాటకాలు రాయ నారంభించారు. కందుకూరి, చిలకమర్తి, వేదం, పానుగంటి మొదలైన రచయితల నాటకాలు బహుళ ప్రచారంలోకి వచ్చాయి. వీరిలో కొందరు సంస్కృత నాటక లక్షణాలను స్థూలంగా అనుసరించి, కొందరు బళ్ళారి నాటకాల ననుసరించి నాటకాలు రాయసాగారు. నాటకాలను పద్యాలు, పాటలు అత్యావశ్యకములనే భావం రచయితలలోను, నటులలోను ప్రజలలోను పాదుకుపోయింది. చివరికి 'వెళ్ళి వస్తాను' అనేదికూడా పద్యంలో రాసే స్థితికి నాటక రచన దిగజారింది. చిలకమర్తివారి గయోపాఖ్యానం, తిరుపతి కవుల పాండవ నాటకాలు యించుమించు పద్యనాటికలకింద తయారయాయి.

ఈ గద్య పద్య నాటకాలలోనే కొత్తత్రోవలు ్రొక్కి మార్గదర్శకులైనవారు వేదంవారు, పానుగంటివారు. వేదంవారు సంస్కృత నాటకాలను, లక్షణ గ్రంథాలను

మథించి పాత్రోచిత భాషావాదానికి పునాదులు వేశారు. వారి వాదానికి లక్ష్యమా అన్నట్లు ప్రతాపరుద్రీయంలో పాత్రలకు తదుచితభాషనుపెట్టి ఉత్తమ నాటకాన్ని వెలువరించారు. అప్పటివరకు సేవకపాత్ర నుంచి నాయకపాత్రవరకు గ్రాంథిక భాషలో నాటకాలు వ్రాస్తున్న కృష్ణమాచార్యులుగారు మొదలైన వారంతా పాత్రోచితభాషను వాడుతూ నాటకంలో భాషావిషయంలో కొంతవరకు వాస్తవికతకు స్థానం కల్పించారు. పానుగంటివారు ఇంకోవాదన లేవదీశారు. వీరు పచ్చి గ్రాంథికవాదులు. పాత్రోచితభాష వీరికి గిట్టలేదు. తెలుగు నాటకాలకు వృత్తాలు పనికి రావనీ తేటగీతిలాంటి తెలుగు ఛందస్సులే వాడదగినవని వాదిస్తూ తమ వాదనకు అనుగుణంగా నాటకాలనేకం రాశారు; పాదుక, రాధాకృష్ణ, విప్రనారాయణ, కంఠాభరణం ఎక్కువ ప్రచారంలోకి వచ్చాయి. వీరు హాస్యరస నిష్ణాతులు. ఆ రసమంటే మహాభిమానం. అందుచేత వీరి నాటకాలలో హాస్యం ముందుకు పరుగిడుతూంటుంది. పాత్రచిత్రణలో, కథా సంవిధానంలో వీరు అనేక నూత్న మార్గాలు తొక్కి తర్వాత రచయితలకు మార్గదర్శకులయారు.

19 వ శతాబ్దం చివర, 20 వ శతాబ్దారంభంలో భారతమంతటా జాతీయతాభావం స్వాతంత్ర్యపిపాస రేకెత్తాయి. ఈ భావాల ప్రభావం వల్ల తెలుగులో రెండు సరికొత్త రకాల నాటకాలు బయలుదేరాయి ఒకటి: పూర్వచారిత్రకనాటకాలు, రెండు : సమకాలీన చారిత్రకనాటకాలు, మొదటిరకానికి చెందినవి వేదం వారి ప్రతాపరుద్రీయం, బొబ్బిలి; ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణశాస్త్రిగారి రసపుత్ర విజయం, కొప్పరపు సుబ్బారావుగారి రోషనార, పింగళి నాగేంద్రరావుగారి జేబున్నీసా, శ్రీపాదవారి బొబ్బిలి ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్నవి.

పింగళివారి జేబున్నీసా ద్విజేంద్రలాల్ రాయ్ నాటకాల ఛాయలో నడిచింది. రసపుత్ర విజయం, రోషనారలలోని పద్యాలు దేశభక్తిని పురిగొల్పుతాయి. మతకలహాలు వస్తాయనే వంకతో బ్రిటిష్ ప్రభుత్వం యీ మూడు నాటకా

లను నిషేధించింది. ప్రతాపరుద్రీయం కథా సంవిధానంలో, రసపోషణలో, పాత్రచిత్రణలో తెలుగులోని బహుకొద్ది ఉత్తమ నాటకాలలో ఒకటిగా పరిగణింపబడుతోంది. అయితే ఒక్క జేబున్నీసాలో మినహా తక్కినవాటిల్లో మామూలు పాతధోరణిలోనే గద్య పద్యాలు యథేచ్ఛగా వాడబడ్డాయి. రచనావిధానంలో పెద్ద మార్పేమీ రాలేదు. ఇక సమకాలీన చారిత్రక నాటకాలు: పంజాబుహత్యాలు, బ్రిటిష్ప్రభుత్వ దమననీతిలో భారతదేశం అట్టుడికినట్లు ఉడికిపోయింది. దాని ప్రభావంవల్లనే తెలుగులో దామరాజు పుండరీకాక్షుడుగారు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిలుగారు మొదలైనవారు పాంచాలీ పరాభవం, గాంధీ విజయంలాంటి నాటకాలు రాశారు. అయితే ఇవి ప్రభుత్వ నిషేధానికి గురి అయినాయి.

నాటి రాజకీయాందోళనతోపాటు సాహిత్య రంగంలో, మత రంగంలో, సాంఘిక రంగంలో ఆందోళన ప్రారంభమై తత్ఫలితంగా నాటకం కొత్త కొత్త రూపాలు ధరించింది. సాహిత్య రంగంలో ఆనాడు ముందడుగు వేసింది సాహితీసమితి. అందులోని సభ్యులంతా మంచి భావుకులు, వ్యుత్పన్నులూ, వ్యావహారికభాషావాదులు. సభాపతి శివశంకరులవారు తక్కిన సాహిత్యశాఖలలో లాగానే నాటక శాఖలో నూత్నరూపాలను అందించారు. నిర్వచనంగా పద్యగేయాలతో వీరుచక్కటి నాటకాలు, నాటికలు చాలా రచించారు. వీరి పద్య నాటకాలలో భావనాశక్తి కంటె నాటకత్వం ముందుకు దూకుతూంటుంది. గ్రీకు మహాకవుల నాటకాలు వీరి నాటకాలు చదువుతూంటే స్మృతికి వస్తాయి. వీరి పద్మావతి, దీక్షిత దుహిత, కవిప్రియ సాహితీవేత్తల మన్ననలనందుకున్నాయి. అందులో దీక్షిత దుహిత గొప్ప కళాఖండం. సంభాషణలు పద్యాలలో సాగినా, చకచకా నడుస్తూ ఎంతో సొంపుగా ఉంటాయి. అప్పయ దీక్షితుల మానసికావస్థను చిత్రించడానికి వీరు నేపథ్య బృందగానాలు రచించి సరికొత్తమార్గం తొక్కారు.

గొప్ప భావనాశక్తి సంపన్నుడు విశ్వనాథ సత్యనారాయణగారు.

వీరు నర్తనశాల, అనార్కలీ, వేన రాజు మొదలైన నాటకాలు చాలా రాశారు. అయితే వీరి నాటకాలలో కవిత్వం ముందుకు ఉరకలు పెడుతూ నాటకత్వానికి అడ్డు తగులుతూంటుంది. వీరి అనార్కలీ గొప్ప 'లిరిక్' నాటకం. ఇందులో వీరు విభావాను భావ వ్యభిచారీ భావాలను పాత్రలుగా ప్రవేశపెట్టి వాటిద్వారా నాయకా నాయకుల మానసికావస్థను, పరిణామాన్ని వర్ణించారు. ఇట్టి రచన అపూర్వం. తెలుగు భాషకు ఒక అమూల్య మణి అనార్కలీ. వేనరాజులో కొంత మంది పెద్దలకి హోమోసెక్స్, మెటాఫిజికల్ సైన్సు గోచరించాయి. అది గొప్ప శాస్త్రీయ నాటకమని పొగిడారు. మరికొంత మంది దృష్టిలో ఇది వట్టి అభివృద్ధి నిరోధకనాటకం. దీనిమీద గాలిదుమారం రేగింది. సత్యనారాయణగారు గొప్పగొప్ప సంస్కరణలకు పూనుకున్న వేనరాజును పెద్ద రాక్షసుడిగా చిత్రించారు. నాటక రచనా పద్ధతిలో పెద్ద మార్పేమీ ఇందులో తీసుకురాలేదు. ఇక నోరి నరసింహశాస్త్రిగారి సోమనాథ విజయం; దువ్వూరి రామిరెడ్డిగారి "మీరాబాయి" విషాదాంత నాటకంగా మన్నన పొందింది. వారిదే "కాంగ్రెస్‌వాలా" హాస్యగర్భితమైన సాంఘికనాటిక. చింతాదీక్షితులుగారి శబరి, అబ్బూరి రామకృష్ణారావుగారి నదీసుందరి తెలుగు సాహిత్యంలో విశిష్టస్థానంసంపాదించుకున్నాయి. ఈమూడూపూర్తిగా వచన నాటకాలే. సోమనాథ విజయం చారిత్రాత్మకమైంది. చక్కటి పాత్ర చిత్రణతో ఆనాటి యువకుల నెందరినో ఆకర్షించింది. శబరి చదువుతోంటే మాటర్‌లింక్ బ్లూబాయి జ్ఞాపకం వస్తుంది. చింతా వారు అడవులలోని పక్షులను సైతం పాత్రలుగాచేసిన శబరి రామభక్తిని ద్యోతకంచేస్తూ ఉత్తమనాటకం రచించాడు. నదీసుందరి వచనంలో ఉన్న ఖండకావ్యంలాగా నడుస్తుంది.

సాహితీరంగంలో ఆందోళనలో భాగంగా వ్యవహారిక భాషావాదం వచ్చింది. వ్యవహారిక భాష కావ్య రచనకు యోగ్యంకాదనీ అందులో ముఖ్యంగా నాటక రచనకు అసలే పనికి రాదని పండితమ్మన్యులు వాదించసాగారు. ఈ వాదనను ప్రతిఘటించడానికని గురజాడ

అప్పారావుగారు చక్కటి వ్యవహారిక భాషలో కన్యాశుల్కం రాశారు. నాటకంలో కుప్ప తెప్పలుగా పద్యాలు పాటలు రాయడం సంప్రదాయమైపోయిన తొలిరోజులలో (1886) పూర్తిగా వచనంలో, అందులో వ్యవహారికంలో నాటకం అవతరించడం నిజంగా చిత్రమేకాక గురజాడవారి ప్రతిభను, దూరదృష్టినీ వెల్లడిస్తాయి. కన్యాశుల్కంలో పాత్రలు జీవకళతో ఉట్టిపడుతూ తెలుగువారి హృదయాలలో పీఠం వేసుకున్నాయి. గిరీశం, రామప్పంతులు, మధురవాణి, అగ్నిహోత్రావధాన్లు, వెంకటేశం మనకి నేటికీ నిత్యం కనిపిస్తూవున్నారు. తెలుగు నాటక సాహిత్యంలో వాస్తవికతకు పునాదులు వేసింది అప్పారావుగారే. అందుకే నాటికీ నేటికీ సాటిలేని నాటకంగా కన్యాశుల్కం విరాజిల్లుతోంది. అయితే ప్రతిపక్షులు ఊరుకున్నారా ? ఏదో చచ్చు సాంఘిక నాటకాలకి వ్యవహారికం ఉపయోగిస్తుందేమో కాని పౌరాణిక నాటకాలకు ఏమాత్రం పనికిరాదని మొదలుపెట్టారు. వారి సవాలును అందుకని చిలుకూరి నారాయణరావుగారు రసవత్తరంగా అశ్వత్థామ, అంబ మొదలైన పౌరాణిక నాటకాలను, శుద్ధ వ్యవహారంలో రచించి చూపారు.

ఇంకో వైపునుంచి రామాయణ భారతాది పురాణాలమీద, బ్రాహ్మణ మతంమీద తిరుగుబాటు లేచింది. దీనికి నాయకుడు త్రిపురనేని రామస్వామి చౌదరిగారు. వీరు పురాణ కథలకు, పాత్రలకూ కొత్త వ్యాఖ్యానంచేసి నూతన దృక్పథంతో శంబుకవధ, ఖూనీ అని రెండు నాటకాలు రాశారు. శంబుకవధ పాతపద్ధతిలోనే రచించినా, ఖూనీలో కొత్తపోకడలు పోయారు. వీరిదృక్పథాన్ననుసరించి ముద్దుకృష్ణ అశోకం, గుడిపాటి వెంకటచలం గారు శశాంక, పురూరవ మొదలైన రసవత్తర నాటకాలు రచించారు. అయితే చలంగారి నాటకాలు నవ్యభావాలతో చదువుకోడానికి ఎంతో రమ్యంగా ఉంటాయి. పాత్ర చిత్రణలో కథాసంవిధానంలో నూతనత్వమే వీరినాటకాలలో గోచరిస్తుంది.

సమాజంలోనికుళ్ళును క్షాళనం చేయాలనే మహాదోద్దేశంతో పెద్ద ఉద్యమం లేవదీసిన వీరేశ

లింగంగారు తమకు సాధనంగా నాటక రచనను చేపట్టి విచిత్ర వివాహం, బ్రాహ్మ వివాహం, మున్సిపల్ నాటకం మొదలైన ప్రహసనాలు పూర్తి వచనంలో వ్యవహారానికి చాలా దగ్గిరగాఉండే సులభశైలిలో రచించారు. అయితే వారి ప్రధానాశయంసంఘసంస్కరణ అవడంవల్ల వారి రచనలలో శిల్పం కొంచెం దెబ్బతిన్నదనే చెప్పాలి. వీరేశలింగంగారి ఉద్యమ ఫలితంగా చాలా సాంఘిక నాటకాలు వెలువడ్డాయి. కాళ్ళకూరి నారాయణరావుగారి చింతామణి, వరవిక్రయం, మధుసేవ; సోమరాజు రామానుజరావుగారి రంగూన్ రౌడీఅమితప్రచారంలోకివచ్చాయి. వీరు సాంఘిక సమస్యల లోతుపాతులలోకి వెళ్ళకుండా పైపై విషయాలనే పట్టుకు నాటకాలు రాయడంతో విషమఫలితాలు కలిగాయి. వీటికి 'రౌడీ నాటకాల'ని పేరు వచ్చింది. వీటిలోని కృత్రిమ సన్నివేశాలు, పాత్రచిత్రణ లోట్లు ఎన్నో ఉన్నాయి. వీటిని తొలి సాంఘిక నాటకాలుగా మాత్రమే పరిగణించాల్సి వుంటుంది.

ఇంతవరకు మనం పరిశీలించిన రచయితలు, గురజాడవంటి ఏ బహుకొద్దిమందినో మినహాయిస్తే, ఆదర్శవాదులు, భావవాదులు. వీరు రచనా సంవిధానంలో ఎన్ని కొత్తపోకడలు పోయినా, ఎన్ని కళారూపాలను అందించినా, వీరి దృష్టి అంతా గతకాలంవైపే. అందుచేతనే వారి నాటకాలు పురాణకథలతోను, చారిత్రక కథలతోనూ నిండి బూజుపట్టిన సిద్ధాంతాలను ప్రసాదిస్తుంటాయి. కాని కాలం మారింది. జాతీయ అంతర్జాతీయ సాహిత్యపరనం, పరిణామాలవల్ల 1930 ప్రాంతాలకే యువకులలో నవచైతన్యం కలిగింది. మార్క్సిస్టు సిద్ధాంతాలు, అతివాదభావాలు యువకులను ఆకర్షించాయి. కనువిచ్చి చూచారు. కనిపించిం దేమిటి? జీర్ణావస్థలలో ఉన్న సాంఘిక ఆర్థిక వ్యవస్థ. ధనికుడు – బీద అనే రెండు వర్గాలు. ఆ రెండు వర్గాల మధ్య నిత్యసంఘర్షణ. ఎంత నీచానికైనా ఒడిగట్టి ధనికుడు దరిద్రుణ్ణి పీల్చి పిండిచేస్తూ భోగభాగ్యాలతో తులతూగుతుంటే దరిద్రుడు తిండిలేక మూల్గడం వారి

కంటికి దృశ్యమానమైనాయి. సంఘంలో పెద్దమనుష్యులు చెద పురుగుల్లా చేరి మూఢనమ్మకాలను, మూఢాచారాలను ప్రచారం చేస్తూ మతంపేరిట, దేవుడి పేరిట దురన్యాయాలు జరుపుతూండడం గోచరించింది. నవకవి ఈఅన్యాయాలను ఎదుర్కొంటానికి వాస్తవికత దృష్టితో పరిశీలించి, వాస్తవికతను ప్రాతిపదిక చేసుకుని కలంపట్టాడు.

నాటక సాహిత్యం ఇంకోదశను, అభ్యుదయ దశను చేరుకుంది. కన్యాశుల్కం తర్వాత మళ్ళీ వాస్తవికతా దృష్టితో రచితమైన నాటకం "తప్పెవరిది". రచయిత పి. వి. రాజమన్నారు. సారంగధర ఇతివృత్తాన్నే నేటి సంఘపరంగా రచించినా యిందులో ఎన్నో కొత్తపోకడలు కనిపిస్తాయి. ఈ నాటకాన్ని బళ్లారి రాఘువ ఆంధ్ర దేశంలో పలు తావుల ప్రదర్శించడంతో మన నాటక చరిత్రలో నూత్నశకం ప్రారంభమైంది. యువకవులు నాటకం తిలకించి ఉత్సాహపూరితులై వాస్తవిక జగత్తును నాటకాలలో ప్రతిబింపజేయ పూనుకున్నారు, ఈ నూతనయుగంలో వచ్చిన నాటకాలలో విశిష్టత రెండువిధాలు. ఒకటి వస్తువు, రెండు శిల్పం.

పతనావస్థలోనున్న భూస్వామ్య విధానాన్ని ఏదోవిధంగా నిలబెట్టుకోడానికి ఎంతటి దారుణాలకైనా తయారయే ధనిక భూస్వాములకు, వారి బారినుంచి తప్పించుకుని బానిస శృంఖలాలను త్రెంచుకుని స్వేచ్ఛగా జీవించడానికి సంఘటితపడుతున్న బీదరైతు, కూలీలకు మధ్య సంఘర్షణ అభ్యుదయ నాటకాలకు మూలవస్తువైంది. ఈ ఇతివృత్తాన్ని ఆధారం చేసుకుని అనేకమంది రచయితలు నాటకాలు రాశారు. వాటిలోకల్లా ఎక్కువ ప్రచారంలోకి వచ్చినవి వాసిరెడ్డి, సుంకర రచించిన ముందడుగు, మాభూమి. ఈ రెండు నాటకాలను, అందులో ముఖ్యంగా మాభూమిని అనేక నాటకసమాజాలు ప్రదర్శించాయి. కొన్ని లక్షలమంది ప్రజలు చూచి ఆనందించి చైతన్యం పొందారు. అనేకమంది రచయితలు, నాటకసమాజాలు ఈ నాటకంవల్ల ఉత్సాహం పొందారు. ఇటీవల వాసిరెడ్డి విడిగా రచించిన పోతుగడ్డ మాభూమి నాటకానికితెరువాయిలాకనిపిస్తుంది.

ఆంధ్ర ప్రజాజీవితంలో అత్యంత ప్రాధాన్యం వహిస్తున్న ఈ సంఘర్షణ రచయితలను సహజంగా ఆకర్షించింది. అనేకులు ఈసంఘర్షణలోని వివిధరూపాలను ద్యోతకం చేస్తూ నాటకాలు రాశారు. కాని సృజనాత్మకశక్తి కొరవడంవల్ల ధనికభూస్వామిలాంటి పాత్రలలో ఏమార్పు లేకుండా మూసకట్టినట్లు ప్రత్యక్షమవుతున్నాయి. ఒకే రకమైన సంఘటనలు పునరావృతమవుతున్నాయి. ఈ విషయంలో యువరచయితలు జాగ్రత్త వహిస్తే వారినాటకాలు ఇంకా రాణింపుకు వస్తాయి.

ధనిక భూస్వామే గాక ప్రజలను దోచుకుని తినే పెట్టుబడిదారీ వర్గం ఒకటి బయలుదేరింది. ఈ పెట్టుబడిదారు ఫ్యాక్టరీ యజమాని, మార్వాడి వీవరు, అద్దెకొంపల యజమాని మొదలైన అనేకరూపాలలో అవతరిస్తూ దయాదాక్షిణ్యాలు విడిచి ఎలా దరిద్రులను పీడిస్తున్నది ద్యోతకంచేసే నాటకాలు వెలువడుతున్నాయి.

మధ్యతరగతి కుటుంబాలు అటు ధనికవర్గానికి కాక, ఇటు బీదలకు కాక ఘరానాకోసం, పరువుకోసం పాకులాడుతూ నానాబాధలూ పడుతున్నాయో అభివర్ణించే నాటకాలు కూడా బయలుదేరాయి. ఆచార్య ఆత్రేయగారి యన్. జి ఓ. ఈ తరగతి నాటకాలలో అగ్రస్థానం వహిస్తుంది. ఆత్రేయగారి నాటకాలలోనే ఒక విశిష్టత ఉంది. మంచి చమత్కారంగా ఉండే సంభాషణలు వీరి నాటకాలకు వన్నె పెడుతున్నాయి. యన్. జి. ఓ నాటకంలోని కథాసంవిధానం, సన్నివేశాలు, పాత్ర చిత్రనా అతిసహజంగా ఉండి పరిశ్రప్రేక్షక హృదయాలలో నాటుకుపోయాయి.

1947 కి పూర్వం, తర్వాత భారత రాజకీయాలలో వచ్చిన పరిణామాలు ప్రజలను, రచయితలను కదిలించి వేశాయి. ఆ కదలిక ఫలితంగా ఈనాడు, ఏకదేశం, ఇదా స్వాతంత్రం, మొదలయిన నాటకాలు నాటి రాజకీయ పరిణామాలను, వాటి ఫలితాలను ప్రతిబింబిస్తూ వెలువడినాయ్.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం యుద్ధోన్మాదులు తయారుచేస్తున్న మారణాయుధాలను ప్రపంచం దద్దరిల్లిపోయింది. ప్రపంచప్రజలలో శాంతి కావాలనే ఆకాంక్ష మిన్ను

ముట్టింది. శాంతిఉద్యమం మహో ధృతంగా లేచింది. ప్రపంచ ప్రజా శాంతి కాంక్షను ద్యోతకం చేస్తూ అనిశెట్టి "శాంతి", ఆత్రేయ "విశ్వ శాంతి", పడాల "సందేశం", గిడుతూరి "చిరంజీవి మానవుడు" మొదలైన నాటికానాటకాలు వెలువడ్డాయి. అనిశెట్టి "శాంతి" తెలుగు నాటకరంగానికి ఒక క్రొత్త రూపాన్ని సమర్పించింది. "శాంతి" మూక నాటిక నేపథ్యంలో వ్యాఖ్యాత, తదితరులు పాత్రల సంభాషణలను పలుకుతూంటే రంగస్థలమీద పాత్రలు మూకాభినయం చేస్తాయి. ఈ నాటిక ఆంధ్ర ప్రజానీకాన్నే గాక, రష్యన్ కళావేత్తలను సైతం ముగ్ధులను చేసింది. ఆత్రేయ "విశ్వశాంతి"లో క్రొత్త పోకడలు కనిపిస్తాయి.

సంఘంలోని కుళ్ళును, హేళన చేసే ఉద్దేశ్యంతో వ్రాసిన డా॥ గంగాధరరావు, భూషణబాబు, కణ్వశ్రీ, గోపాలరాయశర్మ ప్రభృతుల నాటకాలు ప్రజామన్ననలను పొందుతున్నాయి.

స్వాప్నికజగత్తు, విచిత్రమైన జగత్తు, మానవుడు కట్టుకునే గాలి మేడలు, తీరని కోరికలు ఆ జగత్తులో ప్రత్యక్ష మౌతుంటాయి. ఈ విచిత్ర స్వాప్నిక జగత్తుకు నాటకరూపమిచ్చి అనిశెట్టి, శ్రీవాత్సవ నూతనపంథాలో నాటకాలు నడిపారు. వాస్తవికదృష్టితో, వాస్తవిక జీవితాన్ని ప్రతిబింబింపచేస్తూ, రసవత్తరమైన నాటకాలు వెలువడటంతో నాటకంలో వాస్తవికత సుస్థిరస్థానం సంపాదించింది.

ఇక శిల్పం. జాతీయ, అంతర్జాతీయ సాహిత్య అవలోకనం వల్ల, కొత్తరూపాలు తీసుకురావాలనే ఆకాంక్షవల్ల యువరచయితలు శిల్పంలో కొత్తదారులు పట్టారు.

1. అంకవిభజన చేయకుండా కొంతకాలం గడిచిందని సూచించటానికి ఫేడిన్, ఫేడవుట్ వాడి, టెంపోను నిలబెట్టారు. (ఈనాడు)

2. పాత్రల మానసికావస్థలను స్వగతాలతో కాకుండా, నేపథ్యగానంతో ద్యోతకం మొనర్చారు. (నేతబిడ్డ, గాలిమేడలు.)

3. ప్రేక్షకులను కూడా నాటక ప్రదర్శనలో భాగస్వాములు చేయాలనే తలంపుతో పాత్రలను ప్రేక్షకుల మధ్య కూర్చోబెట్టడం, ప్రేక్షకులతో మాట్లా

డించటం (గాలిమేడలు, విశ్వ శాంతి, ఎవరు దొంగ)

4. స్వాప్నిక జగత్తును, సిని మాలలోలాగా పాత్రలఛాయలు లేచి నడిచిపోయినట్లు ప్రదర్శిం చటం (గాలిమేడలు, తీరనికోరికలు)

5. నాటకంలోనే ఛాయనాట కాల ప్రదర్శన (నిజానిజాలు, భూమికోసం, ఆసామి)

6. నాటకమంతా ఒక పాత్ర, ఇంకొక పాత్రకు వర్ణించి చెప్తునట్లు నడిపించటం. అంక అంకానికి నేప థ్యంలో పూర్ణకథను వివరించటం. (సీతారామరాజు పితూరీ)

ఈ విధంగా నూతన ఆర్థిక వ్యవస్థను నిర్మించుకొని ప్రజాళి శాంతి సౌఖ్యాలనుభవించటానికి మార్గం సుగమమం కావాలనే మహదాశయంతో యువరచయి తలు నూతన పోకడలతో ఆంధ్ర నాటక కళకు వినూత్న రూపాలను సమర్పిస్తున్నారు. ఆంధ్ర ప్రజాజీవి తాన్ని సర్వతోముఖంగా చిత్రిస్తూ సమస్యల, పాత్రల లోతుపాతులను ఇంకా లోతుగా పరిశీలించి ఉత్తమ కళారూపాలను మన యువరచయి తలు వెలువరించ గలరనడంలో సందేహంలేదు.



# నేటి వాడుకభాషే నేటి గ్రాంథికభాష

## గిడుగు సీతాపతి

"నేటి శిష్టజన వ్యవహారమందున్న భాష వచన రచనకు అర్హత గల భాష; పాఠశాలలలోను విశ్వవిద్యాలయమువారి కళాశాలలలోను ఉన్న విద్యార్థులకు ఈ వ్యావహారిక భాషలో తమ వ్యాసములున్ను పరీక్షలలో ప్రశ్నలకు సమాధానములున్ను వ్రాయుటకు అధికారులు అనుజ్ఞ ఈయవలెను; తెలుగు రచయితలు తమ వ్యాసములు, విమర్శలు, నవలలు, కథలు, కథానికలు మొదలయిన వచన రచనలు ఈ వ్యావహారిక భాషలో రచించుటకు తగిన ప్రోత్సాహము కలిగించవలెను" అని 1906-10 లో వ్యావహారిక భాషావాదులు తమ కోరికను ప్రకటించినప్పుడు దేశములో అలజడి ప్రారంభించినది.

సరిగా ఆకాలమందే విద్యావిధానములో మార్పులు కలిగినవి. మెట్రిక్యులేషన్ పరీక్షకు మారుగా స్కూల్ ఫైనల్ పరీక్ష అమలులోనికి వచ్చినది. మద్రాసు విశ్వవిద్యాలయమువారు ఎఫ్. ఏ. పరీక్షకు మారుగా ఇంటర్మీడియట్ పరీక్ష పెట్టినారు. విద్యా విషయ ప్రణాళికలలో కూడా మార్పులు కలిగినవి. "బ్రిటిష్ ప్రభుత్వమువారి హయాంలో చిన్న తరగతులనుండి ఎమ్. ఏ. పరీక్షలవరకున్ను గల సకల విషయముల పాఠములున్ను ఆంగ్ల భాషలోనే బోధించుటవల్లను తెలుగుభాషా సాహిత్య శిక్షణము నిర్బంధముగా కాక ఐచ్ఛికముగా జరుగుతుండుటచేతను ఎమ్. ఏ. పరీక్షలో నెగ్గిన తెలుగు విద్యార్థికు లయినను చాలామంది తాము నేర్చుకొన్న విజ్ఞానము తెలుగు భాషలో చెప్పుటకు సమర్థులు కాలేకపోయినారు. సభలలోనైనా ఆగ్లమందేకానీ తెలుగున మాటలాడలేకపోయినారు." ఈ దుస్థితిని తెలిసికొన్న విద్యాధికులు క్రొత్తగా ఏర్పడ్డ స్కూల్ ఫైనల్ ఇంటర్మీడియట్ పరీక్షలకు తెలుగులో వ్యాసరచన, తెలుగులోని కితరభాషలనుండి అనువాదనము నిర్బంధముపెట్టినారు.

ఆ కాలమందు వ్యావహారిక భాషావాదులు కడు కొద్దిమందే అయినా ప్రభుత్వాధికారుల పరిచయమున్ను పలుకుబడిన్ని గల వారు కనుక, వారి సలహాల ననుసరించి స్కూల్ ఫైనల్ పరీక్షకు తెలుగు వచనరచన వ్యావహారిక భాషలో సాగించుటకు ప్రభుత్వము వారు విద్యార్థులకు అనుమతిచ్చినారు; అంతేకాక వారి రచనకు మార్గదర్శకముగా ఉండదగిన వచనగ్రంథ మొకటి – కీ. శే. సెట్టి లక్ష్మీనరసింహంగారు రచించిన గ్రీక్ మిత్తులు అనేది స్కూల్ ఫైనలుకు పాఠ్యగ్రంథముగా నిర్ణయించినారు దానితో దేశమందు పుట్టిన అలజడి ఎక్కువగా వ్యాపించినది.

ఆ సమయమందే విశ్వవిద్యాలయమువారు ఇంటర్ మీడియట్ పరీక్షకు నిర్ణయించిపెట్టిన వ్యాస రచన పండితులు కావలెనన్న గ్రాంథికభాషలో ఉండవలెనా? వ్యావహారిక భాషలో ఉండవచ్చునా? అనే విషయము నిర్ణయించుటకు ఒక ఉపసంఘమును ఏర్పరచినారు. అందులో నలుగురు వ్యావహారిక భాషావాదులున్ను, నలుగురు గ్రాంథిక భాషావాదులున్న ఇద్దరు మధ్యస్థులున్ను ఉండిరి. ఈ ఉపసంఘము కొన్ని సమావేశములు జరిపి, ఈ విషయమును గూర్చి కొంత చర్చజేసిన తర్వాత మధ్యస్థులు ఇద్దరున్ను వ్యావహారిక భాషావాదులయిన నలుగురు సభ్యులతోను ఏకీభవించి "వ్యాసరచనకు గ్రంథములందలి రూపములున్ను వాడుకలోగల రూపములున్ను ప్రయోగార్హములే" అనే తీర్మానము నెగ్గించినారు. దానితో తెలుగుభాషకు ఘోరమైన ఆపద సంభవించినదని ఘోషిస్తూ ఈ తీర్మానమును నిరర్థకముచేయుటకు సంకల్పించి పెద్దలు కొందరు విశ్వవిద్యాలయమువారికి మహజర్లు పంపినారు. వాడుకలోగల రూపములను ఎన్నుకొనునప్పుడు దేశమందంతటనుగల శబ్దరూపములను ఎన్నుకొనవలసి యున్నది. ఈ ఉపసంఘములో ఉన్న సభ్యులందరున్ను సర్కార్ జిల్లాలవారే: కాని ఇందులో రాయలసీమ ప్రతినిధులెవరునులేరు కనుక రాయలసీమ ప్రతినిధులను నలుగురిని ఈ ఉపసంఘములో చేర్చుకొనవలెను

అన్న కోరిక తెలియజేస్తూ తెలుగు పెద్దలు విశ్వవిద్యాలయము వారికి మహాజర్లుపంపి ఒత్తిడికలిగించినారు. వారి కోరిక ననుసరించి నలుగురిని రాయలసీమ ప్రతినిధులను ఈ ఉప సంఘములో చేర్చుట జరిగినది. వారు గ్రాంథిక భాషావాదులయిన సభ్యులతో ఏకమయి తీర్మానము ననుసరించి వాడుకభాషా పదము లనుఎన్నుటకు మారుగా అసలు తీర్మానమునకుగల అర్థము నే తారుమారుచేయుటకు తోడ్పడి నారు. ఎన్నుకొనే రూపములలో ప్రతీదిన్ని గ్రంథమందుండవలెను వాడుకలోను ఉండవలెను అట్టి రూపములనే ఎన్నుకొనవలెనన్న అర్థము ఆ తీర్మానమునకు కల దని వాదించినారు. ఈ ఉప సంఘంలో గ్రాంథిక భాషా వాదుల సంఖ్య ఎనిమిదయినది. తక్కినవారిసంఖ్య ఇద్దరు మధ్యస్థు లను కలుపుకొన్నా ఆరే అయినది. అందుచేత ఆ ఎనమండ్రు చెప్పిన మాటే నిలుచుటకు ఆధారమేర్పడి నది. "వస్తుంది" "పోతుంది" వంటి రూపములు వాడుకలో ఉన్నా గ్రంథములలో లేవుకనుక పనికి రావు అని ఆ ఎనమండ్రు అన్న ప్పుడు 'అనవుడు' 'నావుడు' అర్థానుస్వారము శకటరేఫముగల పదములు గ్రాంథికభాషలో ఉన్నా వ్యవహారమందు లేవు కనుక అవి కూడా పనికిరావని అనవద్దా అని ఈ ఆరుగురంటే వారికి ఇదివరకే అనుజ్ఞఉన్నది అని ఆ ఎనమండ్రు అన్నారు. ఇక్కడ ఎవరి సంఖ్య అధికమో వారిమాట నెగ్గవలసి నదేకాని అది సబబు అవునా కాదా అనే మాటకే అవకాశము లేకపోయినది. దీనికితోడు దేశ మందు వ్యావహారిక భాషా వాదము అంగీకరించరాదన్న ఘోష ఎక్కువయినది. ఇదంతా చూచి విశ్వవిద్యాలయము వారు భయపడి "ఈ వ్యావహారిక భాషను ప్రస్తుత పరిస్థితులలో విశ్వవిద్యాలయమువారు గ్రహింప జాలరు" అని తమ నిశ్చితాభి ప్రాయమును 1914 లో ప్రకటిం చారు. విశ్వవిద్యాలయమువారు ఒప్పుకోలేదు కనుక మేమున్ను ఒప్పుకోలేము అని విద్యాశాఖాధి కారులు స్కూల్ఫైనల్ పరీక్షల విషయములో వ్యావహారికభాషను విద్యార్థులు తమ వచన రచన సాగించవచ్చుననే అనుమతిని రద్దు

పరచినారు. దీనితో వ్యావహారిక భాషావాదమునకు పూర్తిగా అపజయము కలిగినది.

ఈ అపజయమువలన వ్యావహారిక భాషావాదులు నిరుత్సాహపడి నిస్పృహ చెందినా గిడుగు వేంకటరామమూర్తిగారు ధైర్యం వహించి తాము సేకరించియుంచిన నిదర్శన పరికరాలతో తెలుగు దేశమందలి వివిధనగరములకున్ను, పెద్ద గ్రామాలకున్ను సంచారము గావించి, సభలు జరిపించి ఉపన్యాసము లిచ్చి వ్యావహారిక భాషకు గల సత్తా నిరూపిస్తూ ప్రమాణము లనదగిన నిదర్శనములను ప్రదర్శిస్తూ తమ వాదమును నచ్చజెప్తూ వచ్చినారు. ఆ కాలమందు అనగా 1914–1915 లో ఆంధ్ర విశ్వకళా పరిషత్తు ఇంకా ఏర్పడక పూర్వము మద్రాస్ విశ్వవిద్యాలయమునకు చెందియుండిన కళాశాలలకు అనగా బరంపురం, పర్లాకిమిడి, విజయనగరము, విశాఖపట్టణము, కాకినాడ, రాజమహేంద్రవరము, మచిలీపట్నము, గుంటూరు, అనంతపురం, మద్రాస్ నగరములందలి కళాశాలలకు వెడలి ఆ కళాశాలల ప్రిన్సిపాలులను కలిసికొని వారి యాజమాన్యమున ఉపసంఘములను ఏర్పరుపజేసి ఆ ఉపసంఘముల వారికి తమ వాద స్వరూపమును, యాథార్థ్యమును నిదర్శనములతోపాటు తెలియజెప్పి ఆ ఉపసంఘములవారి అభిప్రాయములను, నివేదికలను పుచ్చుకొని తాము సంపాదకులుగా నడపిన తమ తెలుగు పత్రిక సంచికలలో ప్రకటించినారు.

వారి వ్యావహారికభాషా వాదమంతా వారు రచించిన వ్యాసావళి, గద్యచింతామణి, పండితభిషక్కుల భాషాభేషజము, బాలకవిశరణ్యము అనే నాలుగు గ్రంథములందును స్పష్టముగాను, పూర్తిగాను నిరూపితమైయున్నది.

ఈ వాదమునకు సంబంధించిన విషయ మొకటి నేటి తరమువారికి తెలియుటకు అవకాశము లేనిదిముందుగా తెలియజేయవలసియున్నది. ఈ వ్యావహారిక భాషావాదము 1906,10 లో క్రొత్తగా పుట్టినట్లు కనబడునుగాని ఇది పూర్వ సంప్రదాయమును పునరుద్ధరింపజేసినదే కాని క్రొత్తగా పుట్టినది కాదు. తెలుగు సాహిత్య

చరిత్రలో ప్రబంధములతోపాటు వచన గ్రంథములుకూడా 16 వ శతాబ్దమునుండిన్నీ రచితములగుతూ వచ్చినవి. ఈ రచనలన్నీ-ఏవో రెండుమూడు తప్ప-వ్యావహారిక భాషలోనే రచితములయినవి. అంతేకాక లక్షణ గ్రంథములందలి వివరణములు, వ్యాఖ్యానాలు మొదలయినవికూడా వ్యావహారిక భాషలోనే రచితములయినవి. వ్యావహారికభాషలో 1850కి పూర్వము రచితములయిన వచన గ్రంథములు వందలకొలదిగా ఉండెను. అచ్చుయంత్రము వచ్చిన తర్వాత ఇందులో కొన్ని మాత్రమే ముద్రితములైనవి. రావిపాటి గురుమూర్తిశాస్త్రిగారు (అనగా చెన్న నగర పాఠశాలలో తెలుగు పండితులుగా ఉన్నవారు) రచించిన ద్వాత్రింశత్సాలభంజిక కథలు 1819 లోను, పంచతంత్ర కథలు 1836 లోను అచ్చుపడినవి. అతడున్ను, అతనివంటి పండితులున్ను రచించిన వ్యాకరణములు కూడా వ్యావహారికభాషలోనే రచితములై ముద్రితములైనవి. ఇవిన్నీ, ఇట్టివే మరికొన్నికథలు, వాచకములున్ను ముద్రితములయి బడులలో పాఠ్యగ్రంథములుగా ఉండెను. వాడుక భాషలో రచితములయిన వచన గ్రంథములు కూడా బడులలో విద్యార్థులచేత చదివించడమున్ను, వాడుకభాషలోనే విద్యార్థులుతమ వచన రచన సాగించడమున్ను సత్ సంప్రదాయానుసారముగానే ఉండెనని మనమూహించవచ్చును.

ఈ విషయము 60 సంవత్సరముల కాలము మరుగుపడి యుండుటవలన ఈ తరమువారికి తెలియలేదు. మరుగుపడి యుండుటకు కారణ మేమనగా 1863 లో పరవస్తు చిన్నయ సూరిగారు పండితులయి పలుకుబడి సంపాదించి పూర్వవచన రచనా సంప్రదాయమునకు విరుద్ధముగా ప్రబంధాది పద్యకావ్యములందలి కావ్యభాషలోనే వచనరచన సాగించవలెనన్న పట్టుదలతో నిర్దుష్టముకాని నీతిచంద్రికఅనే ఒకచిన్నపుస్తకమున్ను అసమగ్రము, అనిర్ణాయకము, భ్రమ ప్రమాదములకు ఆస్పదము అయిన బాలవ్యాకరణము అనే ఒక వ్యాకరణమున్ను రచించి బడులలో పెట్టించి ప్రాచీనకావ్యభాషే పద్యకావ్యములకు మాత్రమేకాక వచనకావ్యములకు

కూడా యోగ్యమయినదన్న తన మతమును నిలబెట్టి వ్యాప్తిలోనికి తెచ్చిపెట్టి స్వర్గస్థుడైనాడు. నాటి నుండిన్ని వాడుక భాషలోగల పుస్తకములు అడుగంటినవి. కొన్ని పునర్ముద్రితము లయినా కవి హృదయమునకు విరుద్ధముగా అందులోని వాడుకభాష తొలగించి దానిస్థానములో గ్రాంథిక భాషాపరివర్తనముగూర్చి పరిష్కర్తలు ప్రకటించుట జరిగినది. అంతేకాదు; అప్పకవి మొదలయిన లక్షణకర్తలు వచనరచనా సంప్రదాయమును పాటిస్తూ రచించిన తెలివిడులు మొదలయినవికూడా వ్రాతప్రతు లన్నిటను వాడుకభాషలోనేఉన్నా అచ్చులో వాటిని కావ్యభాషలోనికి మార్చి పూర్వ సంప్రదాయమును కప్పిపుచ్చినారు.

చిన్నయ సూరిగారు పూర్వ సంప్రదాయమును తొలగించి ప్రాచీనకావ్యభాషలోనే ప్రాథమిక పాఠశాలలలో చదువుకొనే పసిపిల్లలు మొదలుకొని కళాశాలలో చదువుకొనే పెద్ద విద్యార్థుల వరకున్ను ఆబాలగోపాలం అందరున్ను కావ్యభాషలో రచితములయిన వచనగ్రంథములు చదువుకోవలెను; కావ్యభాషలో తమ రచనలన్నీ సాగించవలెను అనే నూతన సంప్రదాయమును తెచ్చిపెట్టుటవల్ల మేలుకలుగుటకు మారుగా కీడే కలిగినది.

కావ్యభాష సులువుగా పట్టుపడగల భాషకాదు. అది ఎంతో కష్టపడి నేర్చుకున్న పండితులకైనా పూర్తిగా పట్టుబడలేదని చెప్పగలము. చిన్నయసూరి మొదలుకొని నేటివరకున్ను గల రచయితలలో ఒక్కరయినా నిర్దుష్టమైన గ్రంథము రచించినవారు కనబడలేదు. పెద్ద పండితులని పేరుపొందిన వారి గ్రంథముల నుండి పూర్వలక్షణ విరుద్ధములయిన ప్రయోగములను రామమూర్తిగారు చూపించినారు. ఇట్టి దుస్థితికి కారణము లేకపోలేదు. ప్రాచీన వ్యాకరణము ఆ కాలము నాటి భాషకే లక్షణము నిరూపించినది. అదియైనా సమగ్రమయినదికాదు. కాని, అందులో భాషా తత్వమును, వ్యాకరణ లక్షణమును తెలియజేసే సూత్రములు–నిత్యాప్రవాహినీ దేశ్యా; (శబ్ద) సిద్ధిర్లోకాత్ దృశ్యా; ప్రయోగమూలం

వ్యాకరణమ్ అనేవి ఉన్నవి. కనుక ఆ ప్రాచీన వైయ్యాకరణులను మనము నిందించ నక్కరలేదు. ఆ సూత్రములను సరిగా అర్థము చేసికోకుండా తప్పుదారిని మనలను నడపించినఅర్వాచీనలాక్షణికులను, పండితులనునిందించవలెను. 'నిత్యాప్రవాహినీ దేశ్యా' అనుటచేతను దేశభాషయైన మన తెలుగు భాష నిత్యముగా తెలుగుభాషయే యైనా, ఏటిలోని నీరువలెనే మారుతూ ఉంటుందన్న భావము విశదమవుతూ ఉన్నది. శబ్దసిద్ధి లోకంబునన్ దెలియును అనుట వల్లను లోకులవాడుకనుబట్టి భాషా లక్షణము గుర్తించవలసి యున్నదనిన్ని, ప్రయోగమూలం వ్యాకరణమ్ అనుటవలన ప్రయోగాలను అనుసరించి వ్యాకరణ సూత్రాలను సవరిస్తూ ఉండవలెననిన్ని తేలినది. ప్రయోగమంటే కవి ప్రయోగమే అని అర్థము చెప్పినా, కవి ప్రయోగించే శబ్దమునకు ప్రామాణ్యము లోకమునుండే సిద్ధిస్తున్నదని చెప్పుటచేత కవికైనా, లక్షణ కర్తకైనా లోకమే ప్రమాణమని స్పష్టపడుతున్నది. అప్పకవి, తిమ్మకవి, అడిదం సూరకవి మొదలయిన లాక్షణికులు కవి ప్రయోగములను ప్రదర్శిస్తూ ప్రయోగమూలం వ్యాకరణమ్ అనే ధర్మాన్ని కొంతవరకైనా అవలంబించారు. చిన్నయ సూరిగారు లిట్టు,ల్యాట్టు, అత్తు, ఉత్తు, ముత్తు, కుజ్ మొదలయిన పారిభాషిక సంజ్ఞలతో వ్యాకరణ సూత్రాలు కట్టుదిట్టముగా పాణినివలె రచించినారని మన పండితులు సంతోషించి మెచ్చుకొన్నారేకాని కవి ప్రయోగాలను లక్షించక సూత్రాలు నిర్మించినారనిన్ని ఆ సూత్రాలనుబట్టి తిక్కనాది మహాకవుల ప్రయోగాలు లక్షణ విరుద్ధములయినవిగా ఎన్నవలసి వస్తున్నదనిన్ని, పూర్వకవుల ప్రబంధాలు అచ్చువేసేనప్పుడు పరిష్కర్తలయిన పండితులుచిన్నయ సూరి సూత్రాలనుబట్టి ఆ ప్రబంధాలలోని ప్రయోగములు తీరి కూర్చుండి దిద్ది కవుల రచనలను తారుమారుచేయుటంకూడా జరుగుతూ ఉన్నదనిన్ని గ్రహించకుండా ఉన్నారు.

ఈ దుస్థితి లెస్సగా గుర్తించిన వారు కనుకనే తిరుపతివేంకటేశ్వర కవులు

"వ్యాకరణ మొక్కత్రోవ, మ
హాకవు లొక త్రోవ, కోశ
మఖిల మ్మొక త్రో
వై కనుపట్టెడి నీ భా
షా కావ్యమ్ములను దఱచు
చదివిన కొలదిన్ ॥

"తొలిబాసయందువలె నీ
తెలుంగు బాస వెలయించు
దీపము లేమిన్
విలువగల కవుల లక్ష్య
మ్ములె తా మీ భారమెల్ల
మోయంగ వలయున్ ॥

అని పలికారు. అంతేగాక,

"కాలముఁబట్టి దేశమును
గాంచి ప్రభుత్వము నెంచి దేశ భా
షా లలితాంగి మాఱుటది
సత్కవి సమ్మతమౌట, నన్యదే
శ్యాలును నాంధ్రభాషఁ గల
వౌటను నౌచితిఁబట్టి మేము క
బ్బాలను వాడుచుంటిమని
పండితు లేగతి నొప్పకుందురో."

అని పద్యకావ్య రచన విషయములో ఔచితినిబట్టి క్రొత్తపాతల కలయిక ఎట్లు చేయనగునో విశదపరచినారు. వీరిలో చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు ప్రభుత్వ ప్రథమాస్థానాంధ్ర కవిగారు తమ వచన రచనలు వ్యావహారిక భాషలో సాగించినారు.

ప్రారంభదశలో వ్యావహారిక భాషావాదాన్ని ఖండించుటకు పిఠాపురం మహారాజావారి రాజపోషణమున ఏర్పడ్డ ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ఊరూరా సభలు జరిపించి ఈ వాదాన్ని ఆమోదించరాదని తీర్మానాలుచేస్తూ ప్రభుత్వమునకు మహజర్లు పంపిస్తూఉన్న కాలములో అట్టిసమావేశములలో ఒకదానికి అధ్యక్షులుగా ఉండిన కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఈ వాదము నెట్లు అంగీకరించుట జరిగినదో ఈ తరమువారికి తెలియజేయవలసియున్నది.

1916 లో గిడుగు రామమూర్తిగారు కొవ్వూరులో జరిగిన ఆంధ్ర సారస్వత మహాసభయందు ఈ వాదమునుగూర్చి ఉపన్యసిస్తూ ఉండగా వీరేశలింగంపంతులుగారు ఏదో తమ సొంత పని ఉండి కొవ్వూరు రావడం దూరంగా నిలబడే రామమూర్తిగారి ఉపన్యాసం వినడం తలవని తలంపుగా సంభవించినది. ఉపన్యాస విషయం ఆకర్షకంగా ఉండడం చేత పంతులుగారు చాలాసేపు

ఆగి విని "రామమూర్తిపంతులు చెప్పినమాటలు తీసివేయడానికి వీలులేదు. ఆయనవాదం అంగీకరించవలసినదే" అని అన్నారట. ఈ మాటలు ఆమరునాడు రాజమహేంద్రవరంలో ఉండగా రామమూర్తిగారికి తెలిసినవి. ఆ పిమ్మట వీరేశలింగంపంతులుగారిని కలుసుకొని రామమూర్తిగారు తమ వాదాన్ని పూర్తిగా వివరించి చెప్పడం జరిగింది. దాని ఫలితంగా 28-2-1919 తేదీని రాజమహేంద్రవరంలో ఒక విద్వత్సభ జరిగినది. ఆ సభకు పంతులుగారే అధ్యక్షత వహించారు. ఈక్రిందను వివరించిన తీర్మానాలతో వర్తమానాంధ్ర భాషాప్రవర్తక సమాజము అనే పేర నొక సమాజము స్థాపించడం జరిగినది. దానికి పంతులుగారు అధ్యక్షులుగాను, గిడుగు రామమూర్తిగారున్ను, జయంతిగంగన్నగారున్ను కార్యదర్శులుగాను, సభకు హాజరైనవారందరున్ను సమాజ సభ్యులుగాను నియమితులు కావడము జరిగినది. అప్పుడు సభా సమ్మతములైన తీర్మానములు:—

1. వ్యావహారిక భాషకున్ను గ్రాంథిక భాషకున్ను ఇప్పుడున్న వ్యత్యాసము సాధ్యమయినంత వరకు తగ్గించి భాష సులభము చేయుట,

2. జ్ఞానాభివృద్ధికై వ్రాయు గ్రంథములలో సాధ్యమయినంత వరకు వ్యవహారములో ఉన్న రూపాలే ఉపయోగించి వ్యవహారములో లేనివి విడిచిపెట్టుట,

3. వ్యవహారములో ఆవశ్యకములు కాకుండ ఉపయోగించు చున్న అన్యదేశ్యపదములను విడిచి ఆవశ్యకములైన పదములనే చేర్చుకొనుట.

4. పై ఉద్దేశముల ననుసరించి గ్రంథములను వ్రాయుట.

వీరేశలింగంపంతులుగారు స్వతః సిద్ధముగా సంస్కరణ ప్రియులు. ఏ వాతావరణమునందైనా చెడుగు కనబడినయెడల దానిని నిర్మూలము చేసి మంచిని ఉద్ధరించుటకు చూచే పట్టుదల గలవారు. సంఘమందలి దురాచారములను లంచగొండితనమును పడుపువృత్తిని పోగొట్టుటకు చాలా కృషిచేసినవారు. తెలుగు సాహిత్య విషయములో కూడా మొట్టమొదట నలుగురు పండితులలోపాటు చిన్నయసూరి పెట్టిన వరవడిని విగ్రహతంత్రము

వ్రాసినా అట్టి రచనలవలన మేలు కలుగదని గ్రహించి సులభశైలిని గ్రంథరచన సాగించినారు. ప్రయోగములకంటెను లక్షణములకు ప్రమాణమెక్కువని కొద్దిగా భ్రమపడిన్ని వ్యావహారికభాషలో ఉత్తమ వచనరచన సాగించిన యెడల పండితలోకము తనను తక్కువగా చూచునేమోయను కొంచెము సందేహము తోచుట చేతను వాడుకభాష కేవలము ప్రహసనములకు మాత్రమే ప్రయోగించినారు. రామమూర్తి గారి వాదములో గల యాథార్థ్యమును పూర్తిగా గ్రహించిన తర్వాత వర్తమానాంధ్ర భాషా ప్రవర్తన సమాజమునకు అధ్యక్షులుగా నుండుటకు సమ్మతించుటేకాక, వ్యావహారిక భాషకు వ్యాకరణముకూడా రచించుటకు పూనుకొన్నారు. కాని దురదృష్టవశమున వారు 27-5-1919 తేదీని కాలధర్మము నొందినారు. వారి మరణమువల్ల వ్యావహారిక భాషావాదమునకు తీరనిలోటు వాటిల్లినది.

అయినా పంతులుగారు కలిగించిన ప్రోత్సాహము, వారి ప్రభావము కొంతవరకు ఫలించినవి. ఆ నాటినుండిన్ని ఈ వాదమును అంగీకరించిన వారి సంఖ్య అధికమయినది. పంతులుగారు తమ స్వీయచరిత్రలో (పు. 156) "...పూర్వవ్యాకరణము లన్నియు పద్యకావ్య రచనకొఱకే వచన కావ్యములు లేని కాలములో పుట్టిన వగుటచేత నందలి లక్షణము లనేకములు వచనకావ్యాభివృద్ధికి తగవనియు, నిప్పటికాలమునకు దగినట్టుగా వ్యాకరణము మార్చుకోవలయుననియు నేనను కొని ఈ కాలమునకును వచన రచనాభివృద్ధికిని తగినట్టుగా నొక నూతన వ్యాకరణమును వ్రాసి దానికి లక్ష్యముగా నొక వచన కావ్యమును జేయవలెనని పలుమాఱు దలపోసితిని.

అయినను వృద్ధుడను దుర్బల శరీరుడనునగుటచేత నట్టి పని నాకిప్పుడు సాధ్యము కాదేమో? కాదననేల! ఈశ్వరానుగ్రహమున్న యెడల సాధ్యము కావచ్చును".

ఈ వాక్యములవలన కలిగిన ప్రోత్సాహముచేతను రామమూర్తి గారు సంపాదకులుగా నడిపిన తెలుగు పత్రిక సంచికలలో ఈ

వాదమునకు సంబంధించిన వ్యాసములు చదువుటచేతను వారి ఉపన్యాసములు వినుటచేతను తెలుగు రచయితలు అనేకులు వ్యావహారిక భాషలో రచన సాగించుటకు సాహసించినారు.

1933 నవంబరులో రాజమహేంద్రవరమున రామమూర్తిగారి తమ సప్తతి జన్మదినోత్సవము జరిగినప్పుడు నవ్యసాహిత్యపరిషత్తు వారు రామమూర్తిగారిరచనలలో ముఖ్యమయినవన్నీ నాలుగుగ్రంథములుగా ప్రకటించినారు. వ్యాసావళి, గద్య చింతామణి, ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజము, బాలకవి శరణ్యము. ఇది వ్యాప్తిలోకి వచ్చిన తర్వాత వ్యావహారిక భాషావాదము తెలుగు దేశమందు బహు జనసమ్మతమైనది. ఆంధ్ర పత్రిక మొదలయిన దినపత్రికలు; మాసపత్రికలు, ఉగాది సంచికలు మొట్టమొదట వ్యావహారిక భాషావాదమును ప్రతిఘటించినా, క్రమక్రమముగా వాడుకభాషలో రచితములయిన వ్యాసములను, కథలను, కథానికలను, ఏకాంకికలను ప్రకటిస్తూ వచ్చినవి.

1940 జనవరి 15 వ తేదీని రోగపీడితులై యుండిన్ని ఒక పత్రికా రచయితల సమావేశమందు రామమూర్తిగారు తమ తుది పలుకులు పలికి 22 వ తేదీని స్వర్గస్థులయినారు. తమ వాదము దేశములో చాలామంది అంగీకరించుటచేత సకల విషయములను గూర్చిన్ని వచన గ్రంథములు వ్యావహారిక భాషలో రచితములవుతూ ఉన్నందుకు తమ సంతోషమును తెలియజేస్తూ ఇంకనూ కానున్న పనిని సూచిస్తూ అందులకు పత్రికలవారిని, తక్కిన వారిని ప్రోత్సహిస్తూ వారానాటి సమావేశమందు పలికిన తుది పలుకులు మనము లెస్సగా గుర్తించ వలసి యున్నది.

“...నా వాదము అందరూ అంగీకరించ లేదనిన్ని విశ్వవిద్యాలయముల వారున్ను విద్యాశాఖవారున్ను వ్యావహారిక భాషను గ్రహించ లేదనిన్ని నేనెరుగుదును. కాని, నా వాదము సరియైనదన్న విశ్వాసము నాకు పూర్తిగా ఉండుటవల్ల ఎప్పటికైనను తెలుగువారందరూ నా వాదముపూర్తిగా అంగీకరించక పోరన్న నమ్మకం నాకు కలదు.”

ఈ మాటలవలన మరికొందరు ఎక్కువగా వ్యావహారిక భాషా వాదమును గ్రహించినవారయినారు. రేడియోవారు మొదటి నుండిన్ని తెలుగు ప్రసంగాలు వాడుకభాషలోనే జరుగనిస్తున్నారు. తుదకు కళాప్రపూర్ణులున్ను మహామహోపాధ్యాయులును ప్రభుత్వాస్థానాంధ్ర కవులున్నూ అయిన శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు మొట్టమొదట వ్యావహారికభాషా వాదమును తమ వజ్రాయుధంతో హత్యచేయుటకు సాహసించిన వారే అయినా, కొంతవరకు ఈ వాదమును అంగీకరించిన వారే అయినారు. పత్రికలు జనసామాన్యమునకు అందుబాటులో ఉండే వాడుకభాషలోనే రచనలు సాగించవలెనని మొన్న ఉగాది నాటి రేడియో ప్రసంగము వల్ల గాలిదుమారము చెలరేగినప్పుడు ఆంధ్రప్రభలో తమ అభిప్రాయము వెల్లడించినారు.

ఈనాటికి వందలకొలదిగా గ్రంథములు వాడుక భాషలో ప్రకటితములగుచున్నవి. 1914 లో గల పరిస్థితులకున్ను, నేటి పరిస్థితులకున్ను ఈ విషయంలో చాలా తారతమ్యము కనబడుతూఉన్నది అందుచేత విశ్వవిద్యాలయముల వారున్ను, ప్రభుత్వ విద్యాశాఖ వారున్ను ఈ వాదమును అంగీకరించి వ్యావహారిక భాషలో సర్వతోముఖమయిన రచన సాగించవలెను.

అయితే ఒక చిన్న సందేహము కొందరిని బాధిస్తూఉన్నది. వాడుకలో గల శబ్దరూపములు వివిధ రూపములనున్నవి; ఒకొక్క సంఘం వారు ఒకొక్క మండలము వారు ఒకొక్క విధంగా శబ్దరూపములను వాడుతున్నారుగదా వీటిలో ఏవి సాధువులనవలెను ? ఏవి గ్రహించవలెను ? ఏవి అగ్రాహ్యములనవలెను ? శిష్టజనవ్యవహారమంటే ఎవరు శిష్టులు ? ఎవరు కారు ? ఈ మొదలుగాగల ప్రశ్న పరంపరలు వేస్తున్నారు కొందరు. వీటికి సమాధానము ప్రకటితములగుతూవున్న రచనలలోనే కనబడుతూవున్నది. మాండలిక భేదములు గ్రాంథికభాషకూ తప్పవు; వ్యావహారికభాషకూ తప్పవు. ప్రబంధాది ప్రాచీన కావ్యాలలో ఏ మండలమందలి వారు ఆ మండలమందలి శబ్దములను వాడినారు.

ఆంధ్రభాషార్ణవములో అగ్నిమండలము లందలి రూపములను పర్యాయ పదములుగా చేర్చుకొనుట జరిగింది. పప్పు అంటే రాయలసీమవారికి తెలియదని సర్కారు జిల్లాలవారు వాడుక చేయకపోతే 'బేడలు' అంటే సర్కారు జిల్లాలవారికి తెలియదని రాయలసీమవారు వాడుక చేయకపోతే వీరికీ వారికీ సామాన్యంగా వాడుకలోగల పదము మరియొకటి లేకపోయినప్పుడు వ్యవహార హాని కలుగుతుంది. ఎవరి మండలములోని భాషవారు ప్రయోగిస్తారు. తక్కిన మండలములవారు క్రమక్రమముగా అర్థముచేసుకొంటారు. ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక, జనవాణి విశాలాంధ్ర, వాణి మొదలయిన పత్రికలు దేశమందంతటా వ్యాప్తిలో ఉన్నవి. వాటిలోని భాష వ్యావహారిక భాషగానే ఉన్నది. అవి అందరికీ బోధపడుతూనే ఉన్నవి. రేడియో ప్రసంగాలు అందరూ వింటున్నారు. అందరికీ బోధ పడుతున్నవి.

సరే "పత్రికలు యెట్లున్నా సాహిత్యకళాధర్మం కలవికావు. పాఠశాలలలోను, కళాశాలలలోను పాఠ్యగ్రంథములుగా ఉండవలసిన వాటిలోని భాష ఉన్నతశ్రేణిలో ఉండవలెనుగదా" అని కొందరంటున్నారు. ఇట్లనే వారి మనస్సులో చాలాకాలంనుండి అనుశ్రుతంగా వస్తూవున్న ఒక అభిప్రాయం పట్టుకొని విడవకుండా ఉన్నదనవలెను. సాహిత్యధర్మం వాడుకలో ఉన్న శబ్దరూపముల కంటె పాతవడ్డ శబ్దరూపముల వల్ల ఎక్కువగా ఉంటుందనుకొనడం ఒక భ్రమ.

"పలుకుల పొందులేక రసభంగము సేయుచు బ్రాతవడ్డ మా
టలఁ దమనేర్పుఁ జూపి యొకటన్ హృదయం బలరింపలేకయే

పొలమునఁ గాని యట్టిక్రమ
ముం దమ మెచ్చుగలోక మెల్ల న
వ్వులఁ బొరయంజరించు కుకవుల్
ధరదుష్పొటులట్లు చూడఁగన్"

అని తిక్కన మహాకవి చెప్పిన మాటలు ఏకాలమందైన ననుపాలింప దగినవి రసజ్ఞులయిన రచయితలు సరికొత్తమాటలతో తమ కావ్యం రచిస్తున్నారు.

వ్యావహారిక భాషాలక్షణ మొకటి నిరూపిస్తేనే కాని ఏ యే

రూపములు గ్రాహ్యములో ఏవి అగ్రాహ్యములో తెలియక ఉపాధ్యాయులు విద్యార్థులు తొట్రుపాటు పడవలసివస్తుందన్న భయము వలన విద్యాశాఖవారున్ను విశ్వవిద్యాలయమువారున్ను వ్యావహారిక భాషావాదమును అంగీకరించలేకుండా గతానుగతికంగా నిలిచి ఉన్న గ్రాంథికభాషనే ఆమోదిస్తున్నారనికొందరంటున్నారు. అందుకు తగిన పనిఏదో ఆలోచించక కాలక్షేపము చేయుటవలన ప్రయోజనము లేదు. ఇప్పుడు విద్యార్థులు బడులలోను, కళాశాలలలోను చదువుకొంటూ ఉన్న పాఠ్యగ్రంథాలు ఏదో గ్రాంథికభాషలో ఉన్నట్టు కనబడుతూఉన్నా ఏందునూ పొందని కృతకభాషలో ఉన్నదన్న విషయం విద్యాధికారులు గ్రహించకుండా ఉన్నారు. అర్ధానుస్వారాలు, శకటరేఫలు ఉండవలసిన చోట్ల ఉండవు. ఉండకూడని చోట్ల ఉంటున్నవి, "కుంచెడు మట్టిలోఁ జేసెదరు" అన్న వాక్యము గ్రాంథికభాషలో ఉన్నట్టే కనబడినా తద్ధర్మార్థక క్రియారూపమునకు మారుగా భవిష్యదర్థక క్రియారూపము వాడుటచేతను ఒకారము దుష్టమైనదన్న విషయము రచయితలుగాని, పాఠకులుగాని సాధారణముగా గుర్తింపరు. ఇట్టి దోషములు అనేకముగా పాఠ్యగ్రంథములలో కనబడుతూ ఉన్నా విద్యాధికారులు పట్టించుకోకుండా ఉన్నారు. 'మీరు వచ్చిరి' అనే ప్రయోగము పెద్దపెద్ద కవులే చేసినారు. ఇందులో గల తప్పు రచయితలు గాని, పాఠకులు గాని సాధారణముగా గుర్తించరు. వాడుకలో లేని రూపము గ్రాంథికభాషలో రచిస్తున్నామన్న సంతోషములో గ్రంథములో ప్రయోగిస్తే అది తప్పో ఒప్పో ప్రాచీనభాషాలక్షణము లెస్సగా చదువుకొన్న ఏ కొద్దిమంది పండితులో తప్ప తక్కినవారు గుర్తించలేరు. ఇట్టి పరిస్థితులలో విద్యార్థులు గ్రాంథికభాషలో తమ వ్యాసరచన సాగించవలెనని నిర్బంధించడం వలన వారు కృతకభాషలో రచిస్తున్నారు. వ్యావహారిక భాషలో ఇట్టి తప్పులు చిన్నపిల్లలయినా చేయరు. "మీరు రేగుపెంచవలెను" "చనుదేరుటకు" అని కవులు గ్రాంథికభాషలోరచిస్తున్నామన్న కావ్యాలలో ప్రయోగిస్తున్నారు. "మీరు వచ్చవలెను" అని

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | REHB02F260 |
| పుస్తకం పేరు | అభ్యుదయ |
| తారీఖు | 22/12/23 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 159 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, 153 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | pragati |
| పేజీలు విడదీసినది | pragati |
| స్కాన్ చేసినది | Nandhu |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |